
జీవకోటి కంతటికీ బ్రిటింగు హక్కు ఉంది!
జంతువుల చేత ఓట్లు వేయించు-
-క్రాంటూరం"!!
3

# సంప్రదాయాల సర్వోత్తమ సృష్టి ...ఆప్కో




ప్రఖ్యాత నృత్యకళా తపస్విని శోభానాయుడు ఈ భంగిమలో
ధర్మవరం సిల్కు సౌందర్యాలను ద్విగుణీకృతం చేస్తోంది!

kiron/apco/85/s4






ముఖచిత్రం : పుడమికి వెలుగు

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

విజయవంతంగా ప్రదర్శించబడుతున్న చిత్రం



మీ చిన్నారి పాప నూనూగు బుగ్గలపైన మీరిచ్చే ముద్దులా సున్నితంగా




పాప చిన్నారి లోకంలో యిమిడే అలాటి అతి ప్రత్యేకమైన అతి కొద్ది వస్తువుల్లో ఒకటి - జాన్సన్స్ బేబీ సోప్.

ఆపేక్ష చిలికే మీ స్పర్శలా మృదువుగా చేస్తుంది జాన్సన్స్ బేబీ సోప్‌లోని లెనోలిన్ అనే పదార్థం. మరి దానిలోని ఆ సువాసన మీ పాపపై చిలుకుతుంది, దాంతో యిక పాపకు చక్కగా సహజమైన ఆ సువాసన.

**జాన్సన్స్ బేబీ సోప్**
**శుద్ధమై...సౌమ్యమై...భద్రమైనది.**

© J&J

Johnson & Johnson

OBM/2193 TEL





సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 51 మే 1985 సంచిక 5


ఇది విద్యార్థులకు పరీక్షలకాలం. కె.జి. నుంచి పి.జి. వరకూ విద్యార్థులకు పరీక్షలు ఏప్రెల్, మే మాసాల్లో జరుగుతూ వుంటాయి. అప్పుడప్పుడూ పరీక్షలు అనివార్య కారణాలవల్ల వాయిదాపడుతూ వుంటాయి. అనివార్య కారణాల్లో ఏ రకమైన కారణాలైనా చేరివుండొచ్చు. సిలబస్ పూర్తికాకపోవటాన విద్యార్థులు పరీక్షల్ని వాయిదా వేయమని అడగవచ్చు; అధికార్లే చడీచప్పుడు కాకుండా వేయవచ్చు. విద్యాసంవత్సరం ఆలస్యంగా ప్రారంభం కావటాన, పరీక్షలు ఆ మేరకు ఆలస్యంగా జరగవచ్చు.

ఉదాహరణకు కొన్ని విశ్వవిద్యాలయాల్లో స్నాతకోత్తరస్థాయిలో సంవత్సరాంతపు పరీక్షలు ఆగస్టు, సెప్టెంబర్ నెలలలో జరుగుతూ వుండటాన్ని మనం చూస్తున్నాం. వీటి ఫలితాలు సాధారణంగా నవంబరు, డిసెంబర్లలో వస్తుంటాయి. విద్యాసంవత్సరం ఎప్పటిదో అయోమయం కలిగే దుస్థితి ఏర్పడుతూ వుంటుంది. కొన్ని దేశాల్లో సినిమాహాలుల్లో ఉదయం తొమ్మిదినుంచి రాత్రి

పన్నెండువరకూ అవిచ్ఛిన్నంగా సినిమాలు చూపిస్తూ వుంటారట. అట్లాగే మన విశ్వవిద్యాలయాల్లో పరీక్షలు సంవత్సరం మొత్తం అన్ని మాసాల్లోనూ జరుగుతూ వుంటాయి. ఆదేమంటే విశ్వవిద్యాలయాలు స్వయంప్రతిపత్తి గల విద్యాలయాలు.

గత కొన్ని సంవత్సరాలుగా పరీక్ష పేపర్లు 'లీక్' కావడం అనవాయితీగా వస్తోంది. ఎస్.ఎస్.సి. మెట్రిక్, ఇంటర్మీడియట్, డిగ్రీ తరగతులు, ఇంజనీరింగ్, మెడికల్ ప్రవేశపరీక్షల పేపర్లు పరీక్షలకు ముందే బయటపడిపోతున్నాయి. ఆ బయటపడడం ఎంత దూరమొచ్చిందంటే, కొన్ని వార్తాపత్రికలకు యథాతథంగా ఎక్కుతున్నాయి. మన విద్యావిధానంలో ఈ పరిణామం అత్యంత శోచనీయమైంది. విద్యాప్రమాణాలు క్షీణించడానికి ఇదో కారణం. పరీక్షాపత్రాలు బయటపడ్డాక అవి ఎందుకు బయటపడ్డాయో, ఎట్లా బయటపడ్డాయో, అందుకు కారణాలేమిటో, కారకులెవరో కమిటీలు, దర్యాప్తులు, పోలీసు ఎంక్వయిరీలు మొదలైన వాటిద్వారా రాబట్టడానికి అధికార్లు ప్రయత్నిస్తున్నారు. కాని పరీక్షాపత్రాలు బయటపడకుండా గట్టి ప్రయత్నాలు చేస్తున్నట్లు లేదు. గట్టి ప్రయత్నాలు చేస్తున్నా, తీవ్రమైన చర్యలు తీసుకుంటున్నా ఫలించడంలేదేమో! ఈ సంవత్సరం కూడా కొన్ని పబ్లిక్ పరీక్షాపత్రాలు ముందుగానే విద్యార్థుల హస్తాల్ని అలంకరించి, వారి ఆనందానికి కారణభూతాలయ్యాయి. విద్యాప్రమాణాలు పెంచడానికి పరీక్షల నిర్వహణను కట్టుదిట్టం చెయ్యాల్సిన అవశ్యకత ఎంతైనా వుంది. మనది ఆర్థికంగా వెనకబడిన దేశం. ఇట్లాంటి దేశాల్లో విద్యావిధానానికి పరీక్షల నిర్వహణ పటిష్ఠత ఎంతో దోహదం చేయాల్సిన అవశ్యకత వుంది. విద్యావేత్తలు, విద్యా శాఖాధికార్లు, ప్రభుత్వం ఈ విషయంలో వెంటనే జోక్యం చేసుకొని, పరీక్ష పేపర్లు పరీక్షకు ముందే బయటపడే అవాంఛనీయ స్థితిని అరికట్టడానికి చిత్తశుద్ధితో కృషిచేయాలి. పరీక్షల విధానంలో సముచితమైన సంస్కరణల్ని ప్రవేశ పెట్టాలి. 'ఓపెన్ బుక్ సిస్టమ్' ఈ ప్రమాదనివారణకు ఏమాత్రం సహాయపడుతుందో ఆలోచించాలి.

సార్వత్రిక విశ్వవిద్యాలయ భావనపట్ల ఇప్పుడు విద్యావేత్తలు ఎక్కువ మొగ్గు చూపుతున్నారు. మన ప్రియతమ ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ కూడా ఓపెన్

యూనివర్సిటీలను దేశంలో ఎక్కువగా నెలకొల్పాలనీ, అన్ని వయస్సులవారికీ ఉన్నతవిద్యను అందుబాటులో ఉంచాలనీ విద్యావిధానాన్నీ గురించి మాట్లాడుతూ నొక్కి వక్కాణించారు జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయాన్ని నెలకొల్ప డానికి ప్రయత్నాలు చురుగ్గా సాగుతున్నాయి. దానికి ఆచార్య బి. రాంరెడ్డిగార్ని ఉపాధ్యక్షులుగా నియమించడం తెలుగువారికి గర్వకారణం. ఇంతకుముందు వరకూ వారు ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా ఉంటూ, ఆ విశ్వవిద్యాలయం మన దేశానికి శిరోమణిగా ఖ్యాతినార్జించటానికి కృషిచేశారు. మామూలు కళాశాల విద్యలో బోధనాపద్ధతి ఒకేరకంగా వుంటుంది. ఓపెన్ యూనివర్సిటీలో బోధనాపద్ధతి బహుళంగా ఉంటుంది. పాఠ్య ప్రణాళిక ప్రకారం పాఠ్యరచన, రేడియోద్వారా పాఠాల బోధన, ఇట్లా బహుళసాధనాల్ని ఉపయోగించడంద్వారా విద్యాబోధన అనక్తిదాయకంగా ఉండగలదు సార్వత్రిక విశ్వవిద్యాలయ తరహా విద్యాబోధన మంచి ప్రాచుర్యంలోకి రావడానికి అవకాశా లున్నాయి. కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో బోధనాపద్ధతి శంఖంలో తీర్థం తీరుకు వచ్చింది. 'తాంబూలాలు ఇచ్చాం- తన్నుకు చావండి' రీతిలో విద్యా బోధన జరుగుతూన్నది. అధ్యాపకులు, ఆచార్యులు తమ తమ ప్రమోషన్లలో విదేశీ పర్యటనల్లో చూపిస్తూన్న శ్రద్ధా, ఆశక్తి, అభిరుచి - చిత్తశుద్ధితో పాఠాలు చెప్పడంలో కనబడ్డంలేదు. కాలేజీలు, యూనివర్సిటీలు రాజకీయ కురుక్షేత్రా లుగా మారుతున్నాయి ఆ మధ్య ఒక విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా ఉన్న వారు సంవత్సరానికి ఎన్ని క్లాసులు తీసుకుంటున్నారనే ప్రశ్న వచ్చి, సర్వే చేయించడం జరిగింది. 5 శాతం ఆచార్యులు అసలు క్లాసులే తీసుకోలేదు. 25 శాతం ఆచార్యులు మూడు క్లాసులు చొప్పున తీసుకున్నారు. 40 శాతం ఆచార్యులు తొమ్మిది క్లాసులు తీసుకున్నారు. మిగతా శాతం ఆచార్యులు వారానికి ఒక్క క్లాసు చొప్పున తీసుకున్నట్టు వెల్లడైందట. రానురాను విద్యాబోధనలో రాజకీయాలు, వాణిజ్యధోరణి, కులతత్వం హెచ్చుగా చోటుచేసుకుంటున్నట్టు తెలియవస్తూంది.

విద్యకు ఆలయాలుగా ఉండాల్సినవి రాజకీయాలకు నిలయాలుగా మారడం

ఎవ్వరూ క్షమించరు. ఈ దృగ్విషయాన్ని విద్యావేత్తలు, విద్యాధికార్లు, విద్యా మంత్రులు గ్రహించి సంస్కరణలు ప్రవేశ పెట్టాల్సిన తరుణం ఆసన్నమైంది. విద్య పద్దుకింద ఏటా ప్రభుత్వం సముద్దేశంతో కొన్ని వందలకోట్లు వ్యయపరుస్తోంది. ఆ వ్యయానికి సత్వర ఫలితాలు లాభవష్టాల రూపంలో కనబడకపోవచ్చు. కాని దీర్ఘకాలంలో సమాజం మొత్తానికే సత్ఫలితాలు కలగాలి.

ఈ నాటి విద్యావిధానంలో లోపాలకు ఏ ఒక్క వర్గమూ పూర్తిబాధ్యత వహించాలని ఎవ్వరూ చెప్పరు. దేవుడి పెళ్ళికి అందరూ పెద్దలే అన్నట్లు ఎవరికి వారు బాధ్యతల్ని తప్పించుకోవడానికి ప్రయత్నించరాదు. సమాజాభ్యుదయానికి విద్య మూలవిరాట్టు అని గమనించి, విద్యాబోధన, పరిపాలన, ప్లానింగ్, కార్యక్రమాల అమలులో ప్రతివారూ చిత్తశుద్ధితో వ్యవహరించాలని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.

వచ్చే సంచికలో పూర్తినవల

ఆ శా జ్యో తి

రచయిత్రి: ఐ కవిత

పొత్తూరు నాగేశ్వరరావు  ఆధునిక నీతికథలు

గుంటూరు జిల్లాలో ఓ మారుమూల గ్రామంలో మూడెకరాల శేరీమాగాణి అమ్మి, వ్యాపారం చేసే ఉద్దేశంతో రెండు దశాబ్దాలక్రితం హైదరాబాద్ వచ్చాడు లోకేశ్వర్రావు. ఆయన పెద్దగా చదువుకోలేదు అయితే జీవితం అనే విద్యాలయంలో ఎంతో చదువుకున్నాడు. అనుభవమే ఎన్నో డిగ్రీల్ని అదృశ్యంగా కట్టబెట్టింది. తెచ్చిన సొమ్ముతో వారంరోజులపాటు ఆలోచించి ఓ చిన్న ప్రింటింగ్‌ప్రెస్ పెట్టాడు. ఒక ట్రెడిల్, కటింగ్ మెషీన్, జాబ్‌వర్క్ టైపులతో. మొదట్లో ఆర్నెల్లపాటు వెడ్డింగ్‌కార్డ్సు, లెటర్‌ప్యాడ్స్, విజిటింగ్‌కార్డులు మొదలైన జాబ్‌వర్కులు చేసేవాడు. సంవత్సరం తిరగకముందే బుక్‌వర్క్ మొదలెట్టాడు; సింగిల్‌డెమ్మీ మెషీన్ కొన్నాడు. ప్రెస్ ఆవరణలో మరో పోర్షన్ అద్దెకు తీసుకున్నాడు. ప్రింటింగ్ వ్యాపారాన్ని పెంచాడు.

లోకేశ్వర్రావు కష్టజీవి. తాను చేసే పనిమీద పూర్తి విశ్వాసం గలవాడు. తన వ్యాపారమార్గంలో క్రమేపీ మెట్లెక్కి, అంతిమ ధ్యేయానికి చేరుకోవడం ఆయన ఆదర్శం. ఆదర్శసాధనకు చిత్తశుద్ధి, పట్టుదల, కృషి తోడ్పడ్డాయి. మరో మూడేళ్ళలో రెండు మెషీన్లు కొన్నాడు. ఆటోమేటిక్ డబుల్‌డెమ్మీ, కలర్‌వర్క్ కోసం ఆటోమేటిక్ ట్రెడిల్, టైపు పెంచాడు. బుక్‌వర్క్‌లో క్వాలిటీకి ప్రాముఖ్యమిచ్చాడు. అచిరకాలంలోనే మంచి ప్రింటర్‌గా పేరుతెచ్చుకున్నాడు.

నాలుగేళ్ళు గడిచాయి.

లోకేశ్వర్రావు ప్రింటింగ్ వ్యాపారం మూడు పువ్వులూ ఆరు కాయలుగా అభివృద్ధిచెందింది. ప్రింటింగ్ ఆర్డర్లు విపరీతంగా వొచ్చి పడుతున్నాయి. అంతకుముందు తానే లెక్కలు వ్రాసుకొనేవాడు; తానే ప్రూఫులు దిద్దుకొనేవాడు; అవసరమైతే తానే కంపోజ్ చేసేవాడు; తానే మెషీన్ వేసేవాడు. ఇప్పుడు అది సాధ్యపడడంలేదు ఒక మేనేజర్ను, అకౌంటెంటునూ, ప్రూఫ్‌రీడర్ని నియమించాడు. ప్రింటింగ్ సిబ్బందిని పెంచాడు.

ఇంకో నాలుగేళ్ళలో లోకేశ్వర్రావు హైదరాబాద్‌లో 'ఏ'క్లాసు ప్రింటర్ల జాబితాలో చేరాడు. డామినెంట్ డబుల్‌కలర్ ఆఫ్‌సెట్ మెషిన్ను తెప్పించాడు. ప్రింటింగ్ టెక్నాలజీలో వస్తున్న మార్పులప్రకారం తానూ ప్రెస్ను ఆధునికంగా సరిదిద్దుకోవాలనుకున్నాడు. బ్యాంకునుంచి పుష్కలంగా ఋణ సౌకర్యం లభిం

చింది. ప్రెస్ ఆవరణనూ, దానిపక్కన మూడొందల గజాల ఖాళీస్థలాన్నీ కొన్నాడు.

మరికొన్ని సంవత్సరాలకు ఫోటో కంపోజింగ్ యూనిట్‌ను, మల్టీకలర్ మెషీన్‌ను, ప్రోగ్రామాటిక్ కటింగ్‌మెషీన్‌నూ తెప్పించి, కొన్ని యూనిట్లను ఎయిర్ కండిషన్ చేయించి, ఒక ఎం.బి.ఎను ఎగ్జిక్యూటివ్‌గా నియమించి, తాను మేనేజింగ్ డైరక్టరుగా ఉండసాగాడు లోకేశ్వర్రావు. కలర్‌వర్క్‌మీద దృష్టిని కేంద్రీకరించాడు. అమెరికా, ఇంగ్లాండ్, వెస్ట్‌జర్మనీ మొదలైన దేశాలు తిరిగొచ్చి ప్రింటింగ్ టెక్నాలజీలో అధునాతన పద్ధతుల్ని అధ్యయనంచేసి వచ్చాడు.

హైద్రాబాద్‌లోని పెద్దపెద్ద కంపెనీలు, అడ్వర్టయిజ్‌మెంట్ ఏజన్సీలు, ప్రభుత్వసంస్థలు విపరీతంగా ప్రింటింగ్‌వర్క్‌ను ఇవ్వసాగాయి. లోకేశ్వర్రావు ప్రెస్ టర్నోవర్ ముప్పై, నలభై లక్షలకు చేరుకుంది.

ఒకరోజు ఒక కెమికల్ కంపెనీ ఎం.డి. లోకేశ్వర్రావుకు, టెలిఫోన్‌లో మూడు రంగుల్లో కేటలాగ్‌ను 'సిక్స్ థౌజండ్' కాపీలు ప్రింట్ చేయమని చెప్పాడు. డిజైన్ కలర్ కాంబినేషన్ మోడల్‌ను పంపించాడు. 'సిక్స్‌థౌజండ్' ఆర్డరును 'సిక్స్టీ థౌజెండ్' ఆర్డరుగా విని, మేనేజరుతో చెప్పి ఆ విధంగా ప్రింట్ చేయించాడు. ఆ కెమికల్ కంపెనీవారు ఆరువేలు మాత్రమే తీసుకున్నారు. మిగతా యాభైనాలుగువేలకు తాము ఆర్డరు ఇవ్వలేదన్నారు. లోకేశ్వర్రావు మేనేజరుపై మండిపడ్డాడు. మేనేజరు పీళ్ళు నమిలాడు. "తాము ఆ విధంగానే__"

"మీరే పొరపాటుగా అలా వినివుంటారు. నే నెప్పుడూ తప్పుగా వినను" అన్నాడు లోకేశ్వర్రావు గట్టిగా.

మేనేజరు నోరు మూసుకొన్నాడు - ఎదురుచెబితే ఉద్యోగానికి తిలోదకాలు ఇచ్చుకోవాల్సివస్తుందని.

"మీ తప్పువల్ల ప్రెస్ నష్టపడటానికి వీల్లేదు నెలకు మీ జీతంలో రెండొందలచొప్పున రికవరీ చేయిస్తాను" అన్నాడు లోకేశ్వర్రావు దయ చూపుతున్నట్టు.

మేనేజరు తుక్కైన పేను అయిపోయాడు. తల దించి, సరేనన్నట్టు తల ఆడించాడు. సిక్స్‌కు బదులు సిక్స్టీగా విన్న తన చెవుల్ని గిచ్చుకున్నాడు.

*యజమాని ఎల్లప్పుడూ సరైన వ్యక్తి కానక్కర్లేదు.*
*అయితే యజమాని ఎప్పుడూ యజమానే.*

మే నెల భావపరిచయ పోటీ

బహుమానం **రూ. 25-00**










ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

*గమనిక :* వ్యాఖ్యలు పోస్టుకార్డుపై వ్రాసి మే 15వ తేదీలోగా పంపాలి

ఏప్రిల్ నెల భావపరిచయ పోటీ

రు. 25-00 బహుమతి పొందిన వ్యాఖ్య

కప్పు గెలిచిన ఆనందం.
కాలిదెబ్బతో మటుమాయం

—సి. శ్రీనివాస్
నారాయణరెడ్డిపేట.

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యింత దృఢంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది యివ్వడం అందుకే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారి, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన,దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్ని, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్ని తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోపాటు దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళును.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారి మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




B84.55 Tel

*దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

# క్యాజువల్

నా ఫ్రెండ్ మురళీ.... వాళ్ళ నియోజకవర్గపు ఎమ్మెల్యే- మేము నివసించే ఈ డిస్ట్రిక్‌లోనే ఉంటున్నాడు. ఆ విషయం మురళీకి తెలుసు.

అసెంబ్లీ ఎలక్షన్లు.... అయిపోయి అప్పటికి రెండునెలలు అయిపోవస్తుంది. మా మురళీ వాళ్ళ ఊరికి.... 'పంపులు' (నల్లా) కావాలట .... వారం రోజుల ముందే వాళ్ళ ఊరి.... యువజన సంఘపు ప్రెసిడెంట్.... వచ్చి ఆ ఎమ్మెల్యేతో మాట్లాడి వెళ్ళాడు. ఆ వాళ్లతో అప్పుడు మురళీకూడా ఉన్నాడు. వాళ్లు వెళుతూ.... 'మురళీ నీవు మళ్ళీ మన ఊరు వచ్చే ముందు.. అన్ని విషయాలు తెల్సుకొనిరా' అని చెప్పారు.

అందుకే ఈ రోజు మురళీ.... నన్ను ఉదయాన్నే బయల్దేరదీశాడు. 'సరే'నని మురళీవెంట నేనూ వెళ్ళాను. చాలా పెద్ద యిల్లు....పోర్టికోలో కారు ఆగిఉంది. టైమ్ బహుశా 'ఎనిమిది' అవుతుందేమో! మేము వెళ్ళేసరికి ఎమ్మెల్యే గారు (అద్దరు ధరించి) ఆనాటి దినపత్రిక చూస్తున్నారు.

“నమస్కారమండి” మురళీ రెండు చేతులూ జోడించాడు.

“నమస్కారం.... బాబూ మీది.... బెగ్గాసాగర్ కదూ!” చేతులు జోడిస్తూ చెప్పాడు. మురళీ.... మెలికలు తిరిగి పోయాడు- అంత పెద్దవాడు తనని గుర్తుపట్టినందుకు.

“అ.... అవున్సార్.... మాది బెగ్గాసాగరే....మొన్న వచ్చాము కద్సార్.... మీరు తర్వాత విషయం తేల్చి చెపుతానన్నారు.”

“అ.... అవును బాబు.... రండి కూర్చోండి.... అవును బాబు ... మొన్న జడ్.పి. చేర్మన్‌తో మాట్లాడినాను.... ఇప్పుడు బడ్జెట్ లేదట.... కంట్రిబ్యూషన్ ఉంటుంది. కాని ముందు మనం కొంత 'పే' చేయాలి!.... విన్ననే.... మీ ప్రక్క-ఊరు .... గ్రిబహింపట్నం వాళ్ళ కుమ్మరివాడకు కరెంటు లేదంటే.... పోయి నేనే.... కరెంట్‌స్టేషన్ వాళ్ళకి చెప్పివచ్చిన.... రేపు హైదరాబాద్ వెళ్ళాలి.... ముఖ్యమంత్రినుండి ఇదుగో.... ఈ రోజే లెటర్ వచ్చింది” చెపుతున్నాడాయన.

మా వాడి సంగతి చెప్పాల్సిన అవ

రామశంకర్

సరం లేదు....ఒళ్ళంతా కళ్ళుచేసుకుని... చెవుల్ని రిక్కించి.... ముఖమంతా నవ్వుల్ని పులుముకుని.... తలని అటూ ఇటూ ఊపుతూ .... ఆయన చెప్పే ప్రతిది....తన్మయత్వంతో వింటున్నాడు.

నాకు కొంచ్ఛ ఆశ్చర్యంగానే ఉంది— ఈ రోజుల్లో ఎమ్మెల్యే.... ఎవడూ.... ఇంత బాగా మాట్లాడడు. ఇతను....మేము 'బచ్చా'గాళ్ళమని తెలిస్తే కూడా.... మాట్లాడుతున్నాడంటే ఫరవాలేదు—వీళ్లకి మంచి ఎమ్మెల్యే దొరికాడు అనుకున్నాను.

"బాబూ.... నాకు నిజంగా.... మీ ఊరిపై చాలా అభిమానం ఉంది....ఎలాగైనా.... సరే విత్అవుట్ కంట్రిబ్యూషన్‌తో.. మీ ఊరికి తప్పకుండా.. వాటర్ టాంక్ కట్టించి మీకు నల్లాలు వచ్చే ఏర్పాటు చేస్తాను. నేను ఎమ్మెల్లే అయింతర్వాత ముందు పట్టింది మీపనే. మీ పని అయినతర్వాతే.... మరేదైనా."

"మీ దయ .... మా వూరి మీద మీకున్న అభిమానానికి కృతజ్ఞతలు చెప్పాలంటే నోటమాట రావటంలేదు"— నిజంగానే మా మురళి నోటమాట రావటంలేదు.

"దయ— ఏముంది బాబు. ఇంతకు ముందు ఎమ్మెల్యేలు.... ఎవరూ ఏ పని చేయలేదు. కనీసం నేనైనా.... చేయాల కదా!.... బాబు మరి మీరు ఓ పని చేయకూడదా! ప్రభుత్వం మనకు ఐదులక్షలు ఇస్తరు.... మనం ముందుగా.... ఓ అరవై దెబ్బయివేలు జమచేసి.... ప్రభుత్వానికి చూపాలి."

"సరే.... సార్.... మా వాళ్లతో మాట్లాడుదాం."

"నేను కూడా....మీ ఊరికి వచ్చి.... అందరితో మాట్లాడినంకనే.... చందాలు వసూలు చేద్దాం. ఏమైందయా మీ ఊరి గట్టిగనే ఉంది.... ఇయ్యరా! గడపకి ఓ రెండు వందలు.... మొత్తం వసూలు చేసి.... ఏదైనాసరే. పని మాత్రం జరిపించాలి."

"అలాగే సార్ ... మీరు ఓ సారి మా వూరు దయచేయండి. మా వూరంతా మీరంటె బాగా అభిమానమున్నది.... మరి వస్తాం సార్!"

"ఆగుబాబు టీ' తాగివెళ్ళరుగాని.... ఒరేయ్ రెండు టీలు తీసుకురా" ఇంట్లోకి కేకేశాడు. ఎమ్మెల్లే—"వద్దుసార్. ప్లీజ్" మా వాడు ఏ మబ్బుల్లోనో తేలిపోతున్నాడు. 'టీ'లు తాగి బయల్దేరాము— మా మురళి మనసంతా ఆనందంతో నిండిఉంది - "నిజంగా నేనటంటే— మా వూరంటే— ఎంత అభిమానం. ఛై.... నిజంగా.... సార్ చాలా మంచివాడు. ఇతడు మా ఎమ్మెల్లే అవడం మా

అదృష్టం—" మురళి చెబుతున్నాడు. మేము చాలా దూరం వచ్చాము. సడెన్‌గా నా పుస్తకమొకటి ఎమ్మెల్లే దగ్గర మర్చి పోయానన్న 'విషయం గుర్తొచ్చింది- వెంటనే వెనక్కి తిరిగాము.

'ఎమ్మెల్లే ఇంటిముందు.... చాలా మంది ఉన్నారు. లోపలికెళ్ళాము. ఎవరితోనో మాట్లాడుతున్నాడు. తలుపు దగ్గిరే ఆగి వింటున్నాం.

"మీది. గ్రిబహీంపట్నం కదు.... నాకు మీ ఊరికి ఎంతో చేయాలనే ఉందయ్యా. ఇప్పుడు ప్రభుత్వం కోటా అయిపోయింది .... చందాలు వసూలు చేయండి.... బోర్‌వెల్స్ వేయించుదాం.. 'కాఫీ' తాగివెళ్ళండి"- మాటలు వింటూ మురళి మొహం చూశాను- రక్తంలేనట్టు ముఖం అంతా పాలిపోయిఉంది,

"చూడు మురళీ... రాజకీయ నాయకులకి అలాంటి మాటలు రాజకీయంతో పెట్టిన విద్య .... వారికి మీలాంటి వాళ్ళంతా కాజువల్" చెప్పాను- వెంటనే వెనక్కి తిరిగాడు మురళి— పాపం మురళి.




## అనురాగ సంగమం

**రంగుల తెర తొలిగింది_**

**వెండి తెర నిండుగా గీతాశ్లోకం.**

**“బ్రాహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః**

**లిప్యతే న స పాపేన పద్మపత్ర మివామ్భసా”**

నేపథ్యంలోంచి మనోహరమైన కంఠం శ్లోకాన్ని పఠించింది_

రమ్యమైన సంగీతం మొదలైంది_

తెరపై దృశ్యం మారింది_

అది పావని గోదావరి. కడలివైపు పరుగులిడుతూ గలగలమని పారే నిండు గోదారి. దూరంగా అలల మధ్య ఉయ్యాల లూగుతూ ఓ తెరచాప ఎత్తిన పడవ_ అక్కడెక్కడో నావికుని పల్లెపాట!

పాట అంతమైంది_

'ఎవరైతే తాను చేసే కర్మలను పరమాత్మకు అర్పితంచేసి ఫలాపేక్షను విడిచిపెట్టి చేయునో, ఆట్టివారికి తామరాకుకు నీటిబిందువు అంటనట్లు పాపం అంటదు_'

నేపథ్యంలోంచి భావం పలికింది_

ఒక్క_క్షణం నిశ్శబ్దం. లీలగా అలల సవ్వడి_

పడవ ఒడ్డుకు చేరింది_

పడమటి ఆకాశంలో ఎనకపడు క్రుంగిపోయే సాయంసంధ్య.

ఒడ్డున చేపలు పడుతూ పిల్లగాంద్రు.

పడవ నుండి దిగాడో వ్యక్తి. మాసిన గడ్డం; మాసిపోయిన దుస్తులూ.... రేగిన జుట్టు.... సర్వస్వాన్నీ పోగొట్టుకుని జీవితపు చరమాంకంలో క్రుంగిపోయే దేశదిమ్మరిలా వున్నాడు_ మెట్లన్నీ ఎక్కి_ గట్టుపైకి చేరేడు_ సువిశాలమైన మైదానం_ అక్క_డక్క_డా చెట్లు_

దూరంగా గుబురు చెట్లమధ్య ఆశ్రమం_

అటువైపు నడిచాడు_

ప్రార్థనాగీతం కాబోలు... లీలగా మొదలై దగ్గరకు వెళ్ళేకొద్దీ స్పష్టపడుతూంది_

'గతం పాపం గతం దుఃఖం గతం దారిద్ర్యమేవచ

అగతా సుఖ సంపత్తి; పుణ్యేచ్ఛ తవ దర్శనాత్....'

ఆశ్రమం చేరువయ్యేసరికి ప్రార్థనాగీతం మరింత స్పష్టంగా అర్థయుక్తంగా లయబద్ధంగా వినవస్తూ వుంది_

అక్క_డివారి వంక చూశాడతను_ సమస్తాన్నీ పరమాత్మకు అంకితం చేసి జ్ఞాన సముపార్జనలో ఆనంద శాంత స్వరూపాల్లా వున్నారు. అతని కన్నులు జ్యోతుల్లా వెలిగాయ్. అగమ్యగోచరమైన తన జీవితానికి గమ్యం కన్పించింది_ వాలిపోయే పొద్దు మిగిల్చిన ఆఖరి వెల్గుకిరణంలా అతనిలో వెలిగిందో ఆశాకిరణం. అడుగులు వడివడిగా ముందుకు పడ్డాయి_ శిష్యుల మధ్య ఎత్తయిన తిన్నెమీద వెలిగిపోతూ గురుదేవులు - సంశయించకుండా వెళ్ళి ఆయన కాళ్ళమీద పడ్డాడు_

ప్రార్థన జరుగుతూనే వుంది - కనురెప్ప లెత్తకుండానే గురుదేవులు అభయాస్త్రమిచ్చినట్లు ఆశీర్వదించారు. వంచిన తల ఎత్తలేదతడు- జోడించిన చేతులు వెనక్కి తీసుకోనూలేదు- ఎంతసేపు అలా వున్నాడో.... లేచేసరికి చుట్టూ ప్రశాంతంగా వుంది- గురుదేవులు అంతా గ్రహించినట్లు ఒక్క చిరునవ్వు నవ్వి చేత్తోనే సైగచేసి దారి చూపారు- అంతే! అతని ఆనందానికి అవధుల్లేవు- కాస్సేపట్లోనే గోదావరిలో పునీతుడైయ్యాడు- శిష్యులిచ్చిన పలుచని వస్త్రాలు ధరించాడు- అల్పాహారాని కెక్కడో గంట మ్రోగింది- అందరితోనూ అతడూ- అందరికీ సమానంగా పంచుతోందొకామె ఫలాలను- ఆమెవంక తలెత్తి చూశాడతడు- అంతే! కాళ్ళక్రింద భూమి ఒక్కసారి కంపించినట్లయిం దతనికి.

ఆమె... ఆమె....

నాలుగు కళ్ళూ కలిశాయి.

ఆమె కళ్ళలో కంపరం అతని కళ్ళలో ఆశ్చర్యం!

పాతికేళ్ళ క్రితం పెళ్ళిపందిట్లో సిగ్గుతో వాలినట్లు ఆమె కళ్ళు బరువుగా వాలిపోయాయి అతని ఆలోచనలు గతంలోకి పరుగులు తీశాయి.

అక్కడితో ఆ దృశ్యం అంతమై తెరపై టైటిల్స్ మొదలయ్యాయి.

నిట్టూర్పు విడిచి, అరుంధతి వంక చూసి, సీట్లోనే కాస్త జరిగి కూర్చున్నాడు కాశ్యప్.

అంత చీకట్లోనూ అరుంధతి కళ్ళు మెరవడం గమనించాడు కాశ్యప్- మనసు కానందం కలిగినప్పుడు ఆ కళ్ళు వెన్నెల్ని విరజిమ్మగలవు.

తరతరాలుగా స్త్రీజాతికి అన్యాయం జరుగుతూనే వుంది- తండ్రివల్ల; భర్త వల్ల; బిడ్డల వల్ల కూడా. ఆడపిల్లను ఏదోలా వదిలించుకోవాలన్న తాపత్రయంతో ముసలి మొగుడికి కట్టబెట్టే తండ్రులున్నారు- కట్నకానుకలు తేలేదనీ; అనవసరమైన అనుమానాలతో భార్యప్రాణాల్ని సహితం తీయగల భర్తలున్నారు- ఐతే పాత సమస్యలు కొన్ని రూపుమాసిపోతున్నా వాటి స్థానే కొత్త కొత్త సమస్యలు పుట్టుకొస్తూనే వున్నాయి- సామాజికంగా ముందంజ వేశామనుకున్న స్త్రీలుకూడ ఒక్కొక్కప్పుడు ఆ సమస్యలకు గురికాక తప్పడంలేదు- అబలలుగా మిగిలిపోకా తప్పడంలేదు-

అటువంటి ఒక సమస్యను చిత్రీకరించినదే ప్రస్తుత చిత్రం.

ప్రేమించి వర్ణాంతర వివాహం చేసుకున్న జంట. అది తమ జీవితాలలో

ప్రేమనూ వెన్నెలనూ పండించుకున్న, మూఢాచారాల ముసగచీకట్లో కొట్టుమిట్టాడు తున్న సమాజానికి ఆదర్శప్రాయులు కావాలనుకున్నారు— నలుగురూ ముచ్చట పడే దాంపత్యాన్ని కొనసాగించాలనుకున్నారు— కానీ ఒకానొక దుర్ఘటనతో వేరౌతారు. బంగారు వస్తువులకోసం ఆమెను ఎత్తుకువెళ్ళిన దొంగలు ఆ మర్నా డామెను జీవచ్ఛవంగా వదిలివేస్తారు— అంతవరకూ ఆమెకోసం పరితపించిన అతడు ఆమెస్థితిలో చూసి వెనుకంజ వేస్తాడు— దొంగల నివాసంలో ఒకరాత్రి గడిపిన ఆమెను తిరిగి తన జీవితంలోకి తీసుకోడానికి నిరాకరిస్తాడు.

ఎదుటి హృదయం తనను ప్రేమించినదే అయినా; ఒకానొక మానవ బలహీనతకు లోనై ఆమెను పరిత్యజిస్తాడు.

జీవితంలో పడనిపాట్లు పడతాడు.

ఆ అవమానంతో ఆమె బేలయై ఆత్మహత్య చేసుకొని వుండొచ్చని తల పోస్తాడు. చివరికి విరాగియై సన్యాసాశ్రమం చేరతాడు ఆత్మశుద్ధికోసం. ఆ సమ యంలో.... అదే ఆశ్రమంలో భార్య కన్పిస్తుంది— ఇద్దరి మధ్యా మూగబాధ మొదలౌతుంది— తమ దాంపత్య జీవితంలోని తీపిజ్ఞాపకాలతనికి గుర్తుకొస్తాయి— మనసు అట్టడుగు పొరల్లో అనురాగ తరంగాలు కదలాడుతున్నాయి — ఐహిక వాంఛలన్నీ తీరిన తన జీవిత చరమదశలో ఆమెపై ప్రేమమాత్రం చెరగ లేదని గ్రహిస్తాడు— స్వామి సన్నిధిలో ఆమెను స్వీకరిస్తాడు.

'ఇది అనాదిగా వస్తున్న దురాచారమే—అవతార పురుషుల భార్యలకే తప్ప లేదీ నిందలూ, కష్టాలూ' అనుకున్నారంతా సినిమా పూర్తయ్యాక.

* * *

రాత్రి పదకొండు అయింది—

మంచంమీద పడుకుని ఆ ఉదయమే వచ్చిన వీక్లీని తిరగేస్తున్నాడు కాశ్యప్. అతనికి కొంత దూరంలో చిన్న మంచంమీద హాయిగా నిద్రపోతున్నాడు ఐదేళ్ళ వయసున్న గౌతమ్. ఆ చిన్నముఖంలోని రాజఠీవికి ఒక్కోప్పుడు గర్వం కలుగుతూంటుంది కాశ్యప్‌కి. పుణ్యంకొద్దీ బిడ్డలంటారు— తామిద్దరూ ఎటువంటి పుణ్యంచేసుకున్నారో మరి!

కాశ్యప్ దృష్టి పుస్తకంమీద నిలవటంలేదు—

లేచి టేప్‌రికార్డర్ ఆన్‌చేశాడు— రవిశంకర్ సితార వాదనం గదినంతా మంద్రంగా పరుచుకుంది—

'ఇంకా అవలేదా అమ్మగారి సింగారం' అంటూ లోపలికి కేకపెట్టాడు భార్యకొక్కదానికే వినిపించేలా.

'వచ్చే వచ్చే' అంటూ మాటకంటే ముందుగానే గదిలోకివచ్చింది అరుంధతి—

పాలమీగడలాంటి చీర; కెంపురంగు జాకెట్టూ మెడలో ముత్యాలూ; తలలో సన్నజాజులూ—

'పెళ్ళయి నాలుగేళ్ళయినా నాలుగు రోజులుకూడ అవనట్టుంది నిన్ను చూస్తుంటే' అన్నాడు లేచి ఆమెను దగ్గరకు తీసుకుంటూ—

'అవును మరి.... నిత్యం మీ కళ్ళకి శోభనం పెళ్ళికూతుర్నేగా' అంది అరుంధతి చలాకీగా కళ్ళు తిప్పుతూ—

నిజానికారోజు వారి పెళ్ళిరోజు. ఆఫీసుకు సెలవు పెట్టేశాడు కాశ్యప్— అతని కిష్టమైన రవ్వలడ్డూ; సేమ్యా పులిహోరా చేసింది అరుంధతి గౌతమ్‌తో కాస్సేపు ఆటలయ్యాక చదరంగం తీసింది - అరుంధతికి చదరంగమంటే ప్రాణం. గౌతమ్‌ని చస్‌లో ప్రపంచ ఆటగాడిగా చెయ్యాలి అంటూంటుంది.

వరుసగా మూడు ఆటలూ ఆమే గెలవటంతో ఆటనక్కడ ఆపుచేసి కాస్సేపు నిద్రకుపక్రమించాడు కాశ్యప్. మూడయ్యేసరికి కారపు బూందీ; టీ పట్టుకొచ్చి లేపింది అరుంధతి—

టీ తాగుతూ; 'జరిగితే పెళ్ళిరోజంత హాయయిన రోజుండదు' అన్నాడు చిలిపిగా ఆమెవంక చూసి నవ్వుతూ—

'అవును మరి-అన్నీ అమిరితే అనుభవించడానికి మీ తర్వాతే ఎవరైనామా, అంది.

సాయంకాలం సిన్మా ప్రోగ్రాం- కథల్లో మాదిరిగానే ఇంట్లో మరి వంటా గింటా పెట్టొద్దన్నాడు— అట్నించటే యే ఎసి హోటల్‌కో పోయి కావల్సింది తిని హాయిగా వద్దాం అన్నాడు.

అరుంధతి కళ్ళు మీనాల్లా మెరిశాయి—

ఐదు గంటలకే గౌతమ్‌ని తయారుచేసి, ఆ రోజుకని కొనుక్కున్న కొత్త పట్టుచీర కట్టుకుంది- కాశ్యప్‌చేత కూడ కొత్త బట్టలు తొడిగించింది-

కోరుకున్న సినీమాకి కోరుకున్నట్టుగానే వెళ్ళివచ్చారు.

'బాగానేవుంది వరస. తీరా నన్ను తొందరపెట్టి మీరు నిద్రపోతున్నారా యేం?'

అరుంధతి మాటలకు ఆలోచనలను వదలి కనురెప్పలిప్పాడు కాశ్యప్.
ఆశతో.... అనురాగంతో.... ఆర్తితో తన గుండెలమీద మెత్తగా వాలిగి తన కళ్ళలోకే చూస్తున్న అరుంధతి అతని కళ్ళకు సౌందర్య ప్రోవులా కన్పించింది—

"ఆనందం అర్ణవమైతే.... అనురాగం అంబరమైతే అనురాగపు టంచులు చూస్తాం.... ఆనందపు లోతులు తీస్తాం" అన్నాడో మహాకవి—

ఎంతగా ప్రేమించి చేసుకున్నాడు అరుంధతిని!

ఎన్ని సమస్యల ముళ్ళ చిక్కుల్ని ఛేదించి స్వంతం చేసుకున్నాడా ప్రేమమూర్తిని!

అరుంధతి మాత్రం?

కులాల పరిహద్దుల్ని చెరిపేసి, నిప్పులు కడిగే ద్విజ వంశంలోంచి అబ్రాహ్మణుడైన తనను చేరింది— పవిత్రంగా నది సాగరంలో సంగమించినట్లు—

'ఏమిటో.... ఆలోచనలు?' గడ్డాన్ని కదిలిస్తూ అడిగింది అరుంధతి.

'పాతజ్ఞాపకాలు - నాలుగేళ్ళక్రితం యీ రోజుకోసం మనంపడ్డ ఆరాటం ....యీ ప్రేమమూర్తిని పొందటంకోసం పాతికేళ్ళబట్టీ వున్న బంధాల్ని సైతం లెక్కచేయకపోడం .. అంతే - అంతకుమించి ఏమున్నాయి—'

'నా కోసం బంధువుల్నీ, ఆత్మీయుల్నీ దూరం చేసుకున్నారా— ఏముంది పేదపిల్లలో'.

'అనురాగం, ఆదరణ, అందం ఇవి చాలవూ- అయినా నాకోసం నువ్వు మాత్రం వదులుకో లేదేమిటి! కోడిగుడ్డును కూడ తాకని నువ్వు కోడినే తినే నాతో....'

అతని నింక మాట్లాడనివ్వలేదామె—

'ఒకరికోసం ఒకరు అర్పించుకోవడంలోనే, ఒకరికొరకు ఒకరు త్యాగంచెయ్యటంలోనే ప్రేమ పరిపక్వ మౌతుంది— ఉన్నతమౌతుంది— జీవితాన్ని పంచుకోవడమంటే అదేనేమో!'

'అరూ! నువ్వు నా అదృష్టంకొద్దీ దొరికిన దేవతవి— ఏ పూజలూ చేయకుండానే సాక్షాత్కరించిన దైవానివి. నా పాలిట వరానివి' అతని కళ్ళు సంతృప్తిగా మూసుకున్నాయి—




'స్త్రీ జీవితం తామరాకుపైది నీటిబొట్టు లాంటిది— ఆకు పండ వున్నంత కాలం అది ప్రకాశిస్తుంది ముత్యంలా మనోహరంగా వుంటుంది. కానీ ఏ చిన్ని గాలి అల సోకినా నీటి అల మీటినా కలవరపడి జారిపోతుంది. నా కెప్పటికీ ఒకే ఒక కోరిక— యిలా మీ వడిలో మీ సేవలో మీ పిల్లలకు తల్లిగా ఒక గృహిణిగా వుండి కడతేరిపోవాలని— అంతవరకూ ఏట్టి పరిస్థితిలోనూ దూరం కాకూడదని.'

'ఛ— అలా ఎందుకనుకుంటావు రూ— బంధనాలన్నీ తెంచుకుని నీతో జీవితం పంచుకున్నవాణ్ణి— యీ బంధం జీవితాంతం వుండేదే— ఎన్ని అపోహాలు రానీ— ఎన్ని సమస్య లెదురవనీ మన వైవాహిక జీవితం సాగిపోవలసినదే.'

ఆమె కనుకొలుకుల్లోంచి జారిన రెండు కన్నీటిబొట్లు అతని వక్షంమీద పడ్డాయి.

'అది చాలండీ— ఆ మాట ఒక్కటే నా జీవితానికి మీ రిచ్చిన వరం—'
అంటూ అతని గుండెలపై వాలిపోయింది.

'ఛ. ఏమిటదీ— శుభప్రదమైన యీ రోజున, యింకా సంతోషంగా గడపాల్సిన యీ క్షణాన యీ కన్నీరేమిటీ? ఏదీ ఆ కన్నుల్లో వెన్నెలలు కురిపించూ'

"కవిత్వం చాల్నుగానీ పడుకోండి—" అంటూ ఆమె నవ్వింది. ముత్యాలు రాలినట్లు—

తొలకరి జల్లుకు పులకించిన భూమాతలా ఆమెలో ఏదో పరవశం! వశం తప్పిన వయసు కాలాన్ని గమనించకుండా విశ్వరూపం ప్రదర్శించింది—

తనువులూ మనసులూ యేకమై సృష్టిలోని అందాల్నీ, ఆనందాల్నీ అందుకోవాలని ప్రయత్నించి, సఫలీకృతులు కాలేకపోయారిద్దరూ—

అర్ధరాత్రి —

## అప్రమత్తానికి హద్దుల్లేవు

'దబ్' మన్న శబ్దమైతే చటుక్కున మెలకువ వచ్చింది అరుంధతికి—

లేచి, నుసిజారిన చీరకుచ్చిళ్ళను దగ్గరగా తీసుకోబోయింది- అంతలోనే తమ గదితలుపు మెల్లగా తెరిచిన చప్పుడు —

కాశ్యప్‌ని మెల్లగా కుదిపి లేపింది.

అతను లేచేసరికే డైనింగ్ హాలుకీ, తమ గదికీ మధ్యనున్న ద్వారందగ్గర స్పష్టంగా ఓ ఆకారం.

అప్పటికిగాని గుర్తురాలేదు డైనింగ్ హాల్లోంచి యింటికి కుడివైపున గల కారిడార్‌లోకి వున్న తలుపు రాత్రి వేయలేదని, ఆ తలుపులూ ప్రతిరాత్రి మరీమరీ చూసుకునే పదకగదిలోకి కొత్తవ్యక్తి- అటువంటిదీరోజు ఎందుకో....

ఆ ఆకారం నెమ్మదిగా కదిలివస్తోంది.

'ఎవరది?' బిగ్గరగానే కేకవేశాడు కాశ్యప్.

'ష్! అరిచారంటే ప్రాణాలు తీస్తా. కదలకుండా నే చెప్పినట్లు చేస్తే ప్రాణాలు దక్కుతాయి. జాగ్రత్త!' అంటూ చేతిలోని ట్యాటరీ లైటుతో గదినంతా పరికించసాగాడతను.

అరుంధతి శరీరం భయంతో వణికిపోతోంది— నెమ్మదిగా తలతిప్పి గౌతమ్ వంక చూసింది — భయాందోళన కతీతంగా నిదురపోతున్నాడా పసివాడు!

గబుక్కున ఒక్క పరుగులో గౌతమ్‌ని చేరాలనుకుంది- తన ప్రాణాలు పోయినా సరే ఆ పసికందును రక్షించుకోవాలి. కానీ ఆమె ప్రయత్నం నెరవేరలేదు—

అజానుబాహుడైన ఆ దొంగ యినప కమ్మిలాంటి తన చేతిని అడ్డు పెట్టి ఆపేశాడు.

నేష్టలుడిగి నిలబడిపోయింది అరుంధతి. వీడొక్క దొంగేనా? లేక....? ఎన్ని వినటం లేదు! తెల్లారి లేస్తే పేపర్లో ఎన్ని చదవటంలేదు— దోపిడీ మూకలు ఒక్క ధనంతో సంతృప్తి పడటంలేదు- పసికందులూ, వయసులోని

ప్రలా.... 'భగవాన్ నా గౌతమ్‌ని రక్షించు— లోకం తెలీని నా బాబుకి యేమీ కాకుండా చూడు' అని మనసులోనే వేయిదేవుళ్ళకి మొక్కుకుంది—

'బీరువా తాళాలెక్కడ?' రాక్షసగొంతు ఆ గది నలుమూలలా ప్రతి ధ్వనించింది—

చటుక్కున వెనక్కి తిరిగి టేబిల్‌పైవున్న రూలర్‌ని చేతిలోకి తీసుకున్నాడు కాశ్యప్.

కానీ కాశ్యప్ చేష్టలన్నీ సింహం ముందు లేడిపిల్ల చేష్టలే అయ్యాయి— సింహం పంజాలో కుందేలు పిల్లే అయింది అరుంధతి.

'ప్రాణాలు వుంచుకోవాలంటే యిప్పటికైనా చెప్పండి. తాళాలెక్కడ?' గర్జించింది సింహం. అప్పటికే కిటికీ వూసలకు కాశ్యప్ బంధీ అయ్యాడు- ఒక చేత్తో అరుంధతిని బిగదీసి పట్టుకుని కాశ్యప్ గుండెలపై కత్తివుంచాడు.

అరుంధతి నిలువెల్లా వణికిపోయింది

పాపిష్ఠి డబ్బు.... ప్రాణాలు పోయాక ఎవరికి కావాలి? కోట్లు ఆర్జించు కున్నవాళ్ళు, లంకంత మేడలు కట్టుకున్నవాళ్ళు కూడ చివరికేం తీసుకు వెళ్తారు?

'ఆగు! వదిలెయ్, వాదులు. నేనిస్తా' అంది కాశిలా—

ఆ కేకకు అటు దొంగ, యిటు కాశ్యప్ ఇద్దరూ ఆశ్చర్యపోయారు— పట్టు సడలించి ఆమెను వదిలాడు- కానీ కాశ్యప్ గుండెలమీంచి కత్తి తియ్యలేదు-

మంగళసూత్రాలు బయటకు తీసి వాటికున్న తాళంచెవిని దొంగ చేతిలో పెట్టింది అరుంధతి—

'నేను మనిషినిరా-నాకు డబ్బు కన్నా మాంగళ్యం కట్టిన భర్తే ముఖ్యం- ఒకరు కష్టించి సంపాదించుకున్న ధనాన్ని దోచుకుంటూ ఎన్నాళ్ళు బతుకుతావో బతుకు!'

అరుంధతి కళ్ళు నిప్పుల్ని కురిపిస్తున్నాయి—

ఆమె ధైర్యానికి విస్తుపోయాడు కాశ్యప్ - విజేతలా వికటాట్టహాసంచేసి బీరువా తలుపులు తెరిచి తనకు కావల్సినవన్నీ ఒక మూట కట్టుకున్నాడు. ఆ తర్వాత ఆమె దగ్గరకొచ్చి చేతులకున్న గాజులు మెళ్ళోని గొలుసును కూడా ఒడు పుగా తీసుకున్నాడు— 'నీ వంటి పతివ్రతకి భర్తే ముఖ్యం కదూ — ఆ తాళి

మాత్రం నీకెందుకూ' అంటూ మంగళసూత్రాన్ని కూడా ఎడంచేత్తో లాగివేశాడు-

ఏం చేయలేని నిస్సహాయురాలుగా వుండిపోయింది అరుంధతి-

ఇంతలో గదిలోంచి గౌతమ్ కలవరింత విన్పించింది-

అమ్మో! గుండెల్లో ఒక్కమారు రైళ్ళు పరుగెత్తాయి అరుంధతికి- అంతటి వ్యక్తినీ ఒక్కతోపు తోసి బెడ్‌రూంలోకి దూరబడి తలుపులు మూయ్యాలోయింది. అంతే! అది సాధ్యం కాలేదామెకు-

బలిష్టమైన బాహువులు ఆమెచుట్టూ చేరాయి- 'నాకు డబ్బే కాదు- నీ వంటి పతివ్రతల అందం కూడ కావాలి' ఆమెను క్రిందికి తోసి ఒక్క వుదుటున ఆమెపై బడ్డాడు.

అనుకోని ఈ హటాత్పరిణామానికి భయంతో చలించిపోయింది అరుంధతి-

బట్టలు చిరిగిపోతున్నాయి- పెనుగులాట - సింహంనోట చిక్కిన కుందేలులా గిలగిలలాడింది-

అంతే! ఆ సమయమెంతో కాదు-

అయితేమాత్రం? ఓ దుష్కరకృత్యం - భర్త కళ్ళముందే అదే గదిలో ఓ భారతనారిపై జరిగిన అఘాయిత్యం - ఏ సంపదనైతే భారతస్త్రీ తన ప్రాణం కంటె, అస్తులకంటె అధికంగా చూసుకుంటుందో అదే దోచుకున్నాడతడు-

మంచంమీద ఇంకా గౌతమ్ కలవరిస్తూనే వున్నాడు-ఆ సమయంలో తన తల్లి, ఒక రాక్షస అకృత్యానికి బలై నేలబడి పొర్లుతూందని ఆ పసిప్రాణికేం తెల్సు? సృష్టికార్యాన్ని ఓ పవిత్రధర్మంగా ఆచరిస్తూ ఆ క్రియలో ప్రేమాభిమానాల్నీ మనసూ మమతల్నీ రంగరించే భారతస్త్రీ తరతరాలుగా రాక్షసత్వం జీర్ణించిన మగ పశువులకు బలైపోతున్నారని ఆ చిన్నిమనసు కేం తెల్సు? అన్నీ తెల్సిన కాశ్యప్ మాత్రం ఏం చేయగలడు?

దోచుకున్నదానితో సంతృప్తిపడి వెళ్ళిపోయాడు దొంగ - కట్లు విప్పబడినా తగిలిన దెబ్బలకు తట్టుకోలేక కుప్పలా కూలిపోయాడు కాశ్యప్. అది.... వారి జీవితాలను విషసర్పం కాటువేసిన.... కాళరాత్రి!

## ఆలోచనాలోచనం

చుట్టూ అంధకారం. భయంకరమైన నిశ్శబ్దం.

కాశ్యప్ కళ్ళు మూతలు పడ్డంలేదు - అతని చూపు అంధకారంలోని

వెలుగు నన్వేషిస్తూంది - అతని హృదయమూ మనసూ రెండుగా చీలి తీవ్ర సంఘర్షణతో ఒరుసుకుపోతున్నాయి-

ఏం చేశాడు తను? ఏం చేస్తున్నాడు? ముందేమి చెయ్యబోతున్నాడు?.... అదే ప్రశ్న అతని మస్తిష్కంలో-

అరుంధతి తను తాళికట్టిన భార్యే కాదు- మనసంతా అర్పించిన ప్రేయసి. తనలో తనువూ మనసూ కలిపేసుకున్న అర్ధాంగి-

మరి.... ఆమె నే విధంగా ఓదార్చబోతున్నాడు? ఆమెకు జరిగిన అన్యాయాన్ని ఏ విధంగా పారద్రోలాలనుకుంటున్నాడు- అసలామెకు న్యాయం చేయగలడా తను?

ఎందుకు చేయలేడు? జీవితాంతం అండగావుండి ఆమెను రక్షించుకోవాల్సిన బాధ్యత తనది కాదూ? అటువంటప్పుడు .... పవిత్రమైన ఆమె శీలమే దోచుకోబడుతున్నప్పుడు తనేంచేశాడు? నిస్సహాయంగా వున్నాడు- బందీ అయిపోయాడు- అదెవరి తప్పు?

మగవాడు ధీరుడూ బలవంతుడూ అయితే అతని అండన చేరుకున్న స్త్రీ నిర్భయంగా వుండగలదు- మరి.... తనా విషయంలో బలహీనుడేగ। తనను తనే రక్షించుకోలేని బలహీనుడు భార్య నెలా రక్షించగలడు? జరిగిందానికి బాధ్యులెవరు? ఎంతవరకూ బాధ్యులు?

ఏ తప్పూ చేయని అరుంధతి తప్పుచేసినదానిలా తప్పించుకు తిరగడం, వేదనతో కుమిలిపోడం తనకు మనస్తాపాన్ని కలగజేస్తోంది. అయితేమాత్రం?

పూర్వపు అరుంధతిలా తను చేరదీసి, కురులు సవరించి ఓదార్చగలడా? అదీ తనలోని బలహీనతేనా?

అరుంధతిని ఎంతగా ప్రేమించాడు తను? ఆ ప్రేమకు ఏ బంధనాలూ అడ్డు రాకూడదనుకున్నాడు.

అరుంధతి ప్రేమలో తను పొందిన అనుభూతులు ఎప్పటికీ కనులముందే నిలిచిపోతాయి- మనసు మారుమూలల్లో ఆ జ్ఞాపకాల దొంతరలు తనలోని నిశ్శబ్దానికి షనాదులౌతాయి.

ఆకుపచ్చ పట్టుపరికిణీ; ఆకాశంరంగు జార్జెట్ వోణీ, చెవులకు రింగులూ, మెళ్లో సన్నటి ముత్యాలహారమూ ఎంత నాజూగ్గా వుండేదని! ఆనాటి తొలి

పరిచయం.... ఆ రోజు ఆమె రూపం.... ఎప్పటికీ తన మనోఫలకంమీద నిలిచే వుంటుంది_

ఇరువురి మధ్య ఆ ఏర్పడ్డ ప్రేమానురాగాలు శాశ్వత బంధాలవడానికి ఎంతటి మనోధైర్యంతో నిలవాల్సి వచ్చింది?

అక్క.... అమ్మ తర్వాత అమ్మయిన అక్కను ఎంతటి బాధకు గురి చెయ్యాల్సి వచ్చింది?

తొలిసారిగా తననోట ఆ మాట విని ఎంతాశ్చర్యపోయింది! వసంత పుట్టినదగ్గర్నించీ తనను అల్లుడిని చేసుకోవాలనే ఆరాటపడింది_ ఆశపడింది_ ఆ పదహారేళ్ళ ప్రాయమున్న ఆ ఆశ చిగురులువేసే సమయంలో త్రుంచబడడం ఎంతటి బాధాకరమైన విషయం?

తన నొక స్నేహితుడుగా చూసే బావగారిలో మాత్రం నిశితమైన బాధ... ఒకింతకూడ తొణికలేదు_

మౌనం ఎన్నిటికో సమాధానం.

బాధ, సహనం, ఓర్పు, త్యాగం... అన్నీ కలగలిపి మింగి నవ్వుతూ తననాదరించిన ఆ దంపతులకు తను అన్యాయమే చేశాడనిపించింది.

ఆ నేరానికి శిక్ష తనకిప్పుడు విధింపబడింది.

నిజానికి తను చేసిన నేరమేమిటి?

వసంతంటే తనకు వల్లమాలిన ప్రేమ, అభిమానం.

ఒకే యింట్లో పెరగడం వల్లనే ఏమో వసంతపై తనకు సోదరి తుల్యమైన భావమే_ కాకెంగిలి చేసిన జాంపళ్ళు తిన్నప్పుడూ, స్నానం చేసొచ్చిన వసంతకు గౌను తొడిగి తిలకం దిద్దినప్పుడూ, లెక్కలు సరిగా చేయకపోతే 'మొద్దూ' అని మొట్టికాయ పెట్టినపుడూ, ఎప్పుడూ.... ఎప్పుడూ వసంతపై మరోభావం కలగలేదు_ పైగా వసంత రూపంలోనూ, గుణాల్లోనూ అక్కయ్యనే పోలింది___

అరిందాలా కళ్ళు తిప్పడం; కళ్ళతోనే నవ్వగలగడం, ఆలోచించేటప్పుడు బుగ్గకి చూపుడువేలు ఆన్చడం,.... ఒక్కో కదలికలో అక్కే అన్పిస్తుంది___

అటువంటి వసంత కాబోయే భార్యగా ఎలా వూహించగలడు....?

మన యీ సంప్రదాయంలోంచి వచ్చిన యీ వావివరసల పరిణామస్థితి ఎప్పటికీ తన కర్థంకాదు___

అన్నకూతురు సాక్షాత్తూ కూతురితో-సమానం. మరి అదే రక్తం పంచుకు పుట్టిన అక్కకూతురు తనకు భార్య వరసెలా అవుతుంది? పిన్నికూతురు చెల్లెలవుతుంది- మరి తల్లిరక్తం పంచుకు పుట్టిన మేనమామ కూతురు మాత్రం భార్యవరస—

తన ఆలోచనలూ వూహలూ ఎవరిక్కావాలి—

సంఘం నియమించిన వావివరుసలవి—

సరిగ్గా అదే సమయంలో తన జీవితంలోకి అరుంధతి వసంతంలా వచ్చింది— కొత్త చిగురులేసి మొగ్గలు తొడిగిన తన మనసు ఆమె కంకితమైపోయింది.

పెళ్ళి విషయంలో తనే గెలిచాడు — మంగళసూత్రధారణ సమయంలో అక్క కళ్ళలో చిప్పిల్లిన కన్నీటిని తను స్పష్టంగా చూశాడు-

ఆ తర్వాత వసంతలోని నిర్లిప్తతనీ చూశాడు- అంత చలాకీగా అంత చనువుగా తనతో మెలిగే వసంతేనా యీమె.... అన్నట్లు మెలిగేది!

వసంత మనసులో కూడా తనపట్ల అదే భావముందా అన్పించింది-

ఆ తర్వాత వసంత తనతో నవ్వుతూ మాట్లాడిన సందర్భమే లేదు-

ప్రమోషన్ ట్రాన్స్ఫర్‌మీద వూరువదలి అక్కకు బావకూ దూరంగా వచ్చేశాడు- కాలమే తన సమస్యను తీర్చిందని సంబరపడ్డాడు అప్పట్లో-

అక్కకీ తనకూ మధ్య ఎప్పుడైనా ఒకటీ రెండూ ఉత్తరాలు. అంతే-

పెళ్ళిచేసుకోనని పట్టుబట్టి యం.బి.బి.యస్‌లో చేరింది వసంత- చదువు మనిషి అభివృద్ధికి పునాదులేయడమే కాదు. మనోవికాసాన్నీ, నూతనోత్సాహాన్నీ చేకూర్చగలదు- అలాగైనా ఆమె ఆలోచనా ధోరణి మారి, ఏనాటికైనా పసితనపు వూహలపట్ల పశ్చాత్తాపం కలిగి తనవర్థం చేసుకుని క్షమించగలిగితే అంతేచాలు- అదే వాంఛించాడు తను.

చటుక్కున లేచి కూర్చున్నాడు కౌశ్యప్-

అర్ధరాత్రి దాటింది- ప్రక్కగదిలోంచి సన్నగా యేడ్పూ, వెక్కిళ్ళూ విన్పిస్తున్నాయి-

అరుంధతి ఏడవకేం చేస్తుంది! తనకు జరిగిన అన్యాయానికి మరో స్త్రీ అయితే ఆ వెంటనే ఆత్మహత్య....

ఒక్క క్షణం గుండెలు కొట్టుకోడం మానేశాయి-

అంటే.. అంటే అరుంధతి ఆత్మార్పణ కావించుకోవాలనే ఆలోచిస్తున్నాడు? తన వూహలో లేకపోతే ఆ భావం తన మనసులో లేకపోతే ఎలా స్ఫురించిందా వక్ర ఆలోచన-

హిందూ స్త్రీకి ఎన్నో ఆంక్షలూ ఎన్నో నియమాలూ-

అవి తప్పడంకంటె జీవితంనించే తప్పుకోడంమేలని శాసించే సంఘతీర్పు- ప్రాణంకంటె విలువైంది మానం- దైవంకంటె విలువైనవాడూ సేవించదగ్గ వాడూ భర్త- శీలంపోయినా, భర్తపోయినా స్త్రీకి జీవితం లేదు- వుండకూడదు-

ఈ ఆలోచనలు అరుంధతిలో కూడ ఎందుకు రావు? మరి ఆ ఆలోచనలు కార్యరూపం దాలిస్తే....'? అది ఘోరమైన అన్యాయం కాదా? ఆ చావు దారుణమైన చావు కాదా?

తను పిరికితనంతోనూ, సంప్రదాయం పేరిట ఏర్పడ్డ ఛాందసంతోనూ వూరుకుంటే ఒక నిండుప్రాణి బలైపోతుంది—— ప్రాణాల్ని బలవంతంగా బలి తీసుకోమని ఏ శాస్త్రాలు చెప్పాయి?

అదే జరిగితే తను నిజంగా హంతకుడు- భార్య శీలాన్ని గాని ప్రాణాన్ని గాని రక్షించలేకపోతే తను భర్త ఎట్లా అయ్యేడు?

అరుంధతి ఏడ్పు ప్రక్కగదిలోంచి విన్పిస్తూనే వుంది-

ఇన్నాళ్ళూ ఆమెతో కాపురంచేసి ఏం గ్రహించాడు ఆమెను గూర్చి?

అప్పుడే ఆ దుర్ఘటన జరిగి ఒక పూర్తి రోజయిపోయింది- గలగలా నవ్వుతూ తుళ్ళుతూ కొండవాగులా ప్రవహించే తమ దాంపత్య జీవితం మురికి గుంటలో కలిసిపోయింది- ఐతే ఆ కాలుష్యం క్షణకాలమే ఎందుకు కాకూడదూ? నిరంతరం పరవళ్ళుతొక్కే గంగాజలంలో ఎంత మాలిన్యం కొట్టుకుపోవడం లేదు? మలినాల్ని ఒకప్రక్క కడిగేస్తూ ఒకప్రక్క తనలో దాచుకుంటూ నిరంతరం ప్రవహిస్తూన్న గంగానది ఎప్పటికీ పవిత్రమైనదే.

పవిత్రత!!

ఏది పవిత్రత? ఏది కాదు?

శరీరం పవిత్రమైన దనుకుంటే మనసు, ఆత్మ, ఆలోచనలూ అవి పవిత్రం కాకపోతే....?



మరి మనసు, ఆత్మ, ఆలోచనలూ పవిత్రమై ఒక్క దేహంలో అపవిత్రత ఏర్పడితే....?

శరీరంలో అంగవైకల్య మేర్పడితే? ప్రమాదవశాత్తూ జీవితాని కుపయోగ పడే కుడిచేయి విరిగితే, తొలగించబడితే.... పుట్టుగుడ్డివారైతే....? అది అపవిత్ర మనిపించుకుంటుందా?

సంపూర్ణ పవిత్రత మానవుడికి వుందా?

సంపూర్ణత్వంకోసం కాదూ మరణానంతరం దేవునిలో ఐక్యమయ్యేది?

ఏమో! నిరంతర ప్రశ్నలే యివి-

శరీరం బుద్బుధ ప్రాయం- ఆత్మ శాశ్వతం.

పవిత్రత, అపవిత్రత.... అంతా ఆత్మదే-

మరి....? మరి ?

తెగీతెగని ఆలోచనల మధ్య కొట్టుకుంటున్నాడు కాశ్యప్- సంఘమంటే ఏమిటి? ఈ నీతినియమా లెందుకేర్పరచారు? మానవ శ్రేయస్సుకోసం మానవులే నిర్ణయించినవి కావూ యివి?

మూడుగంటల సినిమాలో ఒక జీవితాన్ని చూపిస్తే జీవితాల్లోని కష్టాలూ బాధలూ చూపితే కనుకొలుకుల్లో నీళ్ళు నిలుస్తాయి- ఆ పాత్రలపై సానుభూతి

ఏర్పడుతుంది- ఒక్కొక్కప్పుడు యీ సంఘ నియమాలు తప్పేమో ననిపిస్తుంది- 'చట్టాలూ, శిక్షలూ మారాలి!' అన్నట్లుగానే యీ నీతి నియమాలు కూడ కాలంతో పాటు మారాల్సిన అగత్యమూ అవసరమూ వుందేమో!

అపవిత్రమనుకొని తృణీకరింపబడ్డ స్త్రీ వేదవేదాంగాలూ, శాస్త్రాలూ, తెల్సిన మహర్షులవద్ద చేరి పునీతురాలైతే ... మళ్ళీ పూర్వబంధనాలూ, ఆపేక్షలూ ప్రేమలూ పుట్టుకొస్తాయి- అనుమానాలు దగ్ధమౌతాయి- ప్రోడైన దాంపత్య వృక్షాలు మళ్ళీ చిగురులేస్తాయి-

మరి... ఆ పవిత్రతా అపవిత్రతలను కొలిచే సాధనం ఏమిటి? జ్ఞానంతో పునీతమైన మనస్సు-

కాశ్యప్ ఆలోచనలు ఎక్కడెక్కడికో పరుగులెత్తుతున్నాయి. అతను చదివిన, విన్న ఏవేవో పురాణేతిహాసాల్లోవీ, చరిత్రల్లోవీ కథలూ సంఘటనలూ కళ్ళముందు కదులాడుతున్నాయి-

మనోఫలకంమీద నిశ్చలంగావున్న ధర్మకాటా-

అరుంధతి వెక్కిళ్ళు విన్పిస్తూనే వున్నాయి-

లేచి నిల్చున్నాడతడు-

ఇద్దరిమధ్యా వున్న యీ కొద్దిపాటి దూరం, యీ అంధకారం.... యీ నిశ్శబ్దం.... యీ భయంకర మనస్తాపం. అంతమైపోవాలి!

జీవితంలో యిది ఒక ఏక్సిడెంట్. అంతే!

రెండడుగులు గుమ్మంవైపు వేశాడు-

మూడో అడుగు పడలేదు!

## బ్రతుకు సమస్య

కళావిహీనమైన అరుంధతి కళ్ళు నిశీధివంకే చూస్తున్నాయి— అక్కడక్కడ నక్షత్రాల గుడ్డివెలుగు- ఊపిరి తీసుకోకుండా నిల్చున్నట్లు ఆకుల్నికూడ కదల్చకుండా చెట్లు- ఎక్కడో నిర్భాగ్యపు జంతువుయొక్క బాధాపూరితమైన అరుపు-

గౌతమ్‌వంక చూసింది- చీర కొంగును పిడికిళ్ళతో పట్టుకుని నిశ్చింతగా నిద్రపోతున్నాడు-

'ఈ బంధనాలన్నీ తెంపుకుంటే తెగేవా?' అన్పించింది-

తెంచుకోక? అంధకారంలో ఎంత దూరం ప్రయాణించేగలదు!

దృష్టి మరల్చింది మళ్ళీ - చీకటి ఆకాశంలో ఏదో పక్షి అరుస్తూంది వింతగా_

మరో యిరవైనాల్గుగంటలు కాలంలో కల్సిపోయాయి_

నిజమే_ ఒక జీవితాన్ని గురించి ఆలోచించడానికి రోజులు చాలవు. కానీ తన సమస్యకు తనే తీసుకున్న నిర్ణయం అమలు జరగడానికి సెకెన్లు చాలు.

భార్యగా తను తప్పుకోగలదు_ కానీ తల్లిగానే తప్పుకోలేకపోతూంది_ బంధవిముక్తురాలు కాలేకపోతోంది_

ఊహలరెక్కలు విచ్చుకొని చిన్న పక్షి తన చేతుల్లో వుంది_ అది రేపు రెక్కలబలాన్ని పుంజుకుని విశ్వాంతరాళంలోకి ఎగరాలి. కాంతి కపోతాలతో చెలిమి చెయ్యాలి_

మరి ఆ బలాన్ని ధైర్యాన్నీ ఇచ్చే మాతృమూర్తి అయిన తను తన బాధ్యతలను విస్మరించగలదా?

విస్మరించాలి! అపవిత్రమైన నీడ.... కీడును కలిగించే నీడ పడకుండా వుండాలంటే తప్పుకోవాలి.

తను చూసిన జీవితాల్లోనూ, జీవితచిత్రాల్లోనూ, విన్న పురాణకథల్లోనూ యిటువంటి సమస్య ఏ స్త్రీకి కలగలేదు_ కాలానుగుణంగా సమస్యలూ క్లిష్ట మౌతూంటాయేమో మరి!

అన్యాయం జరిగిన అహల్యలకు భర్తశాపమే వరమైంది_ భగవత్ స్పర్శతో పాప పంకిలంనుండి బయటపడింది_

ప్రజలకోసమే భర్త అనుమానించి పరీక్షించినా భూదేవి వడిలో పునీతమై చివరికి భర్తను చేరింది సీత_

మరి తను? భర్త ఎదుటే శీలాన్ని కోల్పోయి అపవిత్రమైపోయింది_

ఏ శాపమో తగిలి తను శిలగా మారిపోతే ఎంతబాగుండును! ఈ మనోవేదన, యీ పశ్చాత్తాపం, యీ మమతానుబంధాలూ యివేవీ లేకుండా హృదయమూ, మనసూ లేని పాషాణంగా మారిపోవడం ఎంతటి వరం!

'కోకిలా కలకాలం కాకుండా హంసలా ఆర్నెల్లు బతుకు' అన్నారు_ మరి మమతానుబంధాలతో ఆయుష్షున్నంతవరకూ అపవిత్రంగా బ్రతికేకంటే.... హృదయాన్ని రాయిచేసుకుని మధ్యలోనే తనువు చాలిస్తే....

ఆమె కళ్ళముందు యౌవనంలో గడిచిన మధురక్షణాలన్నీ కదలాడ సాగాయి. కాశ్యప్ పరిచయం! ఆ ప్రేమ హృదయంలో కులమత భేదాలెరుగని గువ్వపిట్టగా మారడం.... ఆ దాంపత్య తొలిరోజుల మధురోహలు ... సంతానం గూర్చి కన్న కలలు..

ఓహ్! అవన్నీ యింత త్వరలో ముగిసిపోతాయనుకోలే దెన్నడూ.

అంత ప్రాణాధికంగా ప్రేమించి తన జీవిత భాగస్వామిని చేసుకున్న కాశ్యప్ ఒక చేయని నేరానికి యింత కఠినశిక్ష విధిస్తాడని అనుకోలేదు-

ఓ జాలిచూపు .. ఓ ఓదార్పుమాట—

అవే తనపట్ల వరాలయ్యేవి- మరణించినా సంతృప్తిగా వుండేది- కానీ అందుకూ నోచుకోని దౌర్భాగ్యురాలు తను.

గౌతమ్‌కి ఛాతీవరకూ దుప్పటిని కప్పివేసింది- కళ్ళు మూసుకునే మనసులో దైవాన్ని ధ్యానించుకుంది-

ఒకటి.... రెండు.... నిశీధివైపు అడుగులు పడ్డాయి- మృత్యుముఖంలోకి తొంగిచూసే ఆ భరిత క్షణాలు ఎంత భయంకరమైనవి! వడివడిగా పడే ఆమె అడుగులు చటుక్కున ఆగాయి. ఆమె చెయ్యి ఎవరో బలంగా అందుకున్నారు. వెనుదిరిగి చూసింది- .... కాశ్యప్!

అంతవరకూ గంభీరముద్ర దాల్చిన ఆమె ముఖం భర్తను చూసేసరికి ఒక్కమారు శోకసముద్రంగా మారిపోయింది- గర్భంలోంచి పెనుగులాడి పెద్ద శబ్దంతో ఒడ్డున విరుచుకుపడ్డ కెరటంలా కాశ్యప్ కాళ్ళమీద ఒరగిపోయింది.

ఆమెను లేపి, హృదయానికి హత్తుకున్నాడతడు— కన్నీళ్ళను తుడిచి, ముంగురులను సవరించాడు- ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని లోపలకు నడిపించాడు చేష్టలుడిగిన బొమ్మల్లే అతనివెంట నడిచింది.

ఇద్దరిమధ్యా నిశ్శబ్దమే- ఆ నిశ్శబ్దంలో యిప్పుడు భయంలేదు.

## అరుంధతి

కాలమెంత విచిత్రంగా దొర్లుకునిపోతోంది!

సుఖదుఃఖాలయందు, జయాపజయాలయందు సమానభావం కలిగి ప్రవర్తిస్తే పాపం అంటదనీ గీతాబోధే- ఆ సూత్రంప్రకారమే కాలంకూడా నడుచుకున్నట్లనిపిస్తుంది -

జీవితం కాలంతో ముడిపడి వుందంటారు. ఆ దృష్టితో చూస్తే ఎత్తు పల్లాలతో కూడిన భూమిని జీవితంతో పోలిస్తే దానిపై నిండుగా పారే నదిలాంటిది కాలం—ఆ కాలగమనంలో ఎన్నో కొట్టుకుపోతుంటాయి।

ప్రతిజీవికి వుండే బాల్య యౌవన వార్ధక్య దశల్లో తనకు యౌవనంలోనే వార్ధక్యం వచ్చేసింది — ఏమీ తెలియని బాల్యం అమాయకంగానే గడిచిపోయింది- యౌవ్వన ప్రాంగణంలో అడుగిడి ఆ ఆనందాన్ని సౌఖ్యాన్ని రుచి చూడబోయేంతలోనే శాపానికి గురయ్యి...

కోపం, కంటిన పాపం, ద్వేషం తనువుతో పోగొట్టాలనుకుంది - కానీ జరిగిందేమిటి? కాశ్యప్ మళ్ళీ తన జీవితంలోకి ఆహ్వానించాడు- జీవితంలో ఎదురయ్యే సమస్యలకీ దుఃఖాలకీ ఆత్మహత్య పరిష్కారం కాజాలదన్నాడు-

క్షమాగుణం అన్ని గుణాలలోకీ గొప్పది-

అపవిత్రమైన స్త్రీ ఎంగిలి విస్తరాకుతో సమానమని త్యజించే సంఘంలో కాశ్యప్ ఓ గొప్పవ్యక్తిగా కన్పించాడు— సంస్కారవంతుడిగా దర్శనమిచ్చాడు— అతని అశక్తతకూడ జరిగిన దుర్ఘటనకు ఓ కారణంగా తలపోశాడు.

మళ్ళీ తన చుట్టూ బంధాలు బిగుసుకున్నాయి-

కర్తవ్యం మళ్ళీ తనను జీవితంలో నిలబడేట్టుచేసింది- అయితే నిరంతర నిశ్శబ్దం మధ్య జీవమున్న ఓ బొమ్మగా తప్పితే మరోలా మెలగటానికి అవకాశం లేకపోయింది- అభిప్రాయాలూ, భావాలూ వ్యక్తపరచే అవసరం లేకపోయింది.

ఒక చూరుక్రింద కలిసి జీవనం గడపడమే సంసారమనుకుంటే తను ఆ సంసారాన్ని చేస్తూంది-

ఎప్పుడో అవసరమనుకున్నపుడు మాట్లాడే ఒకటీ అరా మాటలు తప్ప కాశ్యప్ తనతో మనసువిప్పి పూర్వంలా మాట్లాడమే లేదు-

దాంపత్య జీవితంలోంచి క్రమంగా భార్యగా తన పాత్ర తప్పుకున్నట్టే- గౌతమ్‌కి తల్లిగా, సంసారచక్రం తిరిగేందుకు సాయపడే ఓ చిన్న యంత్రభాగంగా-అంతే- ఆ కర్తవ్య నిర్వహణ కోసమే తన జీవితం-

నిర్లిప్తంగా నిశ్చలంగావున్న ఆ జీవితంలో కూడా మరో రాయి విసిరి అల్లకల్లోలపు సమస్యల అలజడిని రేపకపోతే ఆ దేవుడికికూడా తోచదేమో!

తను పుట్టమాషి కదని తెల్పిన రోజున భయంతో ఎంతగా వణికి

పోయింది? దుఃఖంతో ఎంతగా క్రుంగిపోయింది?

తన కడుపులో రూపులు దిద్దుకోబోతున్న ఆ ప్రాణి తన ఆనందానిక మచ్చుతునకా? లేక తనలోని దుఃఖానికీ, అసహాయస్థితికీ, అపవిత్రతకీ, అస హ్యానికి గుర్తుగా నిలిచే మచ్చా?

ఈ పిండాన్ని తను భరించగలదా? నిలుపుకుని ప్రాణం పోయగలదా? అసలు నిలుపుకోడం సమంజసమా?

ఎన్ని రాత్రులు ఏడ్చిందో, ఎన్ని పగళ్ళు పరితపించిందో... లెక్కలేదు-

ఆ నిజం బయటపడ్డనాడు....అతని కళ్ళలో ఎంతాశ్చర్యం? ఆ ఆశ్చర్యం వెనక అసహ్యంకూడా వుందా? ఒక అపవిత్రతకు నీడనివ్వటమేకాక మరో పాపా నికి తండ్రిగా నిలిచి పోషించే శిక్ష కాశ్యప్ కెందుకు?

మళ్ళీ కొద్దిరోజులు భయంకర నిశ్శబ్దం!

ఈ శిక్షలన్నీ భరించే ఓపిక తనకెలా వొచ్చింది?

'వద్దండీ-యీ స్థితిలో మరో జీవికి జన్మనిచ్చే ఓపికా కోరికా నాకు లేవు- ఒకవేళ యీ భూమ్మీద పడేయగలిగినా పెంచి పోషించి ప్రేమను పంచగలననే నమ్మకమూ లేదు. అది విస్తారం అన్నిటికంటే మంచిది.'

కాశ్యప్ అందుకు ఒప్పుకోలేదు-బహుశః అది తన సంతానమే అవొచ్చన్న ఆశేమో! తన వంశాంకురమే అన్న నమ్మకమేమో!

ఏమైనా అతను తన యజమాని-భరించగల భర్త. తనకు మరో జీవితాన్ని ప్రసాదించిన భగవత్ స్వరూపుడు- అందుకే అతనిమాట కాదనలేకపోయింది.

నెలలు నిండుతున్నాయి-

శరీరంలోనూ మనస్సులోనూ ఏదో మార్పు- ఇంటిపరిస్థితుల్లోనూ: ఆలో చనా సరళిలోనూ పెద్దమార్పే కన్పిస్తూ వచ్చింది-

గౌతమ్ కడుపున పడ్డప్పుడు ఎంతఅపురూపంగా చూసుకున్నాడు కాశ్యప్- ఇప్పుడా ప్రేమాభిమానాలేవి? పోనీ....ద్వేషించినా, తను సంతోషించేదే-

ఆ నిర్లిప్తతా! ఆ నిశ్శబ్దం...మనసుల నావరించిన చీకటి...మనసుల్లోంచి వెలువడని భావాలూ...అవే, అవే....తను భరించలేకపోతూంది-భరించలేక గుండె వెయ్యి వ్రక్కలయినా బాగుండు నన్పిస్తుంది-

ఈ చేదు జీవితంలోనే అక్కడక్కడ తీపితీపి జ్ఞాపకాలు- ముళ్ళకొమ్మల

మధ్య విరబూసే పరిమళాల కుసుమాల్లా.

గౌతమ్ ఎదుగుతున్నాడు-

కొత్తకొత్త ఆటలూ; కొత్తకొత్త మాటలూ.

అవి అప్పటికి తొలి అనుభూతులే మరి-

ఈ అంధకార జీవితంలో ఆశాకిరణంలా కన్పిస్తూవుంటాడు గౌతమ్-

'మరి....మరి....మనింటికొచ్చేది తమ్ముడా..చెల్లాయా' అని వాడు అమాయకంగా అడుగుతూంటే ఎంతో ఆశ్చర్యమనిపించింది- ముద్దులతో ముంచేసిందా క్షణాన వాడిని-

ఎవరు చెప్పారు వాడికి?

ఆయనే చెప్పివుంటారా?

అన్నీ సవ్యంగా వుంటే సహజమైన వాడి ఆతృత ఎంత ఆనందకరం?

'నీ కెవరు కావాలి?' అడిగింది జవాబును ప్రశ్నగా మార్చి.

'ఇద్దరూనూ' బుంగమూతి పెట్టి నవ్వేడు-

గుండెలు దడదడలాడేయి తనకు.

ఎంతటి అమాయకమైన కోరిక? కవలలైతే వాడి కోరిక తీరినట్టే- లేదూ. ఆ కోరిక యిక తీరనట్టే-

మళ్ళీ తను గర్భవతి కాలేదు. అది నిశ్చయం.

ఏ బాధా లేకుండా కాన్పు సవ్యంగానే అయింది-

ఆడపిల్ల! ఇంటికి మాలక్ష్మి అన్నారంతా-గౌతమ్ ముఖంలో ఆనందానికి కొదవలేదు. కానీ కాశ్యప్ మాత్రం అన్నిటికీ అతీతంగా గంభీరంగా వున్నాడు-

ఎవరిపిల్లనో చూసినట్లు చూసి నిర్లిప్తంగా వెళ్ళిపోయాడు.

ఆ చేష్ట తనకు బాధనే కలిగించింది-బాధనంతా మనసులోనే దిగమింగుకోడం తప్పితే చేసేదేముంది?

పాప ముఖంలో కాశ్యప్‌కి ఏం కన్పించి వుంటుంది? పసిపిల్లలు దేవుళ్ళతో సమానమంటారు- తనకు పాపను చూసినపుడల్లా ఎందుకో పార్వతీదేవిని చూసినట్టయ్యేది- 'శారీరకంగా స్త్రీ అబలగా ఆశక్తురాలిగా సృష్టించబడ్డా శక్తిస్వరూపిణి అంశకూడా వుండాలి-' అనే తన ఆలోచనల పర్యవసానమే అలా అన్పించేట్లు చేసిందా? ఏమో!

గౌతమ్ పుట్టినపుడు వరుసగా పదిరోజులు యింట పండగలే జరిగాయి- మరి యిప్పటి యీ ఉదాసీనతకు కారణం?

కాలచక్రం తిరుగుతూనే వుంది- ఉదయాలన్నీ తూర్పునే- అస్తమయాలన్నీ పడమటనే- పగళ్ళన్నీ సూరీడువే- రాత్రులకు రాజు చంద్రుడే-

ప్రకృతిపరంగా రోజులన్నీ ఒకేలా వున్నా అయారోజుల్లో మనిషి జీవితంలో ఎన్ని మార్పులు?

గౌతమ్ స్కూలుకి వెళ్ళి వస్తున్నాడు - చదువంటే వాడి కెంత శ్రద్ధో!

ఇంగ్లీషుమీడియం చదువులకు తగ్గట్టు వేషం, భాష అలవడ్డాయి-

పాప ఒళ్ళుచేసింది - మనుషుల్ని గుర్తుపట్టడం నేర్చుకుంది - గౌతమ్‌ని చూసి కేరింతలాడుతుంది- అమ్మను చూసి బోసినవ్వులు నవ్వుతుంది- సంతోషం పట్టలేనప్పుడు కాళ్ళూ చేతులూ గబగబా వూపుతుంది- కాలి మువ్వల చప్పుడును కళ్ళతోనే వింటుంది-

'ఎన్ని జన్మల పుణ్యఫలం ఈ పాప' అన్పించేది- ఏ తల్లికేనా తన రక్తమాంసాల్ని పంచుకుని పుట్టిన బిడ్డను చూస్తే అలానే అన్పిస్తుందేమో!

మరి అటువంటి అనుభూతి కాశ్యప్‌కి కలగలేదేమో! ఎటువంటి మనిషయినా పసిపాపలపట్ల ప్రేమతో వ్యవహరిస్తారే! ఎప్పుడేనా నోరు తెరిచి అడగాలనిపించేది- తీరా అడిగితే అతని అహం దెబ్బతిని ఏమంటాడో - తర్వాత ఎటువంటి పరిస్థితి నెదుర్కోవాల్సి వస్తుందోనని భయం.

హాలాహలంలాంటి దుఃఖాన్ని మింగి వూరుకోడం అలవాటైపోయింది తనకు- జీవితంలో రాజీపడడమంటే యిదేనేమో!

ఆడపిల్లలకు బాలసారె జరపడం ఆ యింటి ఆచారం కాదట - ఎవరో అడిగిన ప్రశ్నకు కాశ్యప్ చెప్పిన సమాధానం వింది తను-

పోనీ — మనసుల్లో ఈ చీకటి పోయాక! యీ తెరలు తొలిగాక పాపకేదో మంచి పేరు పెట్టాలనుకుంది - అసలు చిన్నారిపొన్నారి ముద్దులపాపకో పేరు అవసరమా! ఏ పేరుతో పిలిచినా భగవత్స్వరూప మొక్కటే- పాపకూడా భగవంతుని అంశే- ఏ పేరై తేనేం? తనకు పాపే!

గౌతమ్ తండ్రిదగ్గర బాగా చేరికయ్యాడు.

కాశ్యప్‌కి గౌతమ్ అంటే అంతులేని ప్రేమ, ముద్దు- గౌతమ్ ఆడిందాట, పాడింది పాటగా వుంది.

ఇంటిదగ్గర ఉన్నంతసేపూ కాశ్యప్‌కి గౌతమ్‌తోనే- వాడితోనే మాటలు- వాడితోనే ఆటలు- చెప్పేపు చదువు- రాత్రులు తండ్రిదగ్గరే వాడి పడక-

తనూ పాప వేరే అయిపోయినట్లనిపించేది అప్పుడప్పుడు-

ఆ రోజు గౌతమ్ పుట్టినరోజు-

ఎంత హడావుడి చేశాడో కాశ్యప్ - ముందురోజు గౌతమ్‌ని బజారుకు తీసుకువెళ్ళి రెడీమేడ్ బట్టలూ, బొమ్మలూ కొన్నాడు - స్నేహితులకివ్వడానికి చాక్లెట్లూ, స్వీట్లూ కొన్నాడు - గౌతమ్ కొనమంటే పాపకోసం కూడ ఓ గౌను కొనితెచ్చాడు- తన కెంతానందమనిపించిందో!

ఆ రోజు ఉదయం యిద్దరికీ తలంట్లు పోసింది- గౌతమ్‌తోపాటు పాపకి కూడ కొత్తబట్ట లేసింది-

కోవా చిదిమి గౌతమ్ పాపనోట్లో వేస్తున్నపుడు ఆ దృశ్యం తనకెంత ఆనందాన్నిచ్చిందో- ఆ రోజే మరో వింత కూడ - ఎప్పుడూ పాపని తాకనైనా తాకని కాశ్యప్ గౌతమ్ చెబితే పాపనెత్తుకున్నాడు-

చక్రాల్లాంటి పెద్దపెద్ద కళ్ళతో పాప తండ్రినెట్లా చూసిందనీ! కాస్సే పటికే కొత్తదనం పోయిందిలా వుంది- కేరింతలాడింది-

తన మనసు ఆనందంతో పులకించిపోయిందా రోజు.

'గుడికి వెళ్దాం రడీ అవు' అన్నాడు కాశ్యప్.

ఆనందంతో తలూపింది-

ఎన్నాళ్ళయింది తను కాశ్యప్‌తో కల్సి బయటప్రపంచంలోకి అడుగిడి?

తలారా స్నానంచేసి. దేవునిముందు దీపంపెట్టి రెడీ అయింది-

ఆటోలో గుడికి వెళ్ళారు నలుగురూ-

సముద్రతీరంలో వున్న మూడు చిన్నిచిన్ని కొండలమీదా మూడు మతాల దేవుళ్ళకి చెందిన ఆలయాలు-

వెంకటేశ్వరుని గుడి; చర్చి.... దర్గా—

ఆలయంలో ప్రవేశించేసరికి తన మనసునిండా ఏదో ప్రశాంతత; ఏదో వుత్సాహం; సంతృప్తి.

'భగవాన్. నా కింకేం అక్కర్లేదు - యీ సంతోషం, సంతృప్తి యిలా జీవితాంతం వుండిపోనీ' అని కోరుకుంది- గుడిగంటలు మ్రోగాయి-

క్రిందికి దిగి వచ్చేశారు. ఆ ప్రదేశం ఎంత మనోహరంగా వుంది!

ఎవరో మహర్షులు అక్కడికొచ్చి విడిదిచేశారని తెల్సింది – కాశ్యప్ ఆటువంక కదిలాడు–అతని వెనుకే తనూ– భక్తులొకరూ ఒకరూ ఆయన దర్శనం చేసుకుని వస్తున్నారు– లోపలకు వెళ్ళారు–

తమను చూసి చిరునవ్వు నవ్వేరాయన. ఆయన ముఖంలో ఏదో వింత తేజస్సు కన్పించింది తనకు–

పాదాభివందనంచేసి, తెచ్చిన ఫలాలను ఆయన ముందుపెట్టింది తను–

'పతివ్రతా శిరోమణికి.... శావకాలం' అన్నారాయన నెమ్మదిగా తనకే అర్థమవ్వాలన్నట్లు–

అర్థమైంది తనకు– కళ్ళవెంట గిర్రున నీళ్ళు తిరిగాయి.

భూత భవిష్యత్ వర్తమాన కాలాల ఫలితాలను గ్రహించి చెప్పగల మహర్షులకు తెలియందేముంది?

తనలోని తొట్రుపాటునూ; కాశ్యప్ మనోభావాలనూ గ్రహించినట్లు ఒకసారి తల విదిలించారు. ఆ తర్వాత–

గౌతమ్ పేరు అడిగి తెల్సుకుని; 'బుద్ధుడిలానే గొప్ప జ్ఞాని అవుతా' డన్నారు.

కాశ్యప్ ముఖంలో ఆనందం!

'పాప పేరేంటమ్మా!'

తను కాశ్యప్‌వంక చూసింది–

'ఇంకా నామకరణం జరగలేదు– తమరే ఏదన్నా సూచించండి స్వామీ' అన్నాడు కాశ్యప్.

తనూ వారివంక ఆత్రంగా చూసింది.

"దైవం ఒక్కడే అయినా అతడిని చేరే మార్గాలు వేరు– పిలిచే నామాలు వేరు– మతాలు వేరైనా వాటి పరమార్థమొక్కటే – అన్ని మతాలవారూ కొలిచే దేవుళ్లు యిక్కడున్నారు– అటువంటి యీ పవిత్ర స్థలంలో అమ్మాయికి పేరే దొరకదా" అని కళ్ళుమూసుకుని కాస్సేపాగి,

'సమత' అని పిలవండి అన్నారు.

ఎంత చక్కని పేరు?

ఎంత అర్థాన్ని యిముడ్చుకున్న నామం!

తన కళ్ళు ఆనంద పారవశ్యాలతో తడిశాయి–

పాపను మహర్షుల పాదాలచెంత వుంచి, నమస్కరించింది. విందుగా ఆశీర్వదించాడాయన.

పాప ఎంత అదృష్టం చేసుకుందో అన్పించింది.

అసలిలా జరగాల్సివుందే తాము పాపకు యే పేరూ పెట్టలేదేమో అన్పించింది కూడ.

ఆ రోజంతటి ఆనందకరమైన రోజు జీవితంలో మరొకటి లేదేమో! బహుశః రాదేమో!

• • •

నిర్విరామంగా కాలచక్రం తిరుగుతూనే వుంది.

సమస్యల సాలెగూళ్ళు ఛేదింపబడటం లేదు–

తన జీవిత పరమార్థమేమిటో అంతుపట్టటం లేదు–

తనతో ఏ మాత్రం శారీరక సంబంధం పెట్టుకోకుండానే దాంపత్య జీవితాన్ని నడిపిస్తున్నాడు కాశ్యప్ – ఒక్కొక్కప్పుడు తమ దాంపత్యం ఓ 'నాటకం'గా కన్పిస్తుంది–

ఇందులో భర్త; భార్య, పిల్లలూ–

సంఘమనే ప్రేక్షకుల కోసం యీ నాటకమంతా–

ఎవరి కెవరూ ఏమీకానట్టు జీవితాలు వెళ్ళమార్చడం–ఇందులోని బాధలూ, బరువులూ బాధ్యతలూ– అంతే!

సమత పెరుగుతోంది–

ఎన్ని మాటలో ఆ చిన్ని నోటిలో–

ఎన్ని వూహలో ఆ చిన్ని బుర్రలో–

ఎన్ని భావాలో చక్రాల్లాంటి ఆ కాటుక కళ్ళలో–

కాశ్యప్ అంటే దానికి ఎంతిష్టమో– కాశ్యప్ మాత్రం సమతను చేరదీయడు– ముద్దుచేయడు.

గౌతమ్ పిలిచే పిలుపు విని తనుకూడా డాడీ డాడీ అనేది. తనను మాత్రం 'అమ్మ' అనే పిలిచేది.

గౌతమ్‌కి చదువులో అన్నీ వస్తుమార్కు_లే_ అది చూసి మరింత పొంగి పోయేవాడు కాశ్యప్_కొడుకు కోటిదే లోకమనేట్లు వుండే వాడింట్లో.

సమతకు అయిదేళ్ళు వచ్చాయి_ దాని చదువు సంగతి మ్మాత్రం కాశ్యప్‌కి పట్టినట్లు లేదు_

తను మ్మాత్రం ఎందుకు చెప్పాలి_ బాధ్యతల నుంచి తప్పించుకువేవాడు మనిషేకాదు_

'అటువంటివాడు.... మరో ఆలోచనలతో సతమతమయ్యేవాడు .... ఇంతవరకూ ఎందుకు తేవాలి? అన్పించేది___ అదినిష్ఠూరం కంటే అంత్య నిష్ఠూరం మేలని తానేనాడో చెప్పింది, సంఘంకోసమని ఒకలాగా: సాధారణంగా మనిషి కుండే బలహీనతకొద్దీ మరోలాగా ప్రవర్తిస్తే ఎలా?

నిజానికి తప్పు తనదే_ తను పాపి; అపవిత్రురాలు_ తన కడుపున పుట్టిన బిడ్డపై కాశ్యప్‌కి ప్రేమాభిమానాలు ఎందుకు కలుగుతాయి?

తల్లిగా తనే సమతను తీర్చిదిద్దాలి_ ఒక మార్గంలో పెట్టాలి_ విద్యా బుద్ధులు నేర్పించాలి. అందుకు కావల్సిన డబ్బుకోసంకూడ తను కాశ్యప్‌మీద ఆధారపడ నక్కర్లేదు.

తనకంటూ కొంత ఆదాయం వచ్చే ఆస్తి పుట్టింటివారివల్ల సంక్రమించింది_ అది చాలు.

ఏమైనా కాశ్యప్ వుద్దేశాన్నికూడ తను తెల్సుకోవాలి_ ఒకవేళ సమతను చదివించడం ఆయనకు యిష్టంలేకపోతే ఏ గురుకులంలోనో చేర్చాలి.

ఆ ఆలోచన కొత్తగా అన్పించింది తనకు_

స్త్రీ ఎన్నిటికైనా సహించగలదేమో గాని తన సంతానాన్ని తక్కువగా చూస్తేమ్మాత్రం భరించలేదు.

ఆ విషయం తనకు అనుభవపూర్వకంగా తెలిసివచ్చింది.

ఓ రోజు జరిగిన సంఘటన తన కిప్పటికీ గుర్తే. సమతకు కాశ్యప్ మీద గల యిష్టాన్ని తెలియజేసే సంఘటన.

ఆదివారం మధ్యాహ్నం. కాశ్యప్, గౌతమ్ బెడ్‌రూంలో పడుకున్నారు. తనూ, సమతా వంటింట్లో_ ఎప్పుడు వెళ్ళిందో తను చూడనేలేదు. వెళ్ళి, కాశ్యప్ మంచమెక్కి_, అతని గుండెలమీద తలావించి పడుకుంది_

కాశ్యప్ కేక వేసేవరకూ తెలియ లేదు_

మనుషుల్లోని యిష్టా యిష్టాలు విచిత్రంగా వుంటాయి ఒక్కొక్కప్పుడు_

ఆ రోజు రానే వచ్చింది_

ఆ విషయం ప్రస్తావించ కూడ దనుకుంటూనే ప్రస్తావించింది_

'సమతకు బడికెళ్ళే వయసొచ్చింది_ తోటి పిల్లలంతా స్కూళ్ళకు వెళ్ళిపోతుంటే తనూ వెళ్తానని మారాం చేస్తోంది.'

కాశ్యప్ మౌనంలో ఎన్నో అర్థాలు ద్యోతకమయ్యాయి.

'ఏదైనా గురుకులంలో చేర్పిస్తే బావుంటుందని అనుకుంటున్నాను__ విద్య, క్రమశిక్షణలతోపాటు జీవిత మంటే కూడ ఏమిటో తెలుస్తుందని నా నమ్మకం.'



ఈమావైపు ఆశ్చర్యంగా చూశాడు కాశ్యప్. బహుశః అటువంటి సలహా తననుండి వస్తుందని అతనూహించి వుండదు

'అది ఎంతో ఖర్చుతో కూడినదేమో?'

'పిల్లల అభివృద్ధి కాంక్షించినవాళ్ళు చదువుకయ్యే ఖర్చుకు వెనుదీస్తే ఎలా' అనాలనిపించింది_

అటువంటి చనువును యీ మధ్యకాలంలో తనెప్పుడూ తీసుకోలేదు_

'అదీ ఆలోచించాను_ భూమిపై నాకొచ్చే ఆదాయంలో యింతవరకూ ఖర్చుచేసిందేం లేదు_ ఆ ఆదాయం అలా సరిపోతుందనుకుంటాను.'

కాశ్యప్ మరేం మాట్లాడలేదు_

అప్పటి మౌనం అర్ధాంగీకారమే!

అలా సమతను విద్య నెపంతో గురుకులానికి పంపివేయడం జరిగింది-

తనను వదిలి వెళ్ళనని ఎంత మారాంచేసిందో-

మొత్తానికి ఓడిపోయింది పిచ్చి సమత.

ఇక్కడుండి ఏం బావుకోవాలి గనుక?

సమత వెళ్ళిన నాలుగు రోజుల వరకూ నిద్రాహారాల్లేవు తనకు- అనునిత్యం తన పైటకొంగు పట్టుకుని తన ననుసరించే చిన్నారి సమత లేకపోడంవల్ల తన జీవితంలో వున్న కొద్దిపాటి వెలుగూ, ఆశ అంతరించి పోయినిట్లనిపించింది-

గౌతమ్ ముఖంలోకూడ చెల్లెలు లేనిలోటు తెలియవచ్చింది-

కానీ.... కాళ్యప్‌లో మాత్రం ఏ బాధాలేదు— బహుశః ఆనందించి వుండవొచ్చు ఎంతటి పాషాణ హృదయం అతనిది!

ఏమైనా తనిప్పుడు స్వేచ్ఛాజీవి-

తనకోసం కలతపడేవారూ. తనకోసం ప్రాకులాడేవారూ ఎవ్వరూ లేరు.

ఈ భవబంధాల కతీతంగా తన జీవితగమ్యాన్ని వెతుక్కోక తప్పదు!!

## నిష్క్రమణం

"దైవమే వాపరే యజ్ఞం యోగనః పర్యుపాపతే

బ్రహ్మాన్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజూహ్వతి."

అరుంధతి కళ్ళు నిశ్చలంగా కాంతిగా మెరుస్తున్నాయి-

భగవంతుడెంత అనంతుడో భగవద్గీతలోని మహత్తు, భావంకూడ అంతే అనంతములని చెబుతారు- ప్రతి శ్లోకంలోనూ ఎన్నెన్నో నూతన అర్థములు- ఎవరి సంస్కారాన్ని బట్టి వారికి తగిన అర్థం అందులో గోచరమౌతూ వుంటుంది-

ఉదయంనించీ ఆమె మనసులో ఎన్నెన్నో భావాలు.... ఆలోచనలు— జీవితంలో ఎదురైన ఆనంద విషాదకరమైన సంఘటనల జ్ఞాపకాలు....

తెల్లారకముందే లేచి తలారా స్నానంచేసింది- పెళ్ళికి కాళ్యప్ తనకోసం మనసుపడి కొన్న లేత అరిటాకు పచ్చరంగు పట్టుచీర కట్టుకుంది- గౌతమ్‌ని నిద్రలేపి అతనికి కావల్సినవి చూసింది-

టిఫిన్ కోసం డైనింగ్ టెబిల్‌ముందు కూర్చుంటూ అప్పుడు చూశాడామె వంక కాళ్యప్.

చెవులకు కెంపు దిద్దులూ, తలలో ముద్దమందారం, చేతులకూ కాళ్ళకూ పసుపూ.

తూర్పున ఉదయిస్తున్న సూర్యుడిలా నుదుట కుంకుమ....

ఒక్క-క్షణం రెప్పవేయకుండా అలా చూస్తూ వుండిపోయాడు.

ఎప్పటివో....అలనాటి సంఘటనలూ, జ్ఞాపకాలు ఒక్కమారు మనసును చుట్టుముట్టి కుదిపేశాయి అతనిని-

వ్యక్తపరచాలనుకున్న భావాలు గొంతులోనే కొట్టుకులాడి పోయాయి. మాటలు వెలువడలేదు.

అరుంధతి అతని పరిస్థితి వర్థంచేసుకుంది-ఆమెచూపులో అంతే వెలుగు.. అంతే శాంతం....

వెనుదిరిగి తన పనిలో లీనమైంది-

మహా నైవేద్యం సిద్ధమైంది-

దేవుని గదిలో మందిరం ముందు ఒక్కతే కూర్చుంది- ఆమె మనసంతా దైవస్వరూపంతోనే నిండివుంది- గుండెలోంచి గొంతులోని ఓంకార ధ్వని. మూసిన కనురెప్పల క్రింద మనోనిశ్చయం.

దేవునిముందు దీపాలు నిశ్చలంగా వెలుగుతున్నాయి- చుట్టూ చందన అగరొత్తుల ధూమం.

కనురెప్పలెత్తి దేవునివంక చూసింది.

తనకు వచ్చిన రీతిలో స్తుతి చేసింది-

తన మనసులోని కోరికను మౌనంగానే వ్యక్తంచేసింది.

మహా నైవేద్యాన్ని సమర్పించి జేగంటకొట్టింది. సాష్టాంగ నమస్కారం చేసి, లేచి, దేవుని పాదాలముందున్న పుష్పాన్ని అందుకోబోతూ ముందుకు వంగింది-

ఆమె పట్టుచీర అంచు దీపశిఖను తాకింది. అగ్ని సర్రున ప్రాకింది-

"కొందరు దేవతారాధనా రూపంలో యజ్ఞం చేస్తారు - కొందరు జీవ బ్రహ్మైక్య భావనతో జీవుని బ్రహ్మమనే అగ్నికి ఆహుతి చేస్తారు - మరి తన వంటి అపవిత్రులు....?

అరుంధతి నిశ్చలంగా నిలబడిపోయింది.

కాశ్యప్

కఠిన్ హై రాహ్ గుజర్
థోడీ దూర్ సాథ్ చలో
బహుత్ కడా హైఁ సఫర్
థోడీ దూర్ సాథ్ చలో.... ...

.... .... ....

ఏక్ శబ్ కీ ముఝాకాత్ భీ గనీమత్ హైఁ
కిసెహైఁ కల్ కీ ఖబర్
థోడీదూర్ సాథ్చలో.....
అభీతో జాగ్ రహేహైఁ చిరాగ్ రాహేఁకె
అభీ హైఁ దూర్ శహర్.
థోడీ దూర్ సాథ్చలో.....

టేప్‌లోంచి పంకజ్ ఉదాస్ స్వరం వినిపిస్తోంది.

ఎడారి జీవితంలో... ఒంటరి ప్రయాణంలో....ఓ పాంథుడు పాడే పాట అది—

భావం, రాగం ఎంత గొప్పగా పలికిస్తున్నాడు పంకజ్ ఉదాస్ ఆ గజల్‌లో!

కళ్ళు విప్పేడు కాశ్యప్–
కనుకొలుకుల్లో నీళ్ళు నిలిచాయి.

'ఒంటరితనం ఘోరమైన శాపం' అనుకున్నాడు – చిన్నతనంలో తల్లీ తండ్రీ; యౌవనంలో జీవిత భాగస్వామి; వార్ధక్యంలో పిల్లలూ కలిసి జీవితంలో ఒంటరితనం అనే బాధను రాకుండా చెయ్యాలి.

చిన్నప్పుడే తల్లీదండ్రీ గతించారు తనకు–

జీవితంలో అండగా నిలబడగలదనుకున్న అర్ధాంగి అరుంధతి ఎక్కువ భాగం మనోవ్యధనే మిగిల్చింది– తీరా తనలో ఒక పరివర్తన వస్తుందనుకునే సమయంలో అందరానంత దూరంగా వెళ్ళిపోయింది– చావు సహజం. కానీ

అరుంధతిది సహజమైన చావు కాదు- లోకం దృష్టిలో అది ప్రమాదకరమైన దుర్ఘటన-

కానీ....తన కలా జన్మించలేదు-

భావ సంచలనాన్ని తట్టుకోలేక అరుంధతి అలా దేవుని సమక్షంలో ఆత్మాహుతి చేసుకుందనే బలమైన నమ్మకం ఏర్పడిపోయింది-

అదే నిజమైతే దానికి బాధ్యులెవరు?

ఎవరు?....ఇంకెవరు? అరుంధతి చావుకు బాధ్యుడు తనే!

ఎప్పుడో అనంతవాయువుల్లోకి ఎగిరిపోవలసిన ఆమె ప్రాణాన్ని కాపాడి మరో ప్రాణికి తల్లిగా నిలబెట్టి, తద్వారా ఆమెను వంటరిదాన్నిచేసి, ఆమెకు జరిగిన అన్యాయాన్ని మచ్చగా చూపి....అనుక్షణం అవమానిస్తూ....ఎంత ఘోర మైన ఆశ్రయాన్ని కల్పించాడామెకు భర్తగా! ఎంతటి మనోక్లేశానికి గురిచేశా డామెను జీవిత భాగస్వామిగా!

అయితే అరుంధతిపట్ల తనకు ప్రేమ లేదా? కనీసం జాలికూడా లేదా? ఉన్నది ఒక్క- ద్వేషమేనా?

నిజానికి తనెప్పుడూ అరుంధతిని ద్వేషించలేదు - కాకపోతే అనుకోని పరిస్థితుల్లో ఆమెకు అన్యాయం జరిగినందుకు కొంచెం జాలిపడ్డాడు - అయితే అప్పుడూ యిప్పుడూ ఎప్పుడూ తనామెను ప్రేమిస్తూనే వున్నాడు.

ఆ రోజు తాము చూసిన చిత్రానికి; దాని ప్రభావంనుండి తేరుకోకముందే సంభవించిన ఆ దుర్ఘటనకూ; తన నిర్ణయానికీ, ప్రవర్తనకీ కలిపి యేదేనా ముడివుందా?

జాలి, క్షమ తమ వంశంలో తరతరాలుగా వస్తున్న సంపదలు - ఆ సంస్కారం తనలో లేకపోతే తను అరుంధతిని ఏలుకునేవాడేనా?

తప్పు అనేది ఎలా జరిగినా ఎవరివల్ల జరిగినా హిందూ స్త్రీకి నింద తప్పదు- దోషికాక మానదు.

అలనాటి అహల్య యీ కోవకు చెందిన స్త్రీయే- హిందూ పురాణకథలలో అటువంటి పాత్రలు కోకొల్లలు-

ఆ మాటకొస్తే తను గౌతముడిలా భార్యను శపించలేదు- శ్రీరామచంద్ర మూర్తిలా అగ్నిలో దూకి పాతివ్రత్యాన్ని నిరూపించమనలేదు-

అటువంటి పుణ్యపురుషులు వసించిన ధరిత్రిపై పుట్టినందుకు, వంశ పారంపర్యంగా వచ్చే విచక్షణాజ్ఞానం, సంస్కారం పొందినందుకూ సంస్కార యుతమైన నిర్ణయాన్నే తీసుకున్నాడు.

అయితే ఆ నిర్ణయం అరుంధతి జీవితం చక్కబడేందుకు ఎంతవరకూ వుపకరమయ్యిందీ అనేదే ప్రశ్న. ఆమెపట్ల చూపిన దయ, జాలి, క్షమ ఎంత వరకూ ఆమెను సుఖపెట్టేయి?

భావిజీవితంపట్ల వుండే భయంతో పిరికిగా వ్యవహరించబోయే ఆమెను ఆ ప్రయత్నంనించి విరమింపజేశాడు.

'ఆ సమస్యకు అదికాదు పరిష్కారమార్గం' అని ధైర్యం చెప్పి నేనున్నా నీకు అండగా అన్నట్లుగా తన జీవితంలోకి మళ్ళీ నడిపించుకొచ్చేడు. అంతటితో తన బాధ్యత తీరిపోయిందనీ అనుకోలేదు. కానీ....ఎంతటి ఆలోచనాపరుడైనా ఎంతటి సంస్కారవంతుడైనా తనూ మామూలు మనిషే. బ్రహ్మజ్ఞానాన్నీ సమతాదృష్టినీ నిస్వార్థపరత్వాన్నీ అలవరచుకున్న మహర్షి కాడు. కాలేడు.

మనిషిలో వున్న బలహీనతలు తనలోనూ వున్నాయి. స్వార్థచింతనః సంసారజీవితం పట్ల ఆశ, వ్యామోహం తనకీ వున్నాయి. అందుకనేనేమో తన అరుంధతిని జీవితంలోకి ఆహ్వానించినా శారీరకంగా గాని, మానసికంగా గాని ఆమెకు దగ్గరవ్వలేకపోయాడు. ఆమెను ఓదార్చి ఆమెలోని దుఃఖాన్నీ సంశయాలన్నీ పోగొట్టలేకపోయాడు. ఆమెకు ధైర్యంచెప్పి పునీతమైన స్త్రీగా నిలబెట్టలేకపోయాడు.

దుఃఖం నాశనానికి హేతువు.

ఖేదంలోంచి మరణాన్నాహ్వానించింది అరుంధతి.

చివరికి మాటల్లో తప్ప చేతల్లో తన సంస్కారాన్ని చూపించలేక పోయాడు తను.

ఆమె దృష్టిలో తను అల్పుడుగానూ చేతకానివాడిగానూ మిగిలిపోయాడా?

అరుంధతికేం తెల్సు తనెన్ని రాత్రులు ఎంతగా పరితపించిందీ?

మనస్సు ఆనందిస్తేనే శరీరం సుఖపడుతుంది. ఒక్కోప్పుడు శారీరిక సుఖమూ మనసుకు ఆనందాన్నిస్తుంది.

ఆ దుర్ఘటన జరిగాక తనకు శారీరిక సుఖంమీద ఆసక్తి తగ్గిపోయింది.

పూర్తిగా పోయిందనే చెప్పాలి- ఆ విషయం ఆమెకు ఎలా చెప్పగలడు? ఎన్ని రాత్రులో ఆమెను చేరాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు! తనపై అసహ్యం తోనే తనను దరిచేరనివ్వలేదని అ రు ం ధ తి అభిప్రాయపడ్డంలో మాత్రం పొరపాటేముంది?

శరీరానికి పట్టిన పంకిలం అద్దానికి పట్టిన మసిలాంటిది- కానీ మనసుకు పట్టిన వ్యాధి మాత్రం అద్దంలోని బీటలాంటిది- అది తుడిచేస్తే శుభ్రం కాదు. దానిపై ప్రసరించే ఎటువంటి కిరణమైనా వక్రించక మానదేమో!

పగలంతా మామూలుగానే గడిచిపోయేవి- రాత్రులు మాత్రం ఒంటరి తనం. ఆలోచనలూ భయంకరంగా వుండేవి. ఆ ఒంటరితనం నుంచి దూరమవ డానికే గౌతమ్‌ని చేరదీయవలసి వచ్చింది- వాడితోపాటే చదువుకుంటూ వాడికి చదువు చెప్పడం; వాడితోపాటే ఆడుకోవటం; కథలూ కబుర్లూ చెబుతూ వాడితో పాటే పడుకోవడం.

ఏ రకమైన ఆనందమైనా వాడితోనే- సంభాషణకూడా వాడితోనే-

అరుంధతితో మాట్లాడాలనే ఆరాటం మాత్రం వుండేది. కానీ ఏదో గిల్టీ- ఏమాట ఎలాసాగి ఎలా రూపొందుతుందోనన్న భయం - బెరుకు-

అరుంధతి తల్లి కాబోతోందని తెల్సినరోజు ఆలోచనలు పరిపరి విధాల పోయాయి. తమ చుట్టూ నామమాత్రంగా వున్న సమస్యల సాలెగూళ్ళు మరింత దట్టమౌతాయనిపించింది-

పుట్టబోయే ఆ బిడ్డకు తండ్రెవరు అనే ప్రశ్నకూడా జనించకపోలేదు-

ఆ భయంకర దుర్ఘటన జరిగాక తమ అరుంధతిని క్షమించి ఆమెను భరించడానికే ఆమెతో కల్సి జీవించడానికే సిద్ధపడిననాడే యీ విషయాన్ని గూర్చి కూడ ఆలోచించి వుండాలి. ఏది ఏమైనా తను భరించక తప్పదు- మరింత ఓర్పునూ, విశాల భావాలనూ యిమ్మని భగవంతుని ప్రార్థించడం తప్ప మరేం చెయ్యలేడు!

పాప పుట్టింది-

ఆనాడు ఎంత సంబరపడ్డాడో అంత బాధా అనుభవించాడు-

పాప ముఖకవళికల్లో తనకు ఆనాటి కిరాతకుడే కన్పించాడెంచేతో!

అంతరాత్రిలో, ఆ స మ య ం లో చూసినా ఆ ముఖం తనకు బాగానే గుర్తుంది-

ఇందులో తప్పెవరిది?

తప్పుచేసిన కిరాతకుడు ఎంతో హాయిగా ఏ బంధనాలూ మనోవ్యాకులతలూ లేకుండానే వున్నాడు- తను శిక్షిస్తే, శిక్షించగం సత్తా చేకూరితే అతడిని ఎదుర్కొని శిక్షించాలి-

లోకం తెలియని పసిపాపను అసహ్యించుకోవడం ఏం న్యాయం?

అదే.... ఆ పాపలో ఆ పాపపునీడే కప్పించకపోతే.... తనెంత సంబర పడేవాడు!

తన యింట వెలసిన లక్ష్మీదేవిగా భావించేవాడు కాదూ?

బయటపడలేదు గానీ అరుంధతి గుండెల్లో ఎంత బాధవుందో!

పాప పెరుగుతోంది-

ఆ పసిముఖంలో అప్పుడే తనేం పోలికలు చూసి ఏవగించుకుంటున్నాడు? ఎంత మానవత్వం లేని చేష్ట అది!

తనకు తానే నచ్చచెప్పుకునే సమయంలో ఓరోజు న్యూస్ పేపర్లో ఆ వార్తను చూశాడు.

మనసులో మళ్ళీ కల్లోలం- నిశ్చలమూ నిదానమూ అవుతున్న భావాల మధ్య మళ్ళీ కలకం?

"ఎన్నో ఏళ్లుగా పోలీసుల కన్నుగప్పి తప్పించుకు తిరుగుతున్న దోపిడి ముఠానాయకుడూ, హంతకుడూ అయిన అబ్దుల్లా పోలీస్ కాల్పుల్లో దుర్మరణం."

ఆ వార్త క్రింద అబ్దుల్లా ఫోటో-

తిరుగులేదు.... అతడే!

చల్లని తన సంసారంలో అగ్ని కణాల్ని విరజిమ్మిన రాక్షసుడు- ఎంత ఘోరంగానైనా చావాల్సిందే అతడు- లోలోపలవున్న కసి త్రాచుపాములా బుసలు కొట్టింది-

సమత చదువు విషయమై అరుంధతి తన అభిప్రాయం వ్యక్తం చేశాక తన మనసులో గజిబిజిగా ఎన్నెన్నో ఆలోచనలు చెలరేగాయి-

అన్నిటికీ పరిష్కార మార్గంగా అరుంధతి సూచనే నచ్చింది తనకు-

సమత తనకళ్ళెముందున్నన్నాళ్ళూ తనలో ద్వేషం పెరగక మానదు.. దానికి కారణం సమత కాకపోవచ్చును- తనలోని బలహీనతే కావచ్చు-

ఏ పాపమూ ఎరుగని పాపను వేరుగా చూస్తూ ఆమె కళ్ళకు తను దుష్టుడు కాలేదు. అందుకే అరుంధతి యిచ్చిన సూచననే అమలుపరచా లనుకున్నాడు.

మమత తాత్కాలికంగానైనా యింటినుండి దూరమవడంతో తన మనసులో కొంత శాంతి యింటి వాతావరణంలో కొంత మార్పు వుంటుందని భావించాడు.

కానీ జరిగిందేమిటి?

తన జీవిత గమ్యం చేరుకోడానికి మార్గాన్ని సుగమయం చేసుకుంది అరుంధతి.

తనకు గాని, గౌతమ్‌కు గాని ఆమె సహాయ సహకారాలు అవసరం లేదను కుందేమో!

అరుంధతి ఆత్మార్పణ చేసుకోలేదు–

తనే నిర్దాక్షిణ్యంగా హింసించి మరీ చంపేశాడు.

భగవంతుడిమీద: భగవత్‌వాక్కు అయిన భగవద్గీత మీద నమ్మకం, విశ్వాసం వున్నవాడు కాబట్టి ఏనాటికైనా తను ఆ పాపానికి ఫలితాన్ననుభవించక తప్పదు–

అరుంధతి తన జీవితంలోంచి నిష్క్రమించాక బ్రతుకు ఎడారిబాట అయిపోయింది–

'మరో పెళ్ళి' అన్న ఆలోచన, కోరిక కలగలేదు–

గౌతమ్ పెరిగి పెద్దవాడయ్యాడు–

తనతో ఎంత చనువుగా వుండేవాడో అంత రిజర్వుడుగా మారిపోయాడు–

ఎంతసేపూ చదువు....చదువు, చదువు– మరో ధ్యాసలేదు. ఏ రైల్లోనో పరిచయమైనవాళ్ళలా ఎప్పుడో ఒకటొరెండు మాటలు మాట్లాడుకునేవారు?

గౌతమ్‌కి మద్రాసు ఐ ఐ.టి. లో సీటొచ్చి వెళ్ళిపోతున్నపుడు తనెంత బాధపడ్డాడని! ఒక్కమాటతో అధికార పూర్వకమైన ఒక్క ఆదేశంతో ఆపేయ గలడు తను–

కానీ వాడి అభివృద్ధిని అటంకపరచే హక్కు తనకెక్కడుంది.

ఒంటరైపోతాడన్న బాధతో తండ్రిగా తను చేయతగ్గ పనేనా అది?

జ్ఞానసముపార్జనకోసం వెళ్ళిపోయిన బుద్ధుడిలానే గౌతమ్ వెళ్ళిపోయాడు– జ్ఞానవంతుడే అయ్యాడు– భౌతికశాస్త్రంలో డాక్టరేట్ వచ్చింది. మరో ఏడాదిలోనే

ఫారిన్ ఛాన్సు వచ్చింది- గౌతమ్ మద్రాసులో వున్నన్నాళ్ళూ ఎప్పుడో ఒకటి రెండు ఉత్తరాలు- అంతే- అమెరికా వెళ్ళేముందు అన్ని ఏర్పాట్లూ చేసుకునే తనతో చెప్పడానికి రెండురోజులు గడపటానికీ వచ్చాడు- వయసొచ్చిన తండ్రి కొడుకులాగానూ; కొడుకు తండ్రిలాగానూ ప్రవర్తిస్తారని ఎవరో అనగా విన్నాడు-

అర్థంలేని ప్రశ్నలెన్నో తను గౌతమ్‌ని వేశాడు- అన్నిటికీ ఓపిగ్గా జవాబులు చెప్పాడు గౌతమ్-

'ఎన్ని చదువులు చదివినా ఎన్ని డిగ్రీలూ డాక్టరేట్లూ తెచ్చుకున్నా, విశ్వవిఖ్యాతమైన కీర్తి గడించినా నువ్వు మాతృదేశంలోనే స్థిరపడాలి సుమా- నీ విజ్ఞానాన్ని యీ దేశప్రజలకే ఎక్కువగా పంచాలి' అన్నాడు తను గౌతమ్ వెళ్ళేముందు.

'పాశ్చాత్య నాగరికతమీద నాకు మోజులేదు నాన్నగారూ-మీ రనవసరంగా కంగారుపడకండి — విద్యాసముపార్జనకు ఎల్లలు లేవు - విద్యావంతుడికీ ఎల్లలు లేవు-భూగోళమంతా అతనిదే- ఐతే....విద్యావంతుడైనా, శాస్త్రవేత్తయినా, ఏ రంగాలలో నిష్ణాతుడై ఖ్యాతిగడించినవాడైనా తనను గుర్తించి గౌరవించే వ్యక్తులనే కోరుకుంటాడు-వారిమధ్యే జీవనాన్ని సాగించాలనుకుంటాడు. అది ఆశ్యాస కాదేమో!"

గౌతమ్ మాటల వెనుక ఎంత నిజముంది! ఎంత వేదన వుంది!

ఎంతలా ఎదిగిపోయాడు గౌతమ్!

మాటలూ, చేతలూ, భావాలూ....

ఈ పంకంలోంచి పుట్టిన పద్మమేనా యిది!

ఈ చీకటి కోణాల్లోంచి ఉద్భవించిన వెలుగు కిరణమేనా యిది!

ఒక్క వంశాన్నే కాదు జాతి ప్రతిష్ఠను కూడా నిలపగలడన్న ధైర్యం వచ్చింది-

గుండెనిండా సంతృప్తి. మనసునిండా గుబులు- చీకటివెలుగుల్లా, మనిషిని వెన్నంటివచ్చే భిన్న భిన్న అనుభూతులు!

మళ్ళీ వంటరితనం-

మనస్సూ, శరీరం మొద్దుబారిపోయే శూన్యంలాంటి వంటరితనం- ఎడారిలో

దారి తెలియక నడిచే బాటసారి వంటరితనం-

"కఠిన్ హై రాహ్ గుజర్... థోడీదూర్ సాథ్ చలో...." అని పంకజ్ ఉదాస్ తన గానంలో ఆవేదన వ్యక్తపరచినట్టు, ప్రాధేయపడినట్టు, అర్థించినట్టు తను మనసులోనైనా వూహామాత్రంగానైనా అనుకోగలడా?

జీవితమంతా తనతో పయనించాల్సిన స్త్రీని హత్యచేసాడు- తను ద్వేషించినా తనను ద్వేషించని సమతను దూరం చేసుకున్నాడు- కాదు....దూరంగా విసిరికొట్టాడు-

మరి ఆ వుసురు తనకు తగలకుండా పోతుందా?

ఇంకెవడు వస్తాడు తనతో కూడా! తనను వూరడిస్తూ, వేదన తీర్చడానికి!

సమతకు తన చేతుల మీదుగా పెళ్ళి జరిపించివుంటే ఎంత బాగుండేది! సంకుచితత్వంతో కుంచించుకుపోయిన తన మనసులో అటువంటి విశాలమైన భావాలెక్కడుంటాయి?

సంఘపరంగా, సంఘంలో బ్రతుకుతున్న మనిషి సంఘ కట్టుబాట్లని పాటించాలి. సంఘంలో మనిషి తన బాధ్యతని నెరవేర్చాలి- సమత యీ భూమ్మీదపడి ఊపిరి పీల్చడానికి కారణం తను దైహికంగా జన్మనిచ్చిన తండ్రి ఎవరైనా సంఘపరంగా తనే తండ్రి-

ఆమె బాగోగులూ, భవిష్యత్తూ చూసి; చివరికి....పెళ్ళిచేసి అత్తారింటికి పంపడం....తండ్రిగా తన బాధ్యత- అదే విస్మరించాడు.

మరి తనకు తగిన శాస్తి జరగొద్దూ? గౌతమ్ మాతృదేశాన్ని వదిలి నాలుగు నెలలయినా తనకు మాత్రం ఉత్తరం రాయలేదు. అయినా వూరుకోలేక తనే రాశాడు. వాటికి జవాబులు లేవు. తనకు అన్ని కోణాల్నుంచీ శిక్ష విధించబడాల్సిందే! కాకపోతే ఏమిటి? ఎక్కడో వుండి తనంటే ఏ అభిమానమూ ఆత్మీయత లేని గౌతమ్‌కోసం తను పరితపించడమేమిటి? అదే ఎదురుగా తన అభిమానంకోసం ప్రాకులాడే సమతపై యీ ద్వేషమేమిటి? తను తియ్యగా ఆమెను పలుకరించింది లేదు- ఆప్యాయంగా పిలిచిందీ లేదు- సమత తనుగా ఏ తప్పిదం చేసిందని?

గౌతమ్ తన విత్తు. అది ఎదిగి ఫలించిన నీడనూ, ఫలాన్నీ యివ్వడం తనకు సంతోషమే. ఆ నీడలో సేదదీరాలని ఆరాటపడతాడు. అది సహజం-

సమతలో ప్రవహించే రక్తం తనదికాదని గట్టినమ్మకం—అంతకంటే పెద్ద అనుమానం— ఆ విషయం ఆమెకు తెలిస్తే భరించగలదా? అసలా సంగతి ఆమెకు చెప్పగలడా తను? చెబితే తన కుసంస్కారం బయటపడిపోతుందని భయం— చెప్పకుండా ఆమెను ప్రేమించలేడు—

సమత చదువు మధ్యలోనే ఆగిపోయింది— కారణాలోన్నో—ఆమెకుమాత్రం యింకా చదవాలనే కోర్కె వుంది. అయినా తన మాట కాదనలేదు—

రోజులు మౌనంగా, మూగగా—బాధగా.

తనకు తానుగానే ఓ ట్యుటోరియల్ కాలేజీలో ఓ చిన్న ఉద్యోగాన్ని సంపాదించుకుంది సమత. రోజూ వెళ్ళడం తనకి యిబ్బందిగానే వుండి వుండొచ్చు— ఎంతసేపూ ఏవో పుస్తకాలు....అవే ఆమె లోకం!

సమత తన అభిప్రాయం అడిగినపుడు కాదనలేకపోయాడు! సమత యిప్పుడు చిన్నపిల్లకాదు - తన విసుగునీ, యిష్టతనీ అర్థంచేసుకోలేనంత తెలివితక్కువదీ కాదు—

అయినా తనెందుకు బయటపడాలి?

'నీ యిష్టం— నీకెలా తోస్తే అలా చెయ్యి' అంటే ఎంత సంతోషించింది!

ఆమె దైనిక చర్యలో కొత్త మార్పొచ్చింది.

ముఖంలో పేరుకున్న నైరాశ్యభావం కొత్త కరిగి, సంతోష రేకలు విరిసేయి—

అయినా ఎప్పటికీ తనలో ఒకటే భావన.

ఓ రోజు సమతతోపాటు ఓ అబ్బాయికూడా వచ్చాడు. పేరు జాన్ అని పరిచయం చేసింది. ఎర్రగా పొడవుగా వున్నాడు. కొనదేరినముక్కు; నిశితంగా చూడగల చక్రాల్లాంటి కళ్ళు: రేడియోలో మేండొలిన్ వాయిస్తూంటాడట— తనతోపాటే స్కూల్లో ఉద్యోగం చేస్తున్నాడని చెప్పింది సమత.

'ఇది ప్రేమ వ్యవహారం కాదు గద!' అన్పించింది— అలా ఏమాత్రం అనుకోడానికి అనుమానపడ్డానికి ఆస్కారం లేకుండా వుండి వారి ప్రవర్తన, మాటతీరూ. వినయ విధేయతలతో పెద్దలయందు గౌరవభావంతో వున్నట్లు కన్పించాడు జాన్.

అయితేమాత్రం వారిద్దరి స్నేహాన్ని తన మనసు హర్షించలేదు. యుక్త

వయసొచ్చాక పెళ్ళికాని ఒక స్త్రీ, ఒక పురుషుడు కలిసి తిరిగితే సంఘ మేమను కుంటుంది-?

అంతటి భయభక్తులతోటి, ప్రేమాభిమానాలతోటి పెంచుకపోయినా ఆ రాత్రి ఆమెను నిలదీశాడు- ఈ అవినీతి తిరుగుళ్ళు నాకు నచ్చవ్ అన్నాడు- హిందూ స్త్రీలలో వుండే సంస్కారం, సౌశీల్యం సమతలో మచ్చుకైనా లేవ న్నాడు- అది రక్తంలోంచి వచ్చిన జాడ్యమే అని నిందవేశాడు- ఇంకా ఏవేవో అన్నాడు-



ఆ రాత్రి వెక్కి-వెక్కి- ఏడ్చింది సమత.

'నన్ను నమ్మండి. నే నెటువంటి పాపపు పనులూ చేయలేదు-' అంది. ఆ తర్వాత చెప్పింది తను అతడిని యిష్టపడినట్లూ- ప్రేమిస్తున్నట్లు-

'ప్రేమో....కామమో ...నాకేం తెలీదు - నేన్నీకు వాడితో పెళ్ళిచేసేది లేదు- చేసి ఆ పాపాన్ని మూటగట్టుకోలేను- వాడే ముఖ్యమనుకుంటే వెళ్ళి వాడితోనే వుండొచ్చు' అనేశాడు....ఆవేశంగా... కోపంగా-

ఆ మాటలకు తలెత్తి తనవంక సమత చూసిన చూపును తనెన్నటికీ మరచిపోలేదు! ఆమెకళ్ళు ఎర్రగా....రౌద్రంగా....అగ్నిగోళాల్లా మెరిశాయి- ఆమెలోని దెబ్బతిన్న అహం ఆడపులిలా గాండ్రించింది-

అంతే! ఆ మర్నాడు వెళ్ళింది మరి తిరిగిరాలేదు.

జీవితంలో ఎదురైన కొన్ని సమస్యలు వాటంతటవే పరిష్కరింప బడుతుంటాయి. కొన్ని సమస్యల్ని కాలమే తీరుస్తుంది.

సమత సమస్య పరిష్కారమైనట్లు భావించాడు తను. మనసులోని ఓ మబ్బుతెర తొలగి కొత్త వెలుగు ఏర్పడినట్లయింది—

ఐదారు నెలలకో ఉత్తరం వచ్చేది.

గౌతమ్‌దగ్గరనుండి— ఉత్తరమంతా అక్కడి విశేషాలు, తను సాధించిన ప్రగతి, డిగ్రీలూ, డాక్టరేట్‌లూ— తన యోగక్షేమంగురించి పొడిపొడిగా నాల్గు మాటలు— అంతే—

గడువుకంటె ముందుగానే తనను రిటైరు చేసింది ప్రభుత్వం.

రోజంతా ఏకాంతం; ఒంటరితనం— ఉదయం న్యూస్‌పేపరు, సాయంత్రం గీతాపఠనం మధ్యలో ఎవరైనా స్నేహితులు—

వండుకోడం, తినడం, పడుకోడం—

జీవితపు చివరిరోజుల్లో ఒంటరితనం శాపం అన్పించేది— గౌతమ్ తిరిగొచ్చి పెళ్ళిచేసుకుని ఒక యింటివాడైతే — ఆ నీడలో తను కాలం గడిపేస్తే ఎంత బావుండు నన్పించేది—

నీడనివ్వకుండా ఎదిగిన చెట్టులాంటివాడు గౌతమ్ అన్పించేదప్పుడప్పుడు—

మానసిక ఆరోగ్యం ఎప్పుడో దెబ్బతింది— శారీరక ఆరోగ్యం కూడ దెబ్బ తిందని తెల్సిననాడు ఎంతో విలవిల్లాడిపోయాడు!

చూస్తుండగానే శరీరంలో చాల మార్పు వచ్చేసింది — మనిషి సగమై పోయాడు — ఎందరో డాక్టర్లు చూశారు — ఎన్నో మందులు వాళ్ళు రాసినవి వాడాడు. ఫలితం మాత్రం శూన్యం—

చివరికి కేన్సరని తేల్చారు స్పెషలిస్టులు.

జీవిత చక్రంలాగే యీ శరీరమనే యంత్రంకూడ సజావుగా నడిచి నన్నాళ్లూ దాని విలువ తెలియదు — ఒక్కమారు కుంటుపడితే వాటిని సవరించు కోడం కష్టంగా తోస్తుంది—

'ఎవరూ లేరా' అని డాక్టర్లు ప్రశ్నించినపుడు ఎంత దుఃఖం కలిగిందో!

అరుంధతి తనపొంటరి చేసేసింది. గౌతమ్‌వల్ల, వైజ్ఞానికరంగానికి దేశా నికేగాని తనకేం ఉపయోగం వున్నట్టు కన్పించటంలేదు — ఇక సమతను తనే దూరంచేసుకున్నాడు—

ఇక ఎవరున్నారని తనకు?

తను తండ్రిని కూడా వదిలిపెట్టి వచ్చేసింది - ఆడపిల్ల ఏనాటికైనా పుట్టిల్లు వదిలి వేయవలసిందే- ఒక మగవాడి తోడులో నీడలో జీవితాన్ని వెళ్ళమార్చుకోవలసిందే- అదే తను చేసింది. కానీ... సమాజం ఏర్పరచిన కట్టుబాట్లకు లోబడి తను పెళ్ళిచేసుకోలేదు- ఎవ్వరేమనుకుంటేనేం. తను ప్రేమించిన వ్యక్తిగా తనను ప్రేమించిన వ్యక్తే అయిన జాన్‌లో జీవనబంధాన్ని పెనవేసింది.

తను చేసింది తప్పని తననుకునే స్థితికి ఎప్పటికీ రాదు తమ దాంపత్యం. ఆ నమ్మకం తనకు సంపూర్ణంగా వుంది.

చైతన్యరహితమైన తన జీవితంలోకి నూతన చైతన్యంలా వచ్చాడు జాన్. రేపటి ఆశకు చిగురులు వేయించే చైత్రంలా వచ్చాడు- చిగురులు వేస్తూ ఎదిగే తన జీవితలతకు ఆలంబన దొరికింది- అంతే! అల్లుకుపోయింది-

ఒంటరితనం జీవితానికి శాపం అన్నది అనుభవపూర్వకంగా తెల్సుకున్న సత్యం.

పసివయసులో తల్లిప్రేమ తప్పితే మరొక ప్రేమ తెలీదు- తనంటే తండ్రికెందుకిష్టంలేదో అర్థంకాదు - అన్నయ్య అపురూపంగా పెరిగినట్లు తను పెరగలేదు- ఆ తేడా ఎందుకు జరిగిందో, తనలోని లోపమేమిటో అర్థంకాదు- అన్నయ్యలాగే తనూ తండ్రి ఒడిలో చేరి, కబుర్లు చెబుతూ, కథలు వింటూ ఆ అయన గుండెలపైదే స్పర్శకోసం ఎంత వుబలాటపడేదో!

ఎంతసేపూ తనూ అమ్మా యింట్లోనే... వంటింటి కుందేళ్ళలా— సాయంకాలాలైనా షికార్లు లేవు. సినిమాలు అసలే లేవు.

జైలుజీవితంలాంటి ఆ జీవితంలో అమ్మకు ఆనంద మెక్కడిది? అందుకే కాబోలు ఎప్పుడూ ఏదోలా... విచారంగా, నిర్లిప్తంగా వుండేది!

అన్నయ్యకు తనంటే ప్రేమ- కానీ ఎందుకో ఏదోలా భయంగా మాట్లాడేవాడు. ఆయనవుంటే అన్నీ ఆయనతోనే వాడికి. అమ్మదగ్గర తనకున్నంత చనువు, చొరవ లేవు వాడికి.

తనకు వూహ తెలిసి, అన్ని మాటలూ వచ్చాక ఆ వీధిలోని అందరు పిల్లల్లాగే తనూ బడికిపోతే బావుండు ననుకుంది రోజులు గడుస్తున్నకొద్దీ అది బలమైన కోరికగా పరిణమించింది.

ఓ రోజు అమ్మదగ్గర పేచీ పెట్టిందికూడ. 'అలాగేలే- నాన్నగారితో చెప్పి పంపిస్తా' అంది అమ్మ.

అంతే! అమ్మ ఏం చెప్పిందో! నాన్న ఏమన్నారో తనను గురుకులానికి పంపే యేర్పాట్లు చేశారు- అమ్మకు దూరంగా వుండాలంటే ఏడుపొచ్చింది- తనూ యింట్లో వుండే అన్నయ్యలా ఎందుకు చదువుకోకూడదు?

'పోనీ బడికెళ్ళనమ్మా. నీ దగ్గరే వుంటా' అనికూడ అంది.—ఆమాట తనన్నపుడు అమ్మ తన తల నిమిరి కళ్ళనీరు పెట్టుకుంది.

అంటే.... అమ్మకి తను వెళ్ళడం బాధగానేవుందా....? ఏమో! తను వెళ్ళిన నెలలోపే అమ్మ చచ్చిపోయిందట- తనకు తెలియనే తెలియదు.... సెలవులకి యింటికి వచ్చేవరకూ- ఎంతలా ఏడ్చిందో- అమ్మను చూడాలన్న కోరిక కోరికలానే మిగిలిపోయింది—

ఆ తర్వాత తన జీవితంలో కోరికలే లేవు- జాన్ పరిచయమయ్యేంత వరకూ-

చదువు ఆగిపోయాక జీవితం శూన్యమనిపించింది-

తను చదివిన చదువుకు సార్థకత ఏముంది?

అనుకోకుండా ఆ చిన్ని కాన్వెంట్‌లో చిన్నచిన్న పిల్లలకు పాఠాలు చెప్పకునే చిన్ని ఉద్యోగం వచ్చింది-

ఏ కళనున్నాడో నాన్న కాదనలేదు

అప్పటికే చదువుకోసం అన్నయ్య దూరంగా వెళ్ళిపోయాడు.

తనకా ఉద్యోగం పెన్నిధే అన్పించింది-

చదివిన చదువుకు సార్థకత, కాస్తో కూస్తో సంపాదన; పసిపిల్లలకు పాఠాలు చెప్పడంలో మానసికానందం; ఒంటరితనం, ఆలోచనలూ కాసింతైనా దూరమవడం—— అవే కారణాలు కావొచ్చు

జాన్‌తో ఏర్పడ్డ పరిచయం, స్నేహం తనను మరోలోకంలో విహరించేట్టు చేసేయి-

జాన్ ఎంతటి సాధుస్వభావుడో అంత తెలివైనవాడు. సైన్స్, ఫిలాసఫీ, చరిత్ర అతని కిష్టమైన సబెక్ట్సట-ఎంతటి మితభాషో సమయమొస్తే అంత అనర్గళంగానూ మాట్లాడగల దిట్ట-

'మీవంటి ఆడవాళ్ళకి యీ ఉద్యోగాలే మంచివి' అన్నాడు మొదట్లో- తను పరిచయమైనపుడు-

'అదేం? స్త్రీ తన కాళ్ళపై తాను నిలబడ్డానికి ఏ ఉద్యోగమైనా ఒక్కటే' అంది తను.

ఆ విషయమై జాన్ చాలా మాట్లాడాడప్పుడే.

'పిల్లల మనస్తత్వం స్త్రీలకే తెల్సు. పైగా వారికున్న సహనంకూడ యీ వృత్తి కెంతో గౌరవాన్నిస్తుంది' అంటాడు. ఏ ఆఫీసులోనో ఒక టైపిస్టుగా మెకానికల్‌గా జీవితాన్ని గడిపేసేకంటె యీ వృత్తిలో ఎంతో ఆనందమూ, స్వేచ్ఛ, సంతృప్తి వుంటాయన్నాడు.

క్రమేణా అతని మాటలు నిజమనిపించాయి.

ఆతని మాటల్లో ఏదో ఆకర్షణ కన్పిస్తూ వచ్చింది.

అంతటి తెలివితేటలూ ప్రజ్ఞాపాటవాలూకల వ్యక్తి ఓ చిన్న వుద్యోగంలో స్థిరపడిపోడం తనకేం నచ్చలేదు. పెద్ద చదువులు చదివితే ఎంతటి ఎత్తుకైనా ఎదిగిపోగల సామర్థ్యం గలవాడు అన్పిస్తుంది

ఆ సంగతే అతనితో అంటే నవ్వి వూరుకున్నాడు. ఆ తర్వాత తెల్సింది. అతను 'ఏమ్మే యూనివర్సిటీ ఫస్టు'. అని. నిరుద్యోగ సమస్య ఎంత దారుణమైనది! అన్పించింది.

తల్లిదండ్రీ చిన్నతనంలోనే పోతే మేనమామ పెంపకంలో పెరిగిన జీవితాన్ని గురించి, వ్యక్తుల మనస్తత్వం గురించి బాగా ఆకళింపు చేసుకున్నాడు.

అటువంటి వ్యక్తితో తనకు పరిచయం కలగడం, పరిచయం స్నేహంగా మారడం ఎంత అదృష్టమో అన్పించింది.

సృష్టిలో తీయనిది స్నేహమొక్కటే అన్నారు. తమ స్నేహమూ అంతటి తీయదనాన్నే యిచ్చింది అన్పించింది అతి కొద్ది రోజుల్లోనే. ఒకరి వ్యక్తిగత సమస్యలు మరొకరికి చెప్పుకునేంత చనవు, సమస్యలకు పరిష్కారాలు సూచించే స్వతంత్రమూ కలిగాయి ఇద్దరి మధ్యా.

కానీ. స్త్రీ పురుషుల మధ్య నున్నది కేవలం స్నేహమే అంటే నమ్మలేదు లోకం.

తమ స్నేహాన్ని శంకించింది చుట్టూవున్న లోకం - ఆ విషయమే తను జాన్‌తో చెబితే "అలా వారనుకుంటే ఆశ్చర్యమేముంది?- అలా వారనుకోక పోతేనే ఆశ్చర్యపడాలి" అన్నాడు.

ఈమారు తనాశ్చర్యపోయింది. అయితే జాన్ కూడ అదే వుద్దేశంతో తనతో స్నేహం చేస్తున్నాడా అన్పించింది తొలిసారిగా-

'సృష్టి ఆదినుంచి స్త్రీ పురుషుల మధ్యనున్న శారీరక మానసిక విభేదాలే వారిమధ్య పరస్పర ఆకర్షణకు కారణాలని చెబుతారు. మరి స్నేహం వేరు, ప్రేమ వేరు - ఆకర్షణ వేరు - ఈ మూడూ మనమధ్య వుంటే వాటిని శాశ్వతంగా పొందాలనుకోటంలో కూడ తప్పులేదుగా!

జాన్ మాటలకు-తనలోని ఆశ్చర్యం ద్విగుణీకృతమైంది- తను జాన్‌పట్ల ఆకర్షితురాలవటంలేదని చెప్పగలదా? మరి___? తనంతటి అదృష్టవంతురాలా?

సిగ్గుతో తలొంచుకుంది తను-

"మీకు అభ్యంతరం లేకపోతే నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను సమతా."

జాన్ మాటలు మంగళవాద్యాల్లా తన చెవుల్లో మార్మోగాయి ఆ క్షణాన.

పరిచయం స్నేహంగానూ; స్నేహం ప్రేమగానూ మారవచ్చు. కానీ ప్రేమ పెళ్ళిగా పరిణమించడం... ఎక్కడోగాని జరగదు- మరి అందుకు తనంగీకరించగలదా?

కనకు తానుగా తన జీవితాన్ని గూర్చిన నిర్ణయాలు తీసుకోగలదా? ఇప్పటికే తండ్రికి తను ఉద్యోగంచేయటం ఇష్టమున్నట్లు కన్పించదు - జాన్‌తో స్నేహం చెయ్యడం కూడ ఆతని కయిష్టమే- ఎంత ఎదిగినా తనింకా తండ్రిచాటు బిడ్డే- తనొక నిర్ణయం తీసుకోనూలేదు - ఈ విషయంలో తండ్రిని ఒప్పించనూ లేదు___

ఎటూ తోచని స్థితిలో మౌనంగా వూరుకుంది.

ఆ మౌనాన్ని అర్ధాంగీకారంగానైనా కాక పూర్తి అనంగీకారంగా జాన్ భావిస్తే....? అమ్మో తను భరించగలదా?

ఆ రోజు.... అనుకోకుండా సాయంత్రం మీటింగ్ పెట్టారు స్కూల్లో- మీటింగ్ అయ్యేసరికి- ఆరున్నర అయింది. దానికితోడు వాన. జాన్ తోడుగా వున్నా లోలోపల ఏదో భయం - స్త్రీగా సహజమైన భయం.... తండ్రి ఏమంటాడోనన్న భయం .... అంతకంటె ఇన్నాళ్ళూ దాటవేస్తూ వచ్చిన విషయం గురించి జాన్ ప్రశ్నిస్తే ఏమని జవాబుచెప్పాలన్న భయం-

జాన్ తనను యిబ్బంది పెట్టలేదు-

'మీ నాన్నగారు కంగారుపడతారేమో రిక్షాలో దింపనా' అన్నాడు - తనే వద్దని బస్సుకోసం నిలబడింది - తనకోసం జాన్ కూడ తన బస్సును వదిలేసుకు మరీ వుంచున్నాడు - గంటన్నర గడిచేక వచ్చింది బస్సు.-ఇల్లు చేరేవర్కి- తొమ్మిది- బిక్కు-బిక్కు-మంటూనే లోపలికి అడుగుపెట్టింది- వీధి తలుపులు దగ్గరగానే వేసి వున్నాయి- తండ్రి గదిలో నిశ్చింతగా నిద్రపోతున్నాడు.

ఎంతాశ్చర్యమనిపించిందో ఆ రోజు!

గౌతమ్ దగ్గర్నుండి ఉత్తరం రాలేదని బెంగెట్టుకునే నాన్న వీధిలోకి వెళ్ళిన ఆడపిల్ల రాత్రయినా రాలేదేనన్న ఆతృత కూడ లేకుండా నిశ్చింతంగా నిద్రపోతున్నారంటే నాన్నకి తనంటే ఏ విధమైన ప్రేమ, అభిమానం లేవనే అన్పించింది- ఆ రాత్రి ఎన్ని సంఘటనలో గుర్తొచ్చాయి- ఎంతగానో ఏడ్చింది-

బేలతనం కన్నీరై కరిగిపోయాక తన మనసులో ధైర్యం స్ఫటికంలా ప్రకాశించింది-

స్త్రీకి బాల్యంలో తండ్రి, యౌవనంలో భర్త, వార్ధక్యంలో కొడుకూ అండగా నిల్చి కాపాడతారట-తను యౌవనంలోకి ప్రవేశించింది- భర్తతోటే తన కవసరం- ప్రేమాభిమానాల్ని పంచియిచ్చే-భర్త లభించడం స్త్రీకి ఎంతో అదృష్టం-

అంతే!

తన నిశ్చయాన్ని వెల్లడించింది-

తన నిర్ణయాన్ని అమలుజరిపింది-

తను తప్పుచేయలేదన్న నమ్మకం తనకుంది. ఆ నమ్మకమే తనకి కొండంత ధైర్యాన్నిచ్చింది-

'సంప్రదాయంపట్ల, మతవిశ్వాసాల పట్ల వున్న నమ్మకాల్ని నేను కాద నను- పెళ్ళి ఎలా జరగాలన్నది మీ యిష్టంపై ఆధారపడివుంది' అన్నాడు జాన్. జన్మతః క్రిష్టియన్ అయినా జాన్‌కి అన్ని మతాలపట్ల గౌరవముంది-

వివాహం అతి నిరాడంబరంగానూ యిరువురికీ ఆమోదమయ్యే రీతిలో జరిగిపోయింది-

అలా దాంపత్య ప్రాంగణంలోకి అడుగిడింది తను - అతని గుండెలపై వాలి నిశ్చింతంగా కనులు మూసుకున్న ఆ రాత్రి ఎన్నెన్నో విషయాలు చెప్పేడు జాన్.

దేవుడు జతపరచిన జంటను మానవుడు వేరుచేయలేడట - సంఘంలో కుటుంబం ముఖ్యపాత్రట- వివాహం ప్రేమపూరితమై నూరేళ్ళపంటగా వుండా లని యేసుప్రభువు ఆకాంక్షట- భార్యాభర్తలు ఒకరికొకరు విధేయులై పరస్పరం ప్రేమించుకుంటూ కాఠిన్యమన్నది మనసులోకి రానీకుండా జీవించాలిట-

'ఏ మత సిద్ధాంతమైనా, దేవుని వాక్యమైనా మానవకల్యాణానికే; సర్వ మానవ సౌభ్రాతృత్వానికేగా' అంటాడు జాన్.

'నేను వాంఛించేది సమతను - నేను కోరుకునేదీ సమతనే' అంటూ చిలిపిగా చూశాడారోజు.

అతని ఒడిలో గువ్వపిట్టే అయింది తను.

సుఖప్రదమైనరోజులు యిట్టే గడిచిపోతాయి.

కష్టాల్లో రోజు గడవడమే కష్టమౌతుందట.

తండ్రిని గురించి ఆలోచించినపుడల్లా హృదయం దుఃఖంతో పూడుకు పోతుంది- ఆ యింట మళ్ళీ కాలు పెట్టకుండా శాసించాడు. ఆ శాసనాన్ని అతిక్ర మించలేక మనసుని రాయి చేసుకుంది యిన్నాళ్ళూ

గౌతమ్‌తో ఆలోచించకుండానే తండ్రిని ఒంటరిచేసి తను తీసుకున్న నిర్ణయం తప్పేమో అన్పిస్తుంది-

అప్పుడు దేవుడిమాటగా జాన్ చెప్పిన మాటలు గుర్తొస్తాయి-

ఏది ఏమైనా యీ చివరిదశలో తను తండ్రికి-అండగా వుండాలి- గౌతమ్ వచ్చేవరకూ తనే కొడుకుగా వ్యవహరించాలి. తండ్రిని రక్షించుకోవాలి.

మనసులో కృతనిశ్చయం-

కళ్ళలో కన్నీరు-!

## గౌతమ్

కేబుల్ పూర్తిగా చదివేసరికి ఒళ్ళంతా చమటలు పట్టేశాయి గౌతమ్‌కి. శరీరంలో వణుకు ప్రారంభమైంది - చేష్టలుడిగినవాడై సోఫాలో కూలబడి పోయాడు-

అతని ఆలోచనలన్నీ కొన్నివేల మైళ్ళ దూరంలో వున్న తండ్రివైపు పరుగులెత్తడం మొదలుపెట్టాయి-

తన తండ్రి జీవితపు చివరిరోజుల్లో వున్నాడు.

అదీ వార్త!

కేన్సర్ వ్యాధి అతనిని పూర్తిగా తినేసిందని తనకు తెలిసీ తెలీదు- అయినా తనేం తెల్సుకోడానికి ప్రయత్నించేడని! తనిక్కడికి వచ్చింతరువాత ఎన్నో ఉత్తరాలు రాసేడు తండ్రి. తనే ఏ కొద్దివాటికో సమాధానాలిచ్చాడు- ఆ కొద్ది వుత్తరాల్లోనూ తను సాధించిన విషయాలూ, తన ఎక్స్పెరిమెంట్లూ, తన అభి వృద్ధీ. తన డిగ్రీలే తప్ప తండ్రి ఆరోగ్యం గురించి ప్రశ్నించినట్టే గుర్తులేదు-

ఆ తండ్రిదగ్గరే చిన్నతనంలో ఎంత గారాబంగా ముద్దుగా పెరిగాడతను! తనొక గొప్పవ్యక్తి కావాలని ఆయన ఆశ- ఆ మేరకు తండ్రికి ఉత్సాహాన్నీ కలిగించాడు. అయితే అదొక్కటేనా పుత్రుడిగా తన బాధ్యత! జీవితపు చరమాంకంలో ప్రవేశించిన తండ్రిని కనిపెట్టుకుని వుండి అతడికి అన్ని విధాలా చేదోడుగా సహాయకారిగా వుండాల్సిన బాధ్యత తనకు లేదా!

మొదటినుండీ తను బాధ్యతారహితంగానే వున్నాడు-

బాల్యంలో చదువు- అది తప్పితే మరో దృష్టి వుండేది కాదు- కాలేజీ చదువు గడిచి, మద్రాసొచ్చాక విజ్ఞాన సముపార్జనలో పోటీ! దీక్ష పెరిగాయి తనలో తనకు తెలియకుండానే-నెలనెలా అంతంత డబ్బు తనకెలా వస్తుందోనని కూడా ఆలోచించేవాడు కాదు- తనను చదివించడం తండ్రి బాధ్యత. అలాగే అనుకునేవాడు అప్పుడూనూ- అక్కడి చదువూ పూర్తయింది. డాక్టరేటు డిగ్రీ వచ్చింది- ఒక హోదాగల ఉద్యోగం చేసుకుని జీవించడానికీ, కన్నవారిని సంతోషపెట్టడానికీ అది చాలు- కానీ తన విజ్ఞాన సముపార్జననే దాహానికి అది చాల్లేదు- ఫలితంగా తన విదేశీ ప్రయాణం.

వచ్చేటప్పుడు ఎన్ని హితబోధలు చేశాడు తండ్రి - తను ఎంత ఎదిగినా ఆయన దృష్టిలో తానొక బాలుడే. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపీ గరీయసీ' అన్నారు- తల్లి ....! తనకు చిన్నతనమందే తల్లిమీద ప్రేమలేదు- ఆమె ఒక యంత్రమై తనకన్నీ అమర్చేది. సేవలు చేసేది. అంతే-ఆమె తనను ప్రేమగా పెంచలేదని తనపలేదు- ఇంటిదగ్గర తనేం మాట్లాడినా, చర్చించినా, తండ్రితోనే మాట్లాడేవాడు- తనకు వూహ తెల్సిననాటినుండీ తల్లి ఎప్పుడూ విచార వదనంతో, ఆదోలా స్తబ్దుగా వుండేది. అటువంటి తల్లితో తనేం చనువుగా వుండేవాడు కాదు.

ఇక్కడకు వచ్చేముందు తన తండ్రికి మాటయిచ్చాడు. తను గడించిన విజ్ఞానాన్నంతా మాతృదేశ ప్రజల మనో వైజ్ఞానికి, వికాసానికి ఉపయోగిస్తానని- పైగా తనకు పాశ్చాత్య నాగరికతపై మోజులేదని కూడా నొక్కిచెప్పాడు. నమ్మించాడు- ఆశ చూపించాడు.




కానీ....జరిగిందేమిటి?

ఏ దేశమూ మేధావుల్నీ, గొప్ప సైంటిస్టులనీ వదులుకోదు- వచ్చి రెండు డాక్టరేట్లు సాధించేసరికి- అంతా ఆకాశానికెత్తేశారు- పెద్ద మొత్తం తనకు ఎర చూపి తను సంపాదించిన విజ్ఞానాన్నంతా ఉపయోగించేందుకు వీలు కల్పించారు. ఒక నెలలో వారిచ్చేది భారతదేశంలో సంవత్సరకాలంలో కూడా రాదేమో!

ఎంతటి మేధావంతుడైనా తన మేధస్సుకు, అభ్యసించిన విద్యకు తగిన హోదా, జీతమూ అభిలషించక మానడు- అందులో తప్పుకూడా లేదు.

తండ్రి అభిప్రాయానికి, ఆశయానికి అది వ్యతిరేకమైనా డబ్బు సంపాదన కోసం కొన్నాళ్ళయినా ఇక్కడ వుండక తప్పదనుకున్నాడు-

మరోలా కూడా తను తండ్రికిచ్చిన మాటను నిలబెట్టుకోలేకపోయాడేమో,

అది పాశ్చాత్య నాగరికత, వేషంపై మోజు కాకపోవచ్చు. వచ్చిన చాలా రోజులవరకూ అంటే డిగ్రీలు సంపాదించేవరకూ తను వంటిగానే గడిపాడు.

కానీ....ఉద్యోగంలో చేరాక మనసుకీ, శరీరానికీ కాస్తంత విశ్రాంతి, సౌఖ్యమూ అవసరమనిపించాయి. అలవాటు కాకపోయినా కంపెనీకోసం తాగడం అలవాటైంది- అది అంతటితో ఆగలేదు- ఆ మత్తులో....ఆ వాతావరణంలో, ఆ

వయసులో ప్రేమతోబాటు అవసరమనిపించింది. తనను కోరివచ్చిన ఫ్లారెన్స్‌తో స్నేహాన్ని పెంచుకున్నాడు. కానీ ఆమెతో జీవితాన్ని పంచుకోవాలని తానేనాడూ అనుకోలేదు. ఆశపడలేదు. కేవలం బయోలాజికల్ నీడ్ కోసం. అంతే!

అయితే ఆమె నెలతప్పడం; కావాలని బిడ్డని కనడం తప్పుకాకపోయినా హిందూ సంప్రదాయానికి నీతికి అలవాటుపడి, అందులోనే పెరిగిన తన మనసు మారుమూలలో ఎక్కడో తప్పుచేశాననే భావన. ఆ తప్పును కప్పిపుచ్చుకో డానికి తనా మెను పెళ్ళిచేసుకోగలడా? మతాంతరమేకాదు దేశాంతర వివాహ మౌతుందా అది?

ఎప్పటికప్పుడే తండ్రికి తెలియపర్చాలనుకున్నాడు. కానీ ఏదో బలహీనత. అంచేత పూర్తిగా ఉత్తరాలే రాయడం మానుకున్నాడు.

మరో రెండేళ్ళలో తన స్వదేశమే పోడానికి నిశ్చయించుకున్నాడు. అప్పటికే స్నేహం, అటాచ్‌మెంట్, బంధుత్వం ఎలా పరిణమిస్తుందో చూడాలి!

ఇంతలోనే తండ్రికి చివరి ఘడియలన్నవార్త. సమత తండ్రిని కంటికి రెప్పలా చూసుకుంటుంది. ఇంత ఎత్తు కెదిగిన తను ఆమెకేం చేశాడు?

విజ్ఞానం, చదువు, జీవితంనుంచీ బాధ్యతలనుంచీ తప్పించుకు పారి పోడానికి కాదు. జీవితంలో ధైర్యంగా నిలబడి తనకూ తనవారికీ ఉపయోగ పడాలి.

తండ్రి కడసారి చూపైనా తనకు దక్కుతుందా?

గౌతమ్ కళ్ళవెంట నీరు ధారాపాతంగా కారుతోంది.

ఆ నీటిలో బాధ, పశ్చాత్తాపం తడిసి ముద్దవుతున్నాయి.

సాధ్యమైనంత త్వరలో తను విమానం ఎక్కాలి! జన్మభూమినీ; జన్మకు కారణమైన తండ్రిని చూడాలి!

ఉగ్గున లేచాడు గౌతమ్.

## ఉపసంహారం

దేవాలయంలా వుండే ఆ యింటిని చూడగానే కళ్ళంట నీళ్ళు తిరిగాయి సమతకు. కాళ్ళు వణికాయి.

ఏ వార్తను వినాల్సి వస్తుందోనన్న భయం ఆమె నరనరాల్లోనూ అవ హించి వుంది.

ఆమె వెనకే మౌనంగా నడుస్తున్నాడు జాన్.

అతని చేతిలో సంవత్సరంకూడా నిండని పసివాడు.

మెట్లెక్కి- వసారా దాటి, గుమ్మంలోకి అడుగుపెట్టబోతూ ఎదురుగా నున్న ఆమెను చూసి ఆగిపోయింది సమత-

దబ్బపండు రంగు శరీరఛాయ; నలభైఅయిదేళ్ళకు దాటిన వయసు; నుదుట పెద్ద కుంకుమబొట్టూ, ఎత్తు; ఎత్తుకు తగ్గ లావు..... ఎవరీమె? సమతను చూసి ఆమె చటుక్కున కళ్ళొత్తుకుని; 'రామ్మా, రా'. అంటూ లోనికి పిలిచింది- అప్పుడు చూసింది సమత ఆమె చేతిలోని స్టెతస్కోపును, టేబిల్ పై నున్న మందుల కిట్ నూ.

'డాక్టర్! మా నాన్నగారికిప్పుడెలా వుంది?' సమత గొంతు దుఃఖంతో పూడుకుపోతుంది-

ఆమె వెంటనే జవాబు చెప్పలేదు- కళ్ళతోనే ఆ ప్రక్కగదిలోని అయన వంక చూసింది. సమత అటు అడుగువేసేలోగానే అంది-

'చూడమ్మా ఆయనిప్పుడు రెస్టింగ్‌లో వున్నారు- మరో అరగంటలో మెలకువ రావొచ్చు - అప్పటివరకూ ఆయనను కదిలించకుండా వుంటే మంచిది, అంది___

కళ్ళలో నీళ్ళు చిప్పిల్లుతుండగా అలాగే అన్నట్లు తలూపింది సమత-

'నీ పేరేమిటమ్మా'

'సమత' అని జవాబు చెప్పి; ఆ వెంటనే 'వీరు మావారు' అంటూ జాన్‌ని కూడా పరిచయంచేసింది.

'చూడమ్మా సమతా ఒక్కమాట' అంటూ కుడివైపు గదిలోకి నడిచిందామె- అనుమానంగా ఒక్కసారి ఆమెవంక, జాన్‌వంక చూసి ఆమె వెనుకే వెళ్ళింది సమత.

'శారదకి మీ రెంతమంది పిల్లలు?' ఆమె నోటివెంట వెలువడ్డ ఆ ప్రశ్నకు మరింత ఆశ్చర్యపోయింది సమత.

"నేనూ, అన్నయ్యా. యిద్దరమే- అన్నయ్య అమెరికాలో వుంటున్నాడు" అంది.

"మీ అమ్మగారు....?"

'మా అమ్మ నా చిన్నతనంలోనే పోయింది- నాన్నే మమ్మల్ని పెంచి యింతవాళ్ళని చేసేడు. నా పెళ్ళి విషయంలో నాన్న పట్టుదల వహించి నన్ను దూరం చేసేడు – మీరు కబురుపంపేవరకూ నాకీ పరిస్థితే తెలీదు'- అని, ఆమె మౌనంచూసి, తిరిగి తనే అంది సమత.

'డాక్టర్లలోనూ మంచివాళ్ళుంటారని విన్నాను- కానీ మానవత్వమున్న మహానుభావులు కూడ వుంటారని యిప్పుడే తెల్సుకున్నాను- మీరు శ్రద్ధతీసుకోక పోతే నాన్న ఏమయ్యేవారో!'

'నేను వృత్తిరీత్యా డాక్టర్నే అయినా సంఘంలో నేనూ నీలాంటి మనిషినే నమ్మా- జీవితంలో విలువైనవీ ఆశించినవీ పొందలేని నిర్భాగ్యపు స్త్రీని కూడ'

ఆమె కళ్ళలో నీళ్ళూరటం చూసి చలించింది సమత.

'డాక్టర్.... మీరు.... మీరు....'

'మీరు అని గౌరవించక్కరలేదమ్మా. నీకు పిన్నిలాంటి దాన్ని- మీనాన్న మాకు దూరపు బంధువు- చిన్నప్పుడు నేనంటే మీ నాన్న కెంత అభిమానమో. ఆ తీపి జ్ఞాపకాలే నాలో యీ ఆవేదనకు కారణమమ్మా. మరేం కాదు- వైద్య వృత్తికే అంకితమైపోయిన నాకు మీ నాన్న యీ విధంగా తారసపడ్డాడు- కళ్ళెత్తి పలకరింపుగా నవ్వితే అంతే చాలనుకుంటున్నాను-' అని, అనకూడని మాటేదో అనేసినట్లు తడబడి, సర్దుకుని, 'ఆయన దగ్గరున్న డైరీలో నీ అడ్రసును చూసి కబురంపేను. నేనిప్పుడే అరగంటలో వస్తా. నాన్నని చూస్తూండమ్మా-!' అంటూ ముఖంలో మారుతూన్న రంగుల్ని సమతకు చూపడం యిష్టంలేనట్లు వెనుదిరిగింది.

'డాక్టర్.... మీ పేరు....'

'వసంత' అంటూ వడివడిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయిందామె.

వసంత ఎవరో.... తండ్రికీ ఆమెకూ మధ్యనున్న బంధుత్వ మేమిటో సమత కర్థంకాలేదు-

'ఏమైనా ఆమె తనపాలిట దేవత' అనుకుంది మనసులో.

*          *          *

శరీరంలో కాస్త కదలిక వచ్చిన తండ్రి కళ్ళలోకి ఆశగా చూసింది సమత. అవి కళ్ళలా కాకుండా అనుభవాలతో నిండిన బావుల్లా అన్పించాయామెకు.

లోగుడ్లు కదిలించి బరువుగా కనురెప్పలెత్తాడు కాశ్యప్.

ఎదురుగా తన కళ్ళలోకే ఆశగా చూస్తూ సమత.

సమతను గుర్తించినట్టు అతనికళ్ళు మీనాల్లా మిలమిలలాడేయి - ఆ వెంటనే ఓ నిట్టూర్పు విడిచి బాధగా మూల్గాడు



గుండెల్లో నిండి పొంగిన బాధ అతని కనుకొలకుల్లో పూరడం మొదలు పెట్టింది.

'నాన్నా' అంటూ బావురుమంది సమత-

అతని ఛాతిపై ఆమెచేతులు ఆర్తితో పరుగులెత్తాయి.

కాశ్యప్ గుండెల్లోంచి దొంతరదొంతరులుగా దుఃఖం- అతని గుండెలు ఎగిసెగిసిపడ్డాయి - కళ్ళనుండి రెండు కన్నీటి బిందువులు చెంపల మీదుగా జారాయి- అంతలోనే వెక్కిళ్ళు.

పెదాలుకదిపి ఏదో సంజ్ఞ చేశాడామెకు- అది గ్రహించిన జాన్ పిల్లవాడి నక్కడే దింపి లోపలకు పరుగెత్తాడు- గూట్లోని గ్లాసు తీసుకుని కూజా దగ్గరకు వెళ్ళాడు- అందులో నీళ్ళు నింపుకుని ఎన్నాళ్ళయిందో! మంచినీళ్ళ నిండెకూడా ఖాళీగానే వెక్కిరించింది- జాన్ అడుగులు తడబడ్డాయి- వెక్కిళ్ళు వినిపిస్తూన్నా యతనికి- జాన్ చూపు గది నాలుగు మూలలకూ పరుగెత్తింది- ఈశాన్య మూల నున్న దేవుడి మందిరంపై నిల్చిందాచూపు-

గీత బోధించే కృష్ణుడు- ఓంకారం నడుమ వెంకటేశ్వరస్వామి; విద్యల తల్లి సరస్వతీదేవి- పెద్దపెద్ద పటాలలో- ఆ క్రింద సింహాసనం తొట్టె ప్రక్క రాగిచెంబులో సీలువేసిన గంగ.... పవిత్ర కాశీగంగ.

చటుక్కున అటువైపు నడిచాడు-

వంగి, గంగను తీయబోయి ఆగాడు.

మనసులో ఏదో సంశయం.... ఆ వెంటే ధైర్యం!-

ఒక్క క్షణం గుండెలమీద చెయ్యివేసుకొని క్రీస్తును తల్చుకున్నాడు-

ఆ వెంటనే గంగాజలాన్ని తీసుకుని, సీలుతీసి పరుగెత్తుకెళ్ళాడు-

కాశ్యప్ గుండెల్లోంచి ఉధృతంగా వెక్కిళ్ళు-

కలశం వంపి, అతని నోట్లోకి గంగను ధారగా పోశాడు- అతని చేతులకు సమత చేతులూ జతపడ్డాయి-

పవిత్ర గంగాజలం కాశ్యప్ నోటిగుండా కడుపులోకి చల్లగా జారిపోతోంది-

అతని ముఖంలో ఏదో గొప్ప వెలుగు- కనురెప్పలు పూర్తిగా విప్పి చూశాడు- ఎదురుగా సమత.... ఆ ప్రక్కనే జాన్....

అతని కళ్ళలోనూ మనసులో సంతృప్తి- వారివంక చూస్తూనే వున్నాడు. జాన్ కరుణామయుడిలా.... సమత అన్ని మతాల మమతానుబంధంగా....

కనురెప్పలు దించి ఆమె ఒడిలోకి చూశాడు-

'నీ మనుమడు నాన్నా' అంటోంది సమత దుఃఖంలోంచి తెచ్చుకున్న సంతోషంతో.

కాశ్యప్ చూస్తూనే వున్నాడు- అతనికేదో అంతా కొత్తగా వుంది- మతాల




కలితమైన మమతానురాగాలు వెల్లివిరిసే లోకంలో కనులువిప్పి కదులాడుతూన్నట్లుంది—

సమత ముఖంలో అతనికి ఈశ్వరుడు కనిపించాడు— ఆ క్షణంలోనే అల్లా దర్శన మిచ్చాడు— జాన్ ముఖంలో కరుణామయ ఏసు—

పసివాడు ముఖంలో ఈశ్వరుడు, అల్లా, ఏసు— ముగ్గురూ—

॥మత్తః పరతరం నాన్యత్కించి దస్తి........

మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥

దారమందలి మణులవలె వివిధ జాతి మతములకు చెందిన ప్రాణులన్నీ పరమాత్మ అయిన నాయందే కూర్చబడినవన్న గీతలోని కృష్ణుని బోధ అతని మదిలో మెదిలింది—

'ఈశ్వర్ అల్లా తేరేనామ్....'

దూరంనించి సన్నగా పాట వినిపిస్తోందతనికి....

అతని కళ్ళు శాశ్వతంగా మూతలుపడ్డాయి.



# ప్రయాణంలో ప్రేమ



జె.ఎస్. ఘోస్‌నాథ్

రైలు ఇంక బయలుదేరబోతోందనగా ప్లాట్‌ఫారంమీదికి పరుగెత్తుకొచ్చింది ప్రమీల. గార్డు గట్టిగా విజిల్ ఊదాడు. దానికి జవాబా అన్నట్టు రైలింజను కూడా కర్కశంగా కూత పెట్టి 'భుస్సుభుస్సున' పెద్ద చప్పుడు చేసింది. అంతే.... దాంతో ప్లాట్‌ఫారంమీద ఒకటే హడావిడీ ప్రారంభమైంది. అంతసేపూ స్టైయిల్‌గా నిలబడి కబుర్లు చెప్పుకుంటున్న పాసింజర్లందరూ గబగబా రైల్లోకి ఎక్కి తమ తమ సీట్లల్లో కూర్చున్నారు. ప్రమీల కూడా తన సూట్‌కేస్‌తో సహా ఎలాగో ఎక్కేసింది.

గార్డు పచ్చజెండా వూపగానే రైలు మెల్లగా కదిలింది. ప్లాట్‌ఫారం మీదున్న వాళ్ళందరూ చేతులు పైకెత్తి ఊపసాగారు "టా.. టా.... బై ....బై... " అంటూ. కొంతమంది రుమాళ్ళు తీసి ఊపారు మరి కొందరు తమ ఆప్తుల వియోగం భరించలేక ఆ రుమాళ్ళతోనే తమ కళ్ళు అద్దుకున్నారు ప్రయాణికుల్లో కొందరు వాచీలు చూసుకుని రైలు సరైన టైమ్‌కు బయలుదేరినందుకు మనసులోనే సంతోషించారు

కదులుతున్న రైలుతోబాటే నడుస్తూ కూతురికి ఎన్నో జాగ్రత్తలు చెప్పాడు ప్రమీల తండ్రి. "జాగ్రత్తగా వెళ్ళమ్మా .... వెళ్ళగానే ఉత్తరం రాయడం మర్చిపోకే! పాఠాలు శ్రద్ధగా చదువుకో. అన్నయ్య వదినలతో కలిసిమెలిసి ఉండు."

చటుక్కున ప్రమీల కెదురుసీటులో కూర్చున్న వ్యక్తికేసి చూశాడు ఆయన.

ఆ వ్యక్తి మంచివాడిలా కనిపించేసరికి "మీరు ఎక్కడిదాకా వెళతారు బాబూ..." అని అడిగాడు

"హైదరాబాదు వరకండీ...." వినయంగా సమాధానమిచ్చాడు ఆ వ్యక్తి.

"అయితే మా అమ్మాయిని కొస్త కనిపెట్టుకోండి బాబూ .. అమ్మాయ్ ఈయన నీకు తోడుంటారు.... ఏం భయపడకుండా వెళ్లు ..."

అప్పటికే పరుగెత్తి అలసిపోయిన ముసలాయన అంతటితో ఆగిపోయాడు.

"అలాగేలెండి .... మీరేం దిగులు పడకండి ...." అని రైల్లోని వ్యక్తి భరోసా ఇచ్చాడు కానీ ఆ మాటలు ఆ ముసలాయనకు వినిపించలేదు రైలు అప్పటి కాగా వేగం అందుకుంది.

ప్రమీల కిటికీలోంచి మొహం ఇవతలికి తీసుకుని తన కెదురుగా కూర్చున్న వ్యక్తికేసి చూపులు సారించింది. అతను చిరునవ్వుతో తనకేసే చూస్తున్నాడు. మంచి ఒడ్డూ, పొడుగూ వుండి తెల్లగా ఆకర్షణీయంగాఉన్నాడు. తెల్లని పైజామా గోధుమరంగు సిల్కులాల్చీ తొడుక్కున్నాడు. వెడల్పాటి ముఖానికి నల్లప్రేము కళ్ళజోడు ఎంతో అందాన్నిస్తోంది. గాలికి ఎగిరెగిరి పడుతూ మాటిమాటికీ నుదుటి మీదికి వాలుతున్న నల్లని జుట్టు, పెద్ద నుదురు, కొస్త చిన్నవైనా వింతకాంతితో నిశితంగా పరికించే కళ్లు, సన్నని మీసకట్టు, తీరైన నోరు-మొత్తానికి అందంగా హుందాగా ఉన్నాడు అంతేకాదు, చూడగానే గౌరవభావం కలిగించే ప్రత్యేకత ఏదో వుంది అతనిలో.

ప్రమీల ఉన్నట్టుండి కళ్లు కిందికి వాల్చుకుంది. 'ఛ! ఒక అపరిచితవ్యక్తిని అంతసేపు రెప్పవాల్చకుండా చూస్తూ కూర్చుంటే అతనేమనుకుంటాడు!' అని తనకుతానే మందలించుకుంది.

అంతలో ఆమెకు మరో సందేహం వచ్చింది— కంపార్టుమెంటులో ఉన్నవాళ్లు ఎవరైనా తనను చూశారేమో అని. వెంటనే కళ్లు పైకెత్తి ఓసారి చుట్టూ పరికించి చూసింది. కంపార్టుమెంటులో అట్టే జనం లేరు. ఓ ప్రక్క మూలగా ఎవరో కొత్తదంపతులు, (ఒకరికళ్ళలోకి ఒకరు చూసుకుంటూ, పరిసరాలను కూడా మరిచిపోయి పరవశంగా గుసగుసలాడుకుంటున్న వాళ్ళను చూస్తే వాళ్ళు కొత్తదంపతులని ఇట్టే తెలిసిపోతుంది. అల్లరిగానవ్వే అతని కళ్లు, మధ్యమధ్యన సిగ్గుతో వాలిపోతున్న ఆమెకళ్లు, ఎరుపెక్కుతున్న ఆ బుగ్గలు- ఆ విషయాన్ని బలపరుస్తున్నాయి.) ఎదురు సీట్లో గుర్రుపెట్టి నిద్రపోతున్న ముసలాయన, రైల్లో కూర్చున్నా తమ సంసారపు గొడవలే మాట్లాడుకుంటూ మధ్యమధ్యలో కీచు

లాడుకుంటున్న మధ్యవయసు దంపతులు, సినిమా బొమ్మలు తప్ప ఇంకేమీ అక్కర్లేదేమోనన్నట్టు సినిమా వార పత్రికలో పూర్తిగా మునిగిపోయిన పాతికేళ్ల యువకుడు - తప్ప ఇంకెవరూ లేరు.

'హమ్మయ్య! అంతా ఎవరి గొడవల్లో వాళ్ళున్నారు. తనను గమనించేవాళ్ళు ఎవరూ లేరు.' అనుకుని తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది ప్రమీల. మళ్ళీ బయటికి చూస్తూ కూర్చుంది. రైలు చాలా వేగంగా దూసుకుపోతోంది. స్తంభాలు ఒక్కొక్కటే వెనక్కి పరుగెడుతున్నకొద్దీ టెలిగ్రాఫ్ వైర్లు పైకీ, కిందికీ అవుతూంటే తమాషా అనిపించి వాటివంకే చూస్తుండిపోయింది.

కాసేపటికి అదీ విసుగుపుట్టి తిరిగి లోపలికి చూసింది ఆమెదృష్టి తనవైపుకు మళ్ళగానే మళ్ళీ చిరునవ్వు నవ్వాడు- అవ్యక్తి. జవాబుగా ప్రమీల కూడా నవ్వింది. హైదరాబాదులో ఆమె ఎక్కడుంటుందో, ఏం చదువుతూందో, ఏ కాలేజో అన్నీ అడిగి తెలుసుకున్నాడు ఆ వ్యక్తి. దారిలో ఏం కావాలన్నా నిస్సంకోచంగా అడగమని కూడా చెప్పాడు.

అప్పుడు చటుక్కున ఏదో స్ఫురించి అతన్నికేసి ఇంకోసారి పరీక్షగా చూసింది ప్రమీల. అవును, సందేహంలేదు ఇతన్ని తను ఇదివరకే ఎక్కడో చూసింది ఎక్కడ చూశానబ్బా? అని కాసేపు ఆలోచించేసరికి ఆమెకు జవాబు దొరికింది. ఇతన్ని తను నేరుగానే చూడలేదు, ఫోటోలో చూసింది.

ఆ వ్యక్తిపక్కన నాలుగైదు వారపత్రికలు, ఒకటి, రెండు మాసపత్రికలు, ఒక దినపత్రిక ఉన్నాయి. వాటిల్లోంచి ఒకటి తీసుకుని అతను తిరగేస్తుంటే తనుకూడా ఏదైనా పత్రికలు తెచ్చుకుంటే బాగుండే దనిపించింది. కానీ అవి కొనుక్కోడానికి అసలు తనకు టైమెక్కడిదీ? తను స్టేషను కొచ్చేసరికే రైలు కదలడానికి సిద్ధంగా వుంటాయే పోనీ అతన్నే అడిగితేనో ....?

ప్రమీల అడిగింది. అతను మొత్తం అన్ని పత్రికలనూ పేర్చి ఆమెకు అందించాడు.

"అయ్యబాబోయ్!" అంటూ అరిచినంత పనిచేసింది ప్రమీల. అతను అదిరిపడి ఆమెకేసి చూశాడు. గుసగుసలాడుకుంటున్న దంపతులుకూడా ఓసారి తమ లోకంనుంచి ఇవతలికి వచ్చి ఆమెకేసి ఆశ్చర్యంగా చూశారు. నిద్రపోతున్న ముసలాయన కూడా ఓసారి కళ్ళు తెరచి చూసి తిరిగి పడుకున్నాడు. మధ్యవయసు దంపతులు కూడా తమ కీచులాట మాని ప్రమీలకేసి ప్రశ్నార్థకంగా చూశారు.

లక్షల కట్నంతో వచ్చిందిట అందుకే
ఆవిడ కోడల్ని అపురూపంగా
చూసుకుంటుంది!!






"ఏమైందండీ ...? ఎందుకలా అరిచారు?" కంగారుగా అడిగాడు అతను

ప్రమీల కళ్ళు పెద్దవి చేసుకుని ఆ పత్రికలకేసే చూస్తూ "ఈ పత్రికలన్నిటిలోనూ ప్రఖ్యాత రచయిత క్రాంతికుమార్ గారి కథలున్నాయి చూశారా?" అంది సంబరంగా.

"చూశాను. ఉంటేనేం?" చాలా మామూలుగా అన్నాడతను.

ప్రమీలకు కోపం వచ్చింది 'ఎంత తేలిగ్గా మాట్లాడుతున్నాడు? ఆ మహా రచయిత గురించి తెలియదు కాబోలు — అందుకే అలా అంటున్నాడు' అనుకుని "ఆయన రచనలు మీరు చదివారా?" అని అడిగింది అసహనంగా.

"ఆ....చదివాను. ఒక్క అక్షరం పొల్లుపోకుండా ఆయన కథలన్నీ చదివాను." నవ్వుతూ అన్నాడు అతను.

ఆమె మొహం సంతోషంతో విప్పారింది. కళ్ళు తళుక్కున మెరిశాయి.

"అయ్యబాబోయ్ నిజంగానా?" అని ఆశ్చర్యంగా అడిగింది.

"ఆయన రచనలంటే మీకు ఇష్టమా?" మామూలుగా అడిగాడు.

"అమ్మో....ఇష్టమంటే అంతా ఇంతా కాదు, పడిచస్తాను. అబ్బ! ఎంత బాగా రాస్తారు కదండీ ఆయన?"

"ఆఁ .... ఫరవాలేదు. అప్పుడప్పుడు బాగా రాస్తారనుకోండి."

ఈ మాట అంటున్నప్పుడు అతని–

పెదాలు విచ్చుకున్నాయి. తెల్లని పలు వరస తళుక్కున మెరిసింది. కళ్ళలో కాంతి ఇంకా ఎక్కువై ముఖం సంతో షంతో వెలిగిపోయ్యింది.

అతను చటుక్కున లేచాడు. పైన పెట్టిన సూట్‌కేస్ తెరచి చిన్నసైజు పుస్తకాలు రెండు తీసి తన పక్కన పెట్టు కున్నాడు.

కుతూహలంగా అతన్నే చూస్తున్న ప్రమీల కళ్లు చటుక్కున ఆ పుస్తకాల వైపు మళ్ళాయి. వాటిమీదున్న రచయిత పేరు చూడగానే సంతోషం పట్టలేక పోయింది.

"అయ్యబాబోయ్ కాంతికుమార్ గారి కొత్త నవలలు. ఏమండీ... ఏమండీ ఓ సారి ఆ పుస్తకాలివ్వరూ? చూసిస్తాను"

బొమ్మ చూసిన పసిపాపలా అమా యకంగా ప్రాధేయపడింది ప్రమీల.

అతనునవ్వుకున్నాడు.'అయ్యబాబోయ్' అనేది ఈమె ఊతపదం కాబోలు- అందుకే మాటిమాటికీ అదే పదాన్ని ఉప యోగిస్తోంది' అనుకున్నాడు మనసులో. వెంటనే జేబులోంచి పెన్నుతీసి ఆ రెండు పుస్తకాల మొదటి పేజీల్లోనూ-

'కుమారి ప్రమీలకు,

అభిమానంతో-

క్రాంతికుమార్.

అని రాసి ఆ రోజు తేదీరాసి ఇచ్చాడు.

అతను రాసింది చదవగానే ఆనందం పట్టలేక ఒక్క కేక పెట్టింది ప్రమీల.

ఏదో అఘాయిత్యం జరిగిపోయిం దేమోనన్నంత గాభరాపడిపోయి అందరూ వీళ్ళకేసే చూశారు.

మళ్ళీ అలాంటిదేం జరగనందుకు నిరాశపడి తిరిగి ఎవరి ధోరణిలో వారు పడ్డారు.

"మీరేనా క్రాంతికుమార్‌గారు? అబ్బ ....ఇవ్వాళ ఎంత మంచిరోజండీ....ఎంత అదృష్టమో....?" అంది ప్రమీల. తనకు కలిగిన సంతోషాన్ని వ్యక్తంచేయడానికి ఆమెకు మాటలే దొరకడంలేదు.

అతను నవ్వి "ఇందులో అదృష్టమే ముందండీ .. ?" అన్నాడు.

"భలేవారే! నా అభిమాన రచయిత గారిని ఇంత దగ్గరగా, ఇంత సులభంగా చూడగలగటం అదృష్టంకాక మరేమిటి? అయినా మీరు చాలా కొంటెవారుసుమండీ! ఇంత సేపట్నుంచీ ఎదురుగుండానే కూర్చున్నారు గానీ మీరు 'ఫలానా' అని చెప్పారేమిటి? నన్నయితే అన్ని వివ రాలూ అడిగి తెలుసుకున్నారు చక్కగా" బుంగమూతి పెట్టింది ప్రమీల.

అతను జవాబు చెప్పలేదు ఆమె మాటలకు ముగ్ధుడైపోయి అలాగే చూస్తూ కూర్చున్నాడు.

ప్రమీల అతని కథలన్నీ చదివింది. అప్పుడప్పుడు అతనికి ఉత్తరాలు కూడా

రాసింది. కానీ అతన్ని కలుసుకుంటానని గానీ, అతనితో ఇంతసేపు మాట్లాడతానని గానీ ఆమె కలలో కూడా అనుకోలేదు. ఇప్పుడు అనుకోకుండా అది జరిగేసరికి ఆమె ఉబ్బితబ్బిబ్బయి పోయింది.

అతనుకూడా ఇప్పుడు ఆమె గురించే ఆలోచిస్తున్నాడు. తనకు ఇదివరకు ఉత్తరాలు రాసిన అమ్మాయి ఈమేనన్నమాట! అనుకుంటున్నాడు. తన నవల చదివి మెచ్చుకుని, లేనిపోని పిచ్చి సందేహాలన్నీ వ్యక్తంచేస్తూ ఆమె రాసిన ఉత్తరాలకు తనూ పిచ్చిపిచ్చి సమాధానాలే రాశాడు. అయితే ఎవరో స్కూల్లో చదివే అమ్మాయి కావచ్చు ననుకున్నాడే కానీ ఆమె కాలేజీలో చదువుకునేంత పెద్ద అమ్మాయి అని మాత్రం అనుకోలేదు ఆమె అందం, అమాయకత చూస్తున్న కొద్దీ తను రాయబోయే తరువాతి నవలలో ఇలాంటి నాయికనే సృష్టించాలనిపించింది. అంతలో రైలు వేగం తగ్గింది. ఏదో స్టేషను వస్తోంది కాబోలనుకుని బయటికి తొంగిచూసింది ప్రమీల. ఆమె ఊహ రైటే. రైలు నెమ్మదిగా స్టేషనులో ఆగింది.

కాఫీ, టీలవాళ్ళు, పళ్ళు, బిస్కెట్లు అమ్ముకునేవాళ్ళు చెవులు చిల్లులుపడేలా కేకలుపెడుతూ ప్రతి కిటికీమీదికి దాడి చేస్తున్నారు.

క్రాంతికుమార్ అరటిపళ్ళు, యాపిల్సు కొన్నాడు ప్రమీల వద్దంటున్నా వినకుండా ఆమెకూ కొన్ని ఇచ్చాడు. "వయసులో ఉన్న పీలాంటి అమ్మాయిలు బాగా తినాలి, తెలిసిందా?" యౌవ్వనంతో మిసమిసలాడుతున్న ఆమె శరీరంకేసి చూస్తూ అన్నాడు.

ప్రమీల సిగ్గుపడిపోయింది.

ఆ తరువాత ఉన్నట్లుండి అడిగింది. "అవును, మీ 'తారలు లేని ఆకాశం' నవలలో వస్తుందే ఆ సావిత్రి మీకెక్కడ కలిసిందండీ....?"

"సావిత్రా?" ఆశ్చర్యపోయాడతను. 'నవలలోని పాత్ర ప్రత్యక్షంగా వచ్చి తనతో కలవడమేమిటి?' అనుకుంటుంటే నవ్వొచ్చింది. అయినా ఆమెను ఆటపట్టించాలని "ఇలాగే....ఇప్పుడు నువ్వు కలిశావు చూడు; ఆమె కూడా ఓసారి రైల్లోనే కలిసింది." అన్నాడు.

ప్రమీల మళ్ళీ బుంగమూతి పెట్టింది.

"ఛ! పోండి .... అన్నీ అబద్ధాలు. నిజంగా చెప్పండి ఎక్కడ తారసపడింది?"

"నిజమే చెబుతున్నాను ప్రమీలా.... ఇలాంటి చక్కని సాయంకాలం వేళ.... ఇలాగే రైల్లో .... నా ఎదురు సీట్లో కూర్చుని... "

ప్రమీల ఒళ్ళంతా చెవులు చేసుకుని శ్రద్ధగా వినసాగింది. అతను చెప్పే

ఒక్కో మాటా ఆమెకు వేదవాక్యంలా తోస్తోంది. ఆయితే రైలు చప్పుడు, గాలి రొదలో ఆ మాటలు సరిగ్గా వినిపించక పోవడంతో ఎప్పుడు వచ్చి అతని పక్కన కూర్చుందో ఆమెకే తెలియదు. ఆమె సీటుమీద పెట్టిన పుస్తకాల పేజీలు గాలికి టపటపా కొట్టుకుంటున్నాయి.

సావిత్రి గురించిన కథ చెబుతూ చెబుతూ మధ్యలో ఆగాడు క్రాంతికుమార్. చలిగాలికి ప్రమీల సన్నగా వణుకుతూం డటం చూసి తన పక్కనున్న లాంగ్ కోటు తీసి ఆమెకు కప్పాడు అతను.

రెప్పపాటులో జరిగిపోయిన ఈ సంగతి ప్రమిలకు చాలా విస్మయం కలి గించింది. మళ్ళీ అంతలోనే చెప్పలేనంత సంతోషంకూడా కలిగింది.

తను అతిగా అభిమానించే, ఆరాధించే రచయితగారితో ఇంత సన్నిహితంగా ఉండటమే కాకుండా, అయనకోటు కప్పు కునే భాగ్యం కూడా కలిగినందుకు ప్రమీల ఎంతగానో మురిసిపోయింది. అదో రకమైన తన్మయత్వం ఆమెను ఆవ రించేసింది!

అతను మాట్లాడుతూ, మాట్లాడుతూ తన భుజం మీద తట్టినా, చేతులను స్పరించినా ఆమెకు ఏమీ అనిపించలేదు. అసలా విషయాన్ని పట్టించుకునే స్థితిలో కూడా లేదు ఆమె. సావిత్రి కథలో పూర్తిగా లీనమైపోయింది.

"మీరేమైనా చెప్పండి మాష్టారూ.... పెళ్ళయి, ఒక కొడుకు కూడా ఉన్న సావిత్రి ఎంత కళాకారిణి అయితే మాత్రం అలా భర్తనూ, కొడుకునూ వదిలి ఓ కళాకారుడివెంట వెళ్ళిపోవడం నాకేమీ నచ్చలేదు."

—అంతా విన్న తరువాత తన అభి ప్రాయాన్ని వెలిబుచ్చింది ప్రమీల.

అతను చిరునవ్వు నవ్వాడు. "సావిత్రి చాలా ఉదాత్తమైన పాత్ర ప్రమీలా. హృదయంలేని భర్త, తల్లి అనే ఆప్యాయతలేని కొడుకు-యాంత్రిక మైన జీవితం- ఎన్నాళ్ళని భరించగలదు చెప్పు? ఒక చల్లని మాటకోసం, కాసింత ఆప్యాయత కోసం పరితపించిపోయిన సావిత్రి మనసు సున్నిత మనస్కుడైన శ్రీధరమూర్తి వైపు ఆకర్షించబడడంలో తప్పేమీలేదు. జీవితంలో విసిగి వేసారి పోయిన మనిషి సేదదీరే చోటుకోసం అన్వేషించడం సహజమే కదా! అయినా ఇవన్నీ అర్థంచేసుకునే వయసు కాదులే నీది." అని చెప్పి ముగించాడు.

— ఇలా మాటల్లోపడ్డ వాళ్ళిద్దరికీ సమయం గడిచిందే తెలియలేదు. రైలు ఒక్కో స్టేషనులో ఆగి ప్రయాణికులను దింపి, మళ్ళీ కొత్తవాళ్ళను ఎక్కించు కుని తన మానాన తను ముందుకు సాగి పోతూనే వుంది.

ప్రమీల కోటును ఇంకాస్త గట్టిగా లాగి కప్పుకోవడం చూసి "బాగా చలేస్తుందా?" అన్నాడు అతను జేబులోంచి సిగరెట్టు తీసి వెలిగిస్తూ.

అవునన్నట్టు తలూపింది ప్రమీల.

"అయితే సిగరెట్టు కాల్చు. వెచ్చగా ఉంటుంది."

"ఛీ! పాడు. ఆడవాళ్ళెక్కడైనా సిగరెట్టు కాలుస్తారేమిటి?" మొహం చిట్లించుకుని అంది ప్రమీల.

అతను నవ్వి సిగరెట్టు కాలుస్తూ మౌనంగా కూర్చుండిపోయాడు.

ప్రమీలకిదంతా కొత్తగావుంది. 'విలక్షణమైన ఈ అనుభవాన్ని తను జీవితాంతం అపురూపంగా దాచుకోవాలి.' అనుకుని తన్మయంగా కళ్ళుమూసుకుంది.

కాసేపటికి కళ్ళుతెరచి క్రాంతికుమార్ వైపు చూసింది. ఇప్పుడతని మొహంలో నవ్వులేదు. విషాదం, విచారం అలుముకుని వున్నాయి. బయటకి చూస్తూ దీర్ఘాలోచనలో మునిగివున్నాడు.

'ఇంతలో ఏమైందబ్బా?' అనుకున్న ప్రమీల అతని భుజంమీద చెయ్యివేసి కుదుపుతూ "ఏమండీ క్రాంతికుమార్ గారూ.... అలా వున్నారేమిటి? మాట్లాడరేం?" అంది.

"ఆఁ...." అంటూ అతను ఉలిక్కిపడ్డాడు. మొహంమీదికి నవ్వు తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ "ఏమన్నావ్?" అని అడిగాడు.

"మీ రిప్పుడు కొత్తగా ఏంరాస్తున్నారు? అవి ఏ పత్రికల్లో పడతాయో చెపితే నేను కొని చదువుతాను" అంది.

"నే నిప్పుడు ఏమీ రాయడం లేదు ప్రమీలా—" అన్నాడు. అతని గొంతు బొంగురుపోయినట్టు అదోలా ధ్వనించింది.

"ఏం .... ఎందుకని?" ఆశ్చర్యపోయింది ప్రమీల.

"నా మనసేం బాగోలేదు."

ప్రమీల చటుక్కున లేచి నిటారుగా కూర్చుంది. ఆమె లేతహృదయం విలవిలలాడిపోయింది. 'ఇంత గొప్ప రచయితకు మనసు బాగోకపోవడం ఏమిటి?' అనిపించింది ఆమెకు. తన చెవులను తానే నమ్మలేకపోయింది. ఆయన కంతటి కష్టాలేముంటాయి గనుక? బోలెడంత పేరు ప్రఖ్యాతులున్నాయి. కావలసినంత డబ్బుంది. కీర్తిప్రతిష్ఠలకేం లోటు లేదు. అలాంటప్పుడిక వ్యథ చెందడానికి కారణమేమిటి?

"మీరు నిజంగానే అంటున్నారా?"

"నిజం ప్రమీలా....ఒట్టు. పైకి ఇలా నవ్వుతూ మాట్లాడుతున్నానే కానీ నాలో అంతా దుఃఖమే. జీవితంలో కష్టాలు తప్ప నా కింకేమీ మిగల్లేదు" అంటూ

కళ్ళజోడు తీసి చెమ్మగిల్లిన కళ్ళను రుమాలుతో తుడుచుకున్నాడు అతను.

ఆ దృశ్యాన్ని ప్రమీల చూడలేక పోయింది. ఆమె మనసంతా కలచివేసి నట్టు కాగా అతనివైపు బేలగా చూసింది.

"ఏం జరిగిందండీ? ఎలాంటి కష్టం వచ్చింది మీ కిప్పుడు?"

"ఎందుకో నేను రాయలేకపోతున్నాను ప్రమీలా. ఇదివరకైతే కాగితం మీద పాళీ ఆనిస్తే చాలు-అక్షరాలు వాటంతటవే పుట్టుకొచ్చేవి. పేజీలు ఇట్టే నిండిపోయేవి. కానీ ఇప్పుడు ఎంతగా తల బద్దలు కొట్టుకున్నా ఒక్క అక్షరంకూడా బుర్రలో మెదలటం లేదు....అయిపోయింది. ఇంతటితో నాలోని రచయిత చచ్చిపోయాడు. నేనిక ఏమీ రాయలేను...."

ప్రమీలకు ఏడుపొచ్చినంత పనయింది. అతనిపట్ల చెప్పలేనంత సానుభూతి పుట్టుకొచ్చింది.

"మీరలా మాట్లాడకండి మాష్టారూ... నేను భరించలేను. మీరు రాయడం మానేస్తే మాలాటివాళ్ళంతా ఏమైపోవాలి చెప్పండి? అయినా మీకేం తక్కువైందని? ఇప్పుడు కొంచెం మనసు బాగోక పోవచ్చు. కానీ తరువాత మనసు కుదుట పడ్డాక రాయవచ్చుగా?" అంది.

అతను భారంగా నిట్టూర్పు విడిచాడు. "దీపావళి ప్రత్యేక సంచికలకు కథలు పంపమని కోరుతూ సంపాదకులు రాసిన ఉత్తరాలు చాలా ఉన్నాయి. కొన్ని పత్రికలు అప్పుడే ప్రకటనలో నా పేరు ప్రకటించేశాయి కూడా....ఇప్పుడేం చేయాలో తోచకుండా వుంది. అదే నా చింత" అన్నాడు. అతని మొహాన అవరించిన విచారరేఖలు ఇంకా అలాగే వున్నాయి.

ప్రమీల మనస్సు తల్లడిల్లిపోయింది. అతని విచారానికి కారణమేమిటో తెలిస్తే బాగుణ్ణనిపించింది. 'మనిషి చూస్తే, ఆరోగ్యంగా, బాగానే వున్నాడు. ఇంట్లో ఇతనికి అందమైన భార్య పిల్లలు ఉండే వుంటారు. అవును, ఇద్దరు పిల్లలన్నా లేకపోతే ఏంబాగుంటుంది? ఒక అమ్మాయి ఒక అబ్బాయి వుంటేనే ఇంటికి అందం ఆనందం.

మనసులోనే అతని కుటుంబాన్ని ఊహించుకుంది ప్రమీల. అంతేకాదు అదే అతన్ని అడిగేసింది కూడా.

అతను ఉన్నట్టుండి పెద్దగా నవ్వాడు. "భార్య, పిల్లలు... వాళ్ళే వుంటే నాకీ వ్యధ ఎందుకు?" అన్నాడు మళ్ళీ అంతలోనే ఖిన్నుడై పోయి.

"అంటే?" అర్థంకాక అడిగింది ప్రమీల

"నా భార్య ఈ మధ్యనే నన్ను ఒంటరివాణ్ణి చేసి వెళ్ళిపోయింది...."

అతని మాట ఇంకా పూర్తికాకముందే






"అయ్యో పాపం!" అంది ప్రమీల. అప్పటికే ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "మరి పిల్లలో?"

అతను విషాదంగా నవ్వాడు. "ఒక అబ్బాయి వున్నాడు. కానీ వాడికి పుట్టుకనుంచే కళ్ళు లేవు" అని చెప్పడం ఆపి తల వంచుకుని మౌనంగా కూర్చున్నాడు.

వింటున్న ప్రమీల వెక్కి వెక్కి ఏడవడం మొదలెట్టింది. 'తన అభిమాన రచయితకు ఇన్ని కష్టాలా? నవలల్లోనూ, కథల్లోనూ ఎన్నెన్నో సుందర స్వప్నాలను చిత్రించగల రచయిత స్వయంగా ఇంతటి కష్టాలను అనుభవిస్తున్నాడా? అందమైన సన్నివేశాలను సృష్టించి పాఠకుల మనసులను ఉర్రూతలూగిస్తున్న మహారచయిత నిజ జీవితంలో ఇంతటి దుఃఖాన్ని భరిస్తున్నాడా?"

ప్రమీల అతికష్టంమీద ఏడుపు నాపుకుంది. తలవంచుకుని మౌనంగా కూర్చుని వున్న క్రాంతికుమార్‌ను చూస్తూంటే ఆమెకు కడుపు తరుక్కుపోయినట్టయింది. అతని భుజంమీద చెయ్యివేసి ఓదార్పుగా అంది. "మీరిలా బాధపడుతుంటే నేను చూడలేనండి....కొంచెం ధైర్యం తెచ్చుకోండి." అంతకన్నా ఏం మాట్లాడాలో ఆమెకు తోచలేదు.

అతను తలెత్తాడు. బయటికి చూస్తూ- "నా కిప్పుడు ఎవరూ లేరు ప్రమీలా. నేను ఒంటరివాణ్ని. చిన్నప్పుడు తల్లిదండ్రులు పోయారు. ఇప్పుడు నన్ను ప్రాణాధికంగా ప్రేమించే భార్య పోయింది. ఇక నే నెవరికోసం బతకాలి చెప్పు? ఒక్కో-

సారి ఈ జీవితంమీదే విరక్తి పుడుతుంది నాకు. పరిగెడుతున్న రైల్లోంచి దూకి చచ్చిపోవాలనిపిస్తుంది." అన్నాడు.

ప్రమీల హడలిపోయి అతని చేతులు రెండూ గట్టిగా పట్టుకుంది. ఉద్వేగంతో గుండెలు ఎగిరెగిరి పడుతూండగా "వద్దు ....వద్దు, ఇలాంటి మాటలు మాత్రం ఇంకెప్పుడూ అనకండి." అంటూ ఒక సారి బయటికి చూసింది. అప్పటికే బాగా చీకటిపడడంతో రైలు కిటికీల్లోంచి పడే లైట్లవెలుగు చెట్లమీదుగా, పుట్టలమీదుగా పరిగెడుతోంది, మరోవైపు లోతయిన లోయ ప్రాంతాలు కనిపిస్తున్నాయి. ఆమెకు భయంతో ఒళ్ళు ఝల్లుమంది. అతని దుఃఖాన్నీ, బాధనీ నివారించగానికి తను ఏమైనా చేయగలదా?

"మీ రింత నిరాశపడిపోవడం ఏమీ బాగా లేదండీ.... మీకోసం నేనేం చేయ గలనో చెప్పండి. మీ బాధను పోగొట్ట టానికి నా వల్ల సాధ్యమైతే అంతకన్నా మరో భాగ్యం అక్కర్లేదు నాకు" అతనికి దగ్గరగా జరుగుతూ అంది ప్రమీల.

"పిచ్చిపిల్లా....నీవల్ల ఏమవుతుంది? ఇప్పుడిప్పుడే జీవిత ప్రాంగణంలోకి అడుగు పెడుతున్న ముగ్ధ యువతి వి నువ్వు." అన్నాడు అతను.

ప్రమీలకు ఉక్రోషం పుట్టుకొచ్చింది. తననింకా చిన్నపిల్లగా భావించుకున్నం దుకు అతనిమీద కోపంకూడా వచ్చింది "ఏం .... నావల్ల ఏమీ కాదనుకుంటు న్నారా? మీరు ఒప్పుకుంటే మీరు పోగొట్టు కున్న మనశ్శాంతిని తిరిగి పొందేలా చేయగలను. మీ కష్టసుఖాల్లో పాలుపంచు కుని మీ రచనలకు స్ఫూర్తి నివ్వగలను.. మీ అబ్బాయిని తల్లిలా చేరదీయగలను."

ఆవేశంతో చెప్పుకుపోతున్న ప్రమీల వైపు నోరు తెరచుకుని చూస్తుం డి పోయాడు అతను.

ఆమె మాటలను నమ్మలేనివాడిలా మళ్ళీ మళ్ళీ అడిగాడు. "నిజంగానా? నిజంగానా ప్రమీలా? బాధతో రగులు తున్న నా హృదయానికి ఊరట కలిగించ గలవా?"

ప్రమీల అతని గుండెలమీద తలవాల్చి గుసగుసలాడుతున్నట్టుగా "నిజమే చెబు తున్నానండీ....మా యింట్లో ఎవరేమన్నా సరే. అందర్నీ ఎదిరించైనా, కాలేజీ చదువు మానేసైనా మీ జీవితంలోకి ప్రవే శిస్తాను" అంది. ఇంకా ఏమేమో చెప్పా లనుకుంది కానీ మాటలు దొరక్క మౌనం వహించింది.

అతను అంతకంతకూ కౌగిలి బిగిస్తు న్నాడు. ఆమె తలమీద, బుగ్గలమీదా, మెడమీద పెదవులతో సున్నితంగా ముద్దు పెట్టుకుంటున్నాడు.

ఆ మధురానుభూతిలో మైమరిచి

పోయింది ప్రమీల. తను అమితంగా ఆరాధించే వ్యక్తి జీవితంలో పాలుపంచుకోబోతున్నందుకు తన జన్మ తరించిపట్టనిపించింది.

ఇద్దరూ ఎంతోసేపు అలా మైమరచి కూర్చుండిపోయారు. తమ చుట్టూ మనుషులున్నారనీ, వారు తమవైపే కుతూహలంతో, ఆశ్చర్యంతో చూస్తున్నారనీ వారి కాక్షణంలో తలపుకే రాలేదు వారిద్దరి మనసులనూ మౌనమే ఏకంచేసింది.

* * *

తెల్లవారింది రైలు హైదరాబాదు చేరుకుంది. క్రాంతికుమార్‌ని వదలి రైలు దిగుతున్నప్పుడు దుఃఖం పెల్లుబికి వచ్చింది ప్రమీలకు.

అతను ఆమెకేసి జాలిగా చూస్తూ— "పిచ్చిదానా.... ఎందుకు ఏడుపు? మనం మళ్ళి కలుసుకోమా ఏమిటి?" అని ఓదార్చాడు.

"అది కాదండీ.... ఎంత బాధలో మళ్ళీ మీరు ఒంటరివారై పోతున్నారు కదా అని...."

ఆమె మాట ఇంకా పూర్తికాకముందే అతను పకపకా నవ్వేశాడు. మళ్ళీ మళ్ళీ నవ్వుతూ— "అయ్యోరామ అదంతా నిజమనుకుంటున్నావా ఏమిటి కొంపదీసి? పిచ్చిపిల్లః ఊరికే కాలక్షేపానికి ఓ కథ కల్పించి చెప్పానంతే. నిన్ను ఓ ఆట పట్టిద్దామని. ఎలా వుందంటావు? నవల రాస్తే బాగుంటుందా?" అన్నాడు

అతని మాటలు వినగానే ఆమె మొహం విప్పారి ఆనందం వెల్లివిరిసింది. అంతలోనే మొహం చిట్లించి, "ఆట పట్టించడానికి నేనే దొరికానా మీకు? ఎంతగా నమ్మేశాను మీ మాటలు? మీ రచయితలంతా ఇంతేనా?" అని చిన్న బుచ్చుకుంది.

"కోపం తెచ్చుకోకు పమ్మీ.... నిన్ను తొలిసారి చూడగానే ఎందుకో నాలో ఓ విధమైన ఆత్మీయభావం చోటుచేసుకుంది చేసుకుంటే నీలాంటి అమ్మాయినే పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకున్న మాట వాస్తవం. నువ్వు నా అభిమానివి అని తెలుసుకున్న తరువాత ఇక నువ్వు నా దానివి అవుతావని నిర్ధారణ చేసుకున్నాను. నిన్ను వలిపించుకోడంలో భాగంగా ఓ చిన్న నాటకం ఆడాను. నాటకం అనడం కన్నా నీకో పరీక్ష పెట్టాను అంటే సరిపోతుంది ఆ పరీక్షలో నువ్వు నెగ్గావు. నీ మనసులో ఉన్న విషయాన్ని నీ నోటినుంచే చెప్పించాను. ఇదంతా నిన్ను నాదాన్ని చేసుకోడానికి ఆడిన చిన్న నాటకం, అంతే. నాకు పెళ్ళి కాలేదు ప్రమీలా! నన్ను క్షమించు. నువ్వే నా కాబోయే అర్ధాంగివి" అన్నాడు.

ప్రమీల కళ్ళు విప్పారాయి. తన అభిమాన రచయితకి ఇంకా పెళ్ళే కాలేదన్న విషయం ఆమెను ఉక్కిరి బిక్కిరి చేసేసింది. ఏదో పెద్ద నిధి దొరికినంత సంబరపడిపోయి ఒక్క ఉదుటున పరుగెత్తుకొచ్చి అతన్ని కావలించుకుంది రైలు దిగుతున్న ప్రయాణీకులంతా గబుక్కున ఆగిపోయి వారివైపే చోద్యంగా చూస్తూ నిలబడి పోయారు.

# నాకు నచ్చిన నా కథ



ఈ కథ ఆంధ్రపత్రికలో ప్రచురించబడింది.

మనిషన్న ప్రతివాడికీ ఏదో ఒక బలహీనత వుంటుంది. కొంతమందికి చాలా బలహీనతలుంటాయనుకోండి, అది వేరే విషయం!

ఆ బలహీనతలవల్ల తమకే గాక ఎదుటివారికి కూడా కొన్నిసార్లు అపకారం జరుగుతుంటుంది. ఆ విషయం వాళ్ళుమాత్రం గ్రహించరు. గ్రహించినాకూడా గ్రహించనట్లుండడమేనేమో బలహీనత అంటే!

అట్లాంటి బలహీనతల్లో 'మొహమాటం' ఒకటి. అసలు మొహమాటమనేది లేకపోవడం వల్ల కలిగే నష్టాలకన్నా అతి మొహమాటం వల్ల కలిగే నష్టాలు ఎక్కువ! అతి మొహమాటస్థుడి మనస్తత్వాన్ని ఆధారంగా చేసుకుని రాసిని ఈ 'దూరం' కథ అంటే నా కెంతో ఇష్టం.

పెమ్మరాజు సంధ్యారాణి

## దూరం

ఇంట్లోకి అడుగుపెట్టిన కొడుకుని చూడగానే 'ఇంటర్వ్యూ ఎలా చేశావురా?' అని అడగాలనుకున్నాడు నిరంజనం.

కానీ అడగలేకపోయాడు నోట్లోంచి మాటలు బయటికి రాలేదు. అడగడం

కష్టమైన పనేమీ కాదు, అడిగిం తర్వాత అతని దగ్గర్నుంచి ఎటువంటి సమాధానం వస్తుందోనని ఆ పని చెయ్యలేకపోయాడు.

ఈ ఉద్యోగమైనా వీడికొస్తే బావుండు. తను వూపిరి పీల్చుకోవచ్చు....

"నాన్నా! నీకు వనజగారు తెల్సా?" హఠాత్తుగా శేఖర్ అడిగిన ప్రశ్నకు వులిక్కిపడ్డాడు నిరంజనం.

వనజ!

ఎన్నాళ్ళయింది ఆ పేరు విని....

ఏం చేస్తోందో ఇప్పుడు? బహుశా తనూ ఇలానే సంసార బాధ్యతల్తో కొట్టుకొంటూ వుండి వుంటుంది! అయినా వనజ వీడి కెలా తెల్సు?

"ఏ వనజ?" ఆత్రుతని అణచుకుంటూ అడిగాడు నిరంజనం.

"ఆవిడే నాన్నా.... చిన్నప్పుడు నువ్వు కొన్నాళ్ళు వాళ్ళింట్లో వుండి చదువుకున్నావట. వాళ్ళ నాన్నగారు మాస్టారు.... ఇవాళ నన్ను ఇంటర్వ్యూ చేసింది ఆమె" ఎంతో ఆనందంగా చెప్పుకుపోతున్నాడు శేఖర్.

"నువ్వు ఫలాన అని ఆవిడకెలా తెల్సు?" ఇన్నాళ్ళ తర్వాత వనజ ఇలా హఠాత్తుగా దర్శనమివ్వడమే కాక ఇంకా తనని గుర్తుపెట్టుకోవడం ఆశ్చర్యంగానూ, ఆనందంగానూ అనిపించింది నిరంజనకి. ఒకవేళ గుర్తున్నా తన కొడుకు నెలా గుర్తించగల్గింది. అతనికి అంతా అయోమయంగా వుంది.

"ఏముంది నాన్నా వెరీ సింపుల్! అప్లికేషన్ మీద తండ్రి పేరుంటుంది కదా. నేను లోపలికి వెళ్ళగానే ఆమె అడిగిన మొదటి ప్రశ్న 'నువ్వు నిరంజనం గారి అబ్బాయివా?' అని...."

"నువ్వేం జవాబు చెప్పావ్?"

'ఏ నిరంజనంగారి అబ్బాయి ననుకుంటున్నారు?' అని అడిగాను. మనింటిపేరు చెప్పడమే కాకుండా వూరుపేరు కూడా చెప్పి, మీరు కొన్నాళ్ళు వాళ్ళ యింట్లోవుండి చదువుకున్నట్లు కూడా చెప్పారు. ఆ తర్వాత ఆవిడ 'మీరేం చేస్తున్నారు? ఎక్కడ వున్నారు? ఎలా వున్నారు? మొదలైన ప్రశ్న లడిగిందే కాని ఇంటర్వ్యూ చేయలేదు. బయటికి వచ్చేసేటప్పుడు 'మా యింటికి వస్తావా?' అని అడిగాను. 'వస్తానంటే సాయంత్రం వచ్చి తీసుకు వెళ్తాను' అని కూడా చెప్పాను.

"అక్కడకు వచ్చి నువ్వు నన్ను తీసుకువెళ్ళడం బావుండదు. అదీకాకుండా అర్జెంట్‌గా ఇవాళ సాయంత్రం ట్రెయిన్‌లోనే నేను హెడ్ ఆఫీసుకి వెళ్ళిపోవాలి. టికెట్టుకూడా రిజర్వ్ చేసుకున్నాను. ఏమాత్రం వీలున్నా మీ నాన్నగార్ని ట్రెయిన్ దగ్గరకు రమ్మని చెప్పు" అంది....

వనజకి తనమీదవున్న అభిమానం ఇంకా అలానే వుందన్నమాట! ఆనందంతో వుక్కిరిబిక్కిరైపోయాడు నిరంజనం.

"నాన్నా! సాయంత్రం నువ్వు ట్రెయిన్ దగ్గరకి వెళ్ళినప్పుడు ఒక్క మాటన్నావంటే చాలు, నాకు వుద్యోగం గ్యారంటీ. నువ్వంటే ఆమెకి అంత అభిమానం!"

కొడుకు మాటలు నవ్వు తెప్పించాయ్ నిరంజనంకి. తన జీవితంలో అతి ముఖ్యమైన విషయాన్నే ఆమె నడగలేకపోయాడు. మరి ఈ విషయాన్ని అడగ్గలడా?

"నా విషయం చెప్తావ్ కదూ!" మళ్ళీ అడిగాడు శేఖర్.

"చూస్తాలే..." ఏం జవాబు చెప్పాలో అర్థంకాక అనేసాడు నిరంజనం.

పొంగుతున్న పాలమీద నీళ్ళు చల్లినట్లయింది శేఖర్ పరిస్థితి. తండ్రి ఆమెకు తన గురించి చెప్తాడు. తనకి వుద్యోగం తప్పకుండా వస్తుంది అని ఎంతో ఆనందపడిపోయాడు .. ప్చ్....

నిరుత్సాహంగా లోపలికి వెళ్ళిపోయాడు శేఖర్.

కొడుకునలా చూసేసరికి జాలేసింది నిరంజనంకి. తనమీద తనకే కోపం వచ్చింది.

తను వట్టి అసమర్థుడు. తనకోసమే కాదు, తనవాళ్ళకోసం కూడా ఎటువంటి పరిస్థితుల్లోనూ, ఎవరిదగ్గరా బయటపడి అడగలేడు. చిన్నప్పుడే పాతుకుపోయిన దురలవాటది! అమ్మని అన్నం పెట్టమని అడిగేవాడు కాదు. పెడితేనే తినేవాడు, లేకపోతే అలానే వుండేవాడు.

తండ్రిని పుస్తకాలు కొనిపెట్టమని కూడా అడిగేవాడు కాదు. ఒకసారి సైన్స్ రికార్డ్ కొనలేదని మాష్టారు క్లాసులోంచి బయటికి పంపిచేశారు. అయినా పుస్తకం కోసం తండ్రి నడగలేకపోయాడు. ఆ విషయం పక్కింటి జయ ద్వారా తెలుసుకొని చితకొట్టాడు తండ్రి. అన్ని దెబ్బలయినా తను భరించ




గలిగాడు కాని, కావాలని అడగలేకపోయాడు. వయసుతోపాటే ఆ మొహమాటమూ పెరుక్కుంటూ వచ్చింది. ఎవరినీ ఏమీ అడగలేకపోయేవాడు. ఆ కారణంతో జీవితంలో ఎంతో పోగొట్టుకున్నాడు.

పడక్కుర్చీలో వెనక్కివాలి కళ్ళు మూసుకున్నాడు నిరంజనం. గతమంతా కళ్ళముందు మెదలసాగింది.

తను ఏడవ తరగతి చదువుతున్నప్పుడు హఠాత్తుగా సంవత్సరం మధ్యలో తండ్రికి ఆ వూరునించీ ట్రాన్స్ఫరైంది. తనని వెంట తీసుకెళ్ళాలంటే కష్టం అక్కడికి ఇక్కడికి పుస్తకాల మార్పు.... ఏంచేయాలో ఎవ్వరికీ అర్థంకాలేదు.

అటువంటి సమయంలో ఆపద్బాంధవుడిలా ఆదుకున్నారు రామారావు మాష్టారు. ఆ సంవత్సరం పూర్తయేవరకూ తమింట్లోనే వుంచుకొని చదివిస్తానని పట్టుబట్టారు. ఫలితంగా తల్లిదండ్రులు వెళ్ళిపోయినా తనా వూళ్ళోనే మిగిలిపోయాడు.

అప్పుడు తన వయసు పది సంవత్సరా లుంటాయేమో। మాష్టారు వాళ్ళింట్లో ఎంత ఆప్యాయంగా చూపినా దిగులు దిగులుగానే వుండేది.

వారంరోజులు ఎలాగో భరించగలిగాడు. ఆ తర్వాత తనవల్ల కాలేదు.

వెంటనే వెళ్ళి అమ్మని చూడాలని మరీ మరీ అనిపించసాగింది. కానీ ఆ విషయం మేష్టారికి చెప్పలేదు.

పెరట్లోవున్న జామిచెట్టుకింద కూర్చున్నాడు గుడ్లనీరు కుక్కుకుంటూ. వనజ అక్కడికి ఎప్పుడు వచ్చిందో కూడా తను గమనించలేదు.

"ఎందుకూ ఏడుస్తున్నావ్!" ఆమె ఆశ్చర్యంగా అడిగేసరికి ఉలిక్కిపడ్డాడు తను.

"అబ్బెబ్బే.... ఏంలేదు...." గబగబా చొక్కాతో కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు.

"నాకు తెల్సులే.... మీ అమ్మ గుర్తుకొచ్చింది కదూ!"

ఆమె అంత అప్యాయంగా అడిగేసరికి భోరున ఏడ్చేశాడు. తనకన్నా ఆమె దాదాపు సంవత్సరం చిన్నది అయినా రెండుమూడేళ్ళ పెద్దదాన్లా ఓదార్చింది. ఆమె ఓదార్పులో స్వాంతన దొరికింది తనకి. అక్కడ్నుంచీ బలవంతాన తనని ఆడుకోవడానికి లాక్కెళ్ళింది.

ఆ రోజునించీ ఆమె దాదాపు ఎప్పుడూ తనని వెన్నంటే వుండేది. కలిసే స్కూల్‌కి వెళ్ళేవాళ్ళు కలిసే వచ్చేవాళ్ళు, కలిసే ఆడుకునేవాళ్ళు, కలిసే భోంచేసేవాళ్ళు, కలిసే చదువుకునేవాళ్ళు....

రెండు మూడ్రోజులలా గడిచేసరికి తనూ ఆమెను విడిచి ఒక్క క్షణం కూడా వుండలేని స్థితికొచ్చాడు!

వనజ సావాసంతో ఆరు నెలలూ ఆరు రోజుల్లా గడిచిపోయాయి. మర్నాడే తనా వూరు వదిలేస్తున్నాడు. వనజను వదిలి వెళ్ళాలంటే ఎంతో బాధగా వుంది. ఆమె అదే పరిస్థితిలో వున్నట్లుంది. తను చివర పరీక్ష రాసి వచ్చేసరికి ఇంట్లో ఎక్కడా కనిపించలేదు.

సరాసరి జామచెట్టు దగ్గరకి పరుగెత్తుకుంటూ వెళ్ళాడు. అక్కడ దిగులుగా కూర్చొనుంది వనజ.

ఆమెనలా చూసేసరికి తనకి మరింత దిగులేసింది. తనకి దిగులు వచ్చినప్పుడల్లా ఆ చెట్టు దగ్గరికి వెళ్ళికూర్చుంటే, ఆమె వచ్చి ఓదార్చేది. ఇప్పుడామె అక్కడ దిగులుగా కూర్చుంటే, తనకి మరింత గుబులుగా వుంది. ఆమె నెలా ఓదార్చాలో అర్థం కావడంలేదు.

"ఏంటి వనజా అలా వున్నావ్...." బొంగురు గొంతుతో ఆమె గడ్డాన్ని పైకెత్తుతూ అడిగాడు.

తను పలకరించగానే ఒక్కసారిగా బావురుమంది. తనకీ ఏడుపొచ్చేసింది.

"నువ్వేడవకు వనజా.... నాకూ ఏడుపొచ్చేస్తోంది" వెక్కిళ్ళమధ్య అన్నాడు తను.

"నువ్వు నన్ను విడిచి వెళ్ళిపోతూంటే ఏడుపు రాదేంటి?" అమాయకంగా అడిగింది అప్పటి ఆమె కళ్ళని ఇప్పటికేకాదు, ఎప్పటికీ మరచిపోలేదు తను.

"ఇప్పుడు వెళ్ళిపోతే మాత్రమేం? మళ్ళీరానా ఏంటి? ప్రతి శెలవుల్లోనూ ఇక్కడికొస్తాను. ఇంచక్కా మనం తొక్కుడుబిళ్ళ, రింగాటలు ఆడుకోవచ్చు."

"నువ్వు తప్పకుండా ప్రతి శెలవుల్లోనూ ఇక్కడికి వస్తావా?" కళ్ళు తుడుచుకుంటూ ఆశగా అడిగింది.

"తప్పకుండా వస్తాను" ఆ చేతిని చిన్నగా గిల్లుతూ నవ్వాడతను.

ఆమే నవ్వింది.

ఇద్దరూ ఒకళ్ళ చెయ్యి మరొకళ్ళు పుచ్చుకుని ఆనందంగా లోపలికి పరుగెట్టుకొచ్చేసారు.

తను ఆ వూరు వదిలి వచ్చేసేటప్పుడుకూడా ఆమె బస్సుదాకా కన్నీళ్ళతో సాగనంపింది.

మరో మూడు సంవత్సరాలదాకా తిరిగి ఆ వూరు వెళ్ళడానికి పడలేదు. వనజను చూడకుండా నాళ్ళు గడపడం బాధే అయినా తప్పలేదు

తనెన్నిసార్లు అడిగినా 'అప్పుడంత దూరం ఎందుకు?' అంటూ కొట్టి పారేసారు నాన్న మాటలు. అమ్మ, నాన్న అతనికి పంపిస్తేనేకాని అన్నం తిననని మారాం చేస్తే, యిక తప్పక పంపించారు. ఆనందంగా బయల్దేరాడు తను.

బస్సు దిగగానే కాళ్ళు చకచకా మేష్టారింటికేసి పడసాగాయి.

వనజ మనసులో ఇంకా తన స్థానం అలానే వుందా? అప్పటిలా అప్యాయంగా తనతో మాట్లాడుతుందా?— మేష్టారింటికి చేరుకునే వరకు రకరకాల ఆలోచనలు తన మనసుని వుక్కిరిబిక్కిరి చేయసాగాయి.

"ఎవరేవ్? నిరంజనం వచ్చాడు..." తనని చూస్తూనే గట్టిగా కేకేసారు మాష్టారు.

అందరూ ఒక్కసారిగా బయటికొచ్చారు.

వనజ కూడా!

ఆమెను చూడగానే తన కళ్ళు తళుక్కున మెరిసాయ్.

"ఇప్పుడేనా బాబూ రావడం. అంతా కులాసాయేనా?" పలకరించారు మేస్త్రారి భార్య.

"కులాసాయేనండీ. మావయ్యా వాళ్ళింటికి బయల్దేరాను. చాలా కాలమైంది కదా అని దార్లో ఇక్కడ దిగాను...." తనకి తెలియకుండానే అబద్ధం ఆడేసాడు. అక్కడికే వచ్చానని చెప్పడం తనవల్ల కావిపని!

"అంతేగాని మా ఇంటికి రావాలని రాలేదన్నమాట!" విస్ఫూరంగా అంది వనజ. అప్పుడుగాని అర్థంకాలేదు తను మొహమాటంలో ఏమేమో మాట్లాడి వాళ్ళని నొప్పించాడని!

"అబ్బే ... అదా కాదు...." నసిగాడు తను

"అతను వచ్చీరాకముందే ఏమిటా దండయాత్ర వనజా? ముందతన్ని లోపలికి రానివ్వు" మేస్త్రారి మందలింపుతో వాకిటికి అడ్డం తప్పుకుని దారిచ్చింది. అంతా లోపలికి వెళ్ళి హాల్లో కూర్చున్నారు.

మూడు సంవత్సరాల తర్వాత వాళ్ళందర్నీ, అప్పుడు తను తిరిగిన ప్రదేశాల్ని చూస్తుంటే మనసు తియ్యటి బాధలో నిండిపోసాగింది. భోంచేసిం తర్వాత ఆ రాత్రి బాగా పొద్దుపోయేవరకు తను, వనజ, ఆమె చెల్లెల్లు కుసుమ, రజని కబుర్లు చెప్పుకుంటూ గడిపారు

మర్నాడు పొద్దున్నే తను బయల్దేరాడు.

"మరో రెండు రోజులుండకూడదు?" ఎవ్వరూ లేని సమయంచూసి దగ్గరికొచ్చి, నెమ్మదిగా అడిగింది వనజ.

అంత దగ్గరగా ఆమెను చూస్తుంటేగాని తను గుర్తించలేకపోయాడు— ఆమెలో వయసు తెస్తున్న మార్పుల్ని! ఆమె దగ్గరగా నిలబడితే ఇదివరకెన్నడూ కలగని వింత అనుభూతి కలగసాగింది!

"నాకూ వుందామనే వుంది. కానీ ఇవాళ అర్జంటుగా ఇంటికి వెళ్ళిపోవాలి. వస్తానని చెప్పాను అమ్మతో...."

"తప్పదంటావా?"

ఇంతలో మాష్టారటుగా రావడంతో వులిక్కిపడి ఇద్దరూ దూరంగా జరిగారు. ఆ తర్వాత మళ్ళీ ఆ వూరు వెళ్ళడం పడలేదు.

ఏడెనిమిది సంవత్సరాల తర్వాత అనుకోకుండా విజయవాడ బస్టాప్‌లో కనిపించింది-

అక్కడే ఏదో కాలేజీలో చదువుకుంటోందిట. శలవులకు ఇంటికి బయల్దేరింది. తనతోపాటే ఇంటికి రమ్మని బలవంతం చేసింది. కాపీ వుద్యోగంలో చేరిన కొత్తలు కావడంతో ఆమెవెంట వెళ్ళలేకపోయాడు. ఆఫీస్ పనిమీద విజయవాడ వెళ్ళిన తను మర్నాడు ఎటువంటి పరిస్థితుల్లోనూ ఆఫీస్‌కి ఎటెం డవ్వాలి. ఇద్దరూ అరగంట లోపలే విడిపోయారు.

అప్పటి ఆమె రూపం మాత్రం మనసులో అలానే ముద్రించుకుపోయింది. పెళ్ళనేది చేసుకుంటే ఆమెనే చేసుకోవాలనికూడా నిశ్చయించుకున్నాడు తను.

కానీ ఎలా? ఈ విషయాన్ని ఆమెకి తెలియజేసేదెలా?

ఉత్తరం రాస్తేనో....?

అమ్మో! ఇంకేమైనా వుందా? ఈ విషయం ఇంట్లోవాళ్ళందరికీ తెలిసి పోదూ.... ఇంతవరకూ తననెంతో మంచివాడుగా గౌరవించినందుకు బాధ పడతారు తనని ఛీదరించుకుంటారు. నో.... అలా జరగడానికి వీల్లేదు. వాళ్ళందరి సంగతెలా వున్నా వనజకి తనంటే ఎలాంటి అభిప్రాయముందో? ఆ విషయం తెలీకుండా తనెలా బయటపడతాడు? ఒకవేళ ఆమెకు తనంటే ప్రత్యేక అభిప్రాయం లేకపోతే ఆమెను బాధించినవాడు కాడూ? తానామెను బాధించలేడు!

బలవంతాన ఆ కోరికను మనసులోనే తొక్కేసాడు.

ఏ మొహమాటమైతే వనజని తననించీ దూరంచేసిందో అదే మొహ మాటం రాధని తన భార్యగా చేసింది.

తన కూతుర్ని చేసుకొమ్మని వచ్చిన మావయ్యని, ఆయన మాటని బలపరిచే అమ్మానాన్నలని తను కాదనలేకపోయాడు. ఫలితంగా రాధ తన జీవిత భాగస్వామి అయిపోయింది.

గడచిన ఈ ఇరవై సంవత్సరాల్లోనూ వనజ తనకెన్నోసార్లు గుర్తు కొచ్చింది. ఆమెను చూడాలనే కోరిక కూడా ఎన్నోసార్లు కలిగింది. కాపీ వనజ తనకు పరాయి స్త్రీ. అందుకే ఆ ఆలోచనల నన్నిటినీ మనసులోనే సమాధి చేసేసాడు.

"మీరు బండి దగ్గరకు వెళ్తున్నారా! లేదా!" రాధ పలకరింపుతో ఈ లోకంలోకి వచ్చాడు నిరంజనం.

"ఎందుకూ!"

"ఎందుకేమిటండీ నా మొహం. వెనకటికి మీలాంటివాడే రామాయణ మంతా విని రాముడికి సీత ఏమవుతుందీ అని అడిగాట్ట! సాయంత్రం రైల్లోనే వెళ్ళిపోతున్నానని చెప్పిందట కదా...."

"బావుంది. ఆవిడ వెళ్ళిపోతుంటే నే నెందుకు వెళ్ళాలి స్టేషన్‌కి!" వనజని చూడాలనే వున్నా ఆ భావాన్ని మనసులోంచి తోసివేయాలని ప్రయత్నిస్తూ అన్నాడు నిరంజనం.

"ఆవిడ్ని చూట్టానికి కాదండీ మిమ్మల్ని స్టేషన్‌కి వెళ్ళమంటూంది— మనవాడి వుద్యోగ విషయం హెచ్చరించడానికి!"

"బావుంది. ఇంతకాలంతర్వాత ఆవిడ కనిపించి మర్యాదగా పలకరించేవరకి రికమండేషన్లకి బయల్దేరనా! నావల్ల కాదు!" అంతవరకూ మనసులో వున్న మాటనే బయటికి వెళ్ళగక్కేసాడు నిరంజనం.

ఆ మాటలు రాధని రెచ్చగొట్టాయి.

"పెళ్ళయినప్పట్నించీ చూస్తూనేవున్నాను. అయినదానికి, కానిదానికీ ప్రతిదానికి మొహమాటం! మీ మొహమాటంతో మేమెన్ని బాధలుపడ్డా ఫర్వాలేదు. మీరు మాత్రం మీ పద్ధతి మార్చుకోరు....! మీకు నమస్కారం పెడతాను. ఈ ఒక్కసారికి మీ మొహమాటాన్ని విడిచిపెట్టి ఆవిడికి చెప్పండి చాలు.... ఇకముందు మా అందరి సంగతి వాడే చూసుకుంటాడు...." కళ్ళనీళ్ళ పర్యంత మైంది రాధ.

"నాన్నా.... ఆవిడతో మవ్వొక్కమాట చెప్తే చాలు...." జాలిగా దగ్గర కొచ్చాడు శేఖర్.

తన జీవిత సమస్య విషయంలోనె ఆమెముందు బయటపడలేకపోయాడు. ఇప్పుడీ విషయంలో బయటపడగలడా?

తప్పదు! ఆమె కెలాగైనా చెప్పాలి. తన బలహీనతవల్ల తనవాళ్ళంతా బాధపట్టానికి వీల్లేదు. స్టేషన్‌కి వెళ్ళితీరాలి. వనజను కలవాలి. శేఖర్ విషయం ఆమెతో మాట్లాడాలి—




వెంటనే బయటికి బయల్దేరాడు నిరంజనం. ఆయన ఎక్కడికి వెళ్తోందీ అర్థంగాక అలానే చూస్తూ అక్కడే నిలబడిపోయారు తల్లీకొడుకులు.

* * *

వెళ్ళాలా? వద్దా? అనే సందిగ్ధంలో అటు ఇటు తిరిగి ఎప్పటికో స్టేషన్‌కి చేరుకున్నాడు నిరంజనం.

బండి బయల్దేరడానికి సిద్ధంగా వుంది.

గేటు దగ్గర నిలబడి ఆత్రంగా ఎదురుచూస్తున్న వనజ అతన్ని చూడగానే "నిరంజనంగారూ...." అంటూ ఆనందంగా కేకేసింది.

"అరె! మీరా!" ఆమెకోసం వచ్చినట్లు చెప్పలేక ఆశ్చర్యాన్ని నటిస్తూ అన్నాడు నిరంజనం.

ఆమెనక్కడ చూడడం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించకపోయినా, వయసు తెచ్చిన హుందాతనంతో నిండుగా వున్న ఆమె రూపం అతనికి ఆశ్చర్యం కలిగించింది.

అవన్నీ వయసుతో వచ్చే మార్పులైనా అతని దృష్టిని ప్రత్యేకంగా ఆకర్షిస్తున్నాయి!

ఎంత మారిపోయింది! అప్పటి చిలిపి వనజకు, ఈ వనజకూ ఎక్కడా పోలికలేదు! విస్తుపోయి ఆమెను చూస్తూ నిలబడిపోయాడు నిరంజనం.

"అదేంటి! మీరు నాకోసం కాదా వచ్చింది!" ఆశ్చర్యంతోను, బాధతోను ఆమె మాటలు పీలగా వచ్చాయి.

నిరంజనం మనసు కలతపడింది.

తను వచ్చింది ఆమె కోసమే! అయినా ఆ విషయాన్ని ఆమెముందు చెప్పలేకపోయాడు. ఈ బలహీనత తనని వదల్దు....!

"మీవాడు చెప్పలేదా!" మళ్ళీ ఆమే ప్రశ్నించింది.

"చెప్పలేదు...." మొదటి అబద్ధాన్ని కప్పిపుచ్చుకోడానికి మరో అబద్ధం ఆడేడు.

రైలు గట్టిగా కూత వేసింది.

"ఇక్కడ కొన్ని ఇంటర్వ్యూలు కండక్ట్ చేయడానికి నిన్న వచ్చాము. నాకు మీరిక్కడ వుంటున్నట్లు ముందే తెలిసుంటే అచ్చితంగా మీ ఇంటికే వచ్చుండేదాన్ని...." చిన్నగా నవ్విందామె.

కంగారుపడ్డాడు నిరంజనం.

"నువ్వీ వూరు వచ్చావని తెలిస్తే నేను మాత్రం వూరుకునేవాణ్ణా ఏంటి! ఇంతకీ ఇప్పుడేవూళ్లో వుంటున్నారు!" అడిగాడు.

జవాబు చెప్పిందామె.

మరోసారి కూతవేసి నెమ్మదిగా బయల్దేరింది రైలు.

"మీ ఆయనకూడా అక్కడే పనిచేస్తున్నారా! ఏం చేస్తున్నారు!" అతనడిగిన ప్రశ్నలకు ఆమె చెప్పిన జవాబు రైలు శబ్దంలో కలిసిపోయింది.

దూరమైపోతున్న ఇద్దరూ ఒకళ్లనొకళ్లు కన్నీళ్లు పొరలగుండా చూసుకో సాగారు.

అతని మొహమాటమే ఆమెను కన్యగా మిగిల్చిందని అతనికి తెలీదు. అంతే కాదు-తనలాగే మరికొన్ని జీవితాలు కూడా అతని మొహమాటానికి బలైపోగూడదని ఆమె శేఖర్‌కి ఆ వుద్యోగం వచ్చేటట్లు చేసినవిషయం కూడా అతనికి తెలీదు! అతని కొడుకే తన కొడుకనుకొంటున్న ఆమెకు ఆ విషయం అతనికి తెలీడం కూడా ఇష్టంలేదు. ఎప్పుడూ ఒకళ్ళ మనసులో మరొకళ్ళు నిండుకొని వున్నా ఆ విషయాన్ని ఇద్దరూ బయటపెట్టలేదు. వాళ్ళమధ్య దూరం ఎప్పటికీ తరగనిది!

—o—




# సంస్కరణ సరజోడు

శోభాపేరిందేవి

బస్‌స్టాప్‌లో నిలబడింది మిత.

ఆమెతోబాటే అలా ఎందరో నిలబడి ఉన్నారు.

వాళ్ళందరికీ బస్సు ఇంకా రాలేదే అని విసుగ్గా ఉంది. ఇంటికెళ్ళాలన్న తొందరా ఉంది.

కాని మితకి ఆ రకమైన తొందర లేదు.

తను త్వరగా ఇంటికి వెళ్తే తనకి లభించేదేమిటి? తనకోసం ఎవరు ఎదురు చూస్తారు?? రాలేదని ఎవరు బాధపడతారు???

సరిగ్గా రెండేళ్ళ క్రితం ఇదే బస్‌స్టాప్‌లో నిలబడేది తను. అప్పుడన్నీ తొందరే. త్వరగా తయారై కాలేజీకి వెళ్ళాలని, కాలేజీ అవుతూనే ఇల్లు చేరాలని.

అప్పుడు జీవితం పూలనావలో ప్రయాణిస్తున్నట్టుండేది. కాని ఇప్పుడు చీకట్లో తడుముకుంటూ నడుస్తున్న భావన.

ఏడాది క్రితం తను వధువు.

ఏడాది పూర్తవగానే విధవ.

చుట్టూ ఉన్న మనుష్యుల్ని, అక్కరకు రాని చుట్టాల్లాగ వచ్చిపోతున్న బస్సుల్నీ స్పష్టంగా కనపడనివ్వక మసకగా చేసింది కంటికి నిండుగా చేరిన కన్నీటి పొర.

అసలు తన పెళ్ళిఫోటోలే కొన్ని

రాలేదు. పెళ్ళినాటి పట్టుచీర మరోసారి కట్టనేలేదు. పెళ్ళినాడు తొడుక్కున్న ఆ ఎర్రటి మట్టిగాజులు మక్కువగా తొడగనైనా తొడగలేదు. కాసులు, పగడాలు కలిపిన నల్లపూసల గొలుసు ఫ్యాషన్ అని అర్డర్ చేసింది తను. అదింకా తన అరచేతికి అందనేలేదు. అయినా తన జీవితం అంతమైపోయింది.

విరక్తిగా నవ్వుకుంది మిత.

భర్త చనిపోతే భార్యకి భవిష్యత్తు చచ్చిపోతుంది. వర్తమానం చచ్చిపోతుంది. ఆమెకి మిగిలి ఉండేది ఉండవలసినది గతకాలపు తలపులే!

మనువు మాటల్నే వేదంలా భావించే ఈ సమాజంలో ఇంకెన్ని అంశాలో! అదే మగవాడి విషయంలో వేరు.

భార్యపోతే అతని గతం చచ్చిపోయినట్టే లెఖ్ఖ. వర్తమానం ఉత్సాహంగా ఉంటుంది. అవును మరి భవిష్యత్తులో అతనో పెళ్ళికొడుకు! అతనికి ఎంత వయసొచ్చినా అదే పద్ధతి.

బస్సు బద్ధిగా వచ్చింది.

మిత బస్సెక్కింది.

విపరీతమైన రద్దీగా వచ్చి ఆగిన బస్సులోంచి దిగినవారికంటె ఎక్కినవారే ఎక్కువగా ఉండడంతో బస్సులో త్రొక్కిసలాటగా ఉంది.

బస్ దిగాక ఓ మైలు దూరం నడిచి ఇల్లు చేరింది.

ఆశ్చర్యం కలిగించేలాగ ఇంటి ల్లిపాదీ ఒకే గదిలో కూర్చుని ఉన్నారు.

దీర్ఘాలోచనల్లో ఉన్నట్లున్నాయి వాళ్ళ ముఖాలు.

'ఏమిటి విశేషం?' అని మిత అడగలేదు. అసలామెకి తనంత తానుగా ఏ విషయంలోనూ జోక్యం చేసుకునే ఆసక్తి పోయింది.

అదీకాక ఎంత వద్దనుకున్నా వాళ్ళ కళ్ళల్లో 'నీ కెందుకు?' అన్న ప్రశ్న! ఎంతలేదన్నా తనంటే వాళ్ళకి చిన్న చూపే!

తను సంపాదిస్తోంది. సంపాదించినదంతా వాళ్ళకోసం ఖర్చుపెడుతోంది. అయినా చిన్నచూపే!

తన భర్తపోయాడు కదూ అందుకే ఆ చిన్న చూపు!

భర్త చనిపోతే భార్యనికూడా చంపితీరాలన్న పద్ధతి మన సమాజంలో బాగా పాతుకుపోయి ఉంది. చట్టం ఒకటి అడ్డు రావడంతో ఆ పని మానేసారు.

కాని చంపాలన్న బుద్ధి ఎక్కడికి పోతుంది? కాని హత్య చేయ్యలేరు. అందుకే మనసుని ముక్కలు ముక్కలుగా నరికి పారేస్తున్నారు.

మిత తలవంచుకుని తన గదివైపుకు నడవసాగింది.

"మితా! ఇలారా!"

మిత తప్పనిసరిగా వాళ్ళ దగ్గరికి నడిచింది.

"కూర్చో!"

కూర్చుంది. ఈసారి ఆమె చూపు నేలనంటుకుపోలేదు.

అదర్శవాది అయిన అన్నవైపు, ఆంధ్రుల అభిమాన రచయిత్రి అయిన వదినవైపు అన్నకీ వదినకీ అన్ని విధాలా సహకరించే అమ్మానాన్నల వైపూ సాగింది.

"మీ మామగారు ఉత్తరం రాసారు" అన్నాడు తండ్రి.

మిత ముఖంలో ఏ భావమూ లేదు.

"నిన్నక్కడికి రమ్మన్నారు". అంది తల్లి.

"కాదు వచ్చి తీరాలని శాసించారు" అన్నాడు తండ్రి.

మిత కనురెప్పల్ని మౌనంగా కోరుకుంది 'దయచేసి నా కన్నీళ్ళను జారిపోనివ్వక అడ్డుకుని కాపాడండి. అందరిముందూ అనుక్షణం ఏడవలేను. ఆ కారణంవల్ల సానుభూతిని అందుకోలేను' అని!

కనురెప్పలకి జాలి లేదో ఏమో కన్నీటిబిందువు మెల్లి మెల్లిగా జారిపోయింది.

"ఆడపిల్ల ఉద్యోగం చేయడం తమ ఇంటా వంటా లేదుట. తమ కోడలు ఉద్యోగం పేరిట గడపదాటడం తమకి అమోదయోగ్యం కాదట," అంది కోపంగా వదిన.

"కన్నవారికంటె అత్తవారికే నీమీద హక్కుంది కనక నువ్వు వారిదగ్గర ఉండడమే సబబు" అంది తల్లి.

దీన్ని ఛాందసుల ఇంట్లో పడేయ వద్దని నెత్తినోరు మొత్తుకున్నా మీరు వినలేదు నిప్పుమ కడిగే వంశమని పేరొకటి. లెట్రిన్‌కి వెళ్తే చాలు కాళ్ళు కడుక్కోడం చాలక స్నానం చేసి తీరాలిట. ఎవరికైనా విరోచనాలు వచ్చినా అంతే! తడిబట్టతో చలికాలం సైతం వంటచేయడం, ఎవరైనా వస్తే చాలు తలుపుచాటుకు తప్పుకోడం, దేముడికి నైవేద్యం పెడితేకాని పిల్లలకైనా వచ్చి మంచినీళ్ళు సైతం పట్టకపోడం", అన్నాడు అన్న.

"ఒక్కడే కొడుకని చేసాం కదురా" అంది తల్లి.

"అందుకేగా అంత కట్నం పోసింది" అన్నాడు తండ్రి.

మిత వింటూ కూర్చుంది.

అసలు ఆడపిల్లకి చెప్పినట్టు చేయడమే పని!

"అందుకే నాకు ఎమ్మే చేయాలనుంది నాన్నా!" అంటున్నా "ఆవన్నీ

పెళ్ళయ్యాక నీ భర్త అనుమతితో చెయ్యి" అంటూ కొట్టిపారేసారు.

మితకి అన్నా వదినలంటే మాత్రం గౌరవం ఉంది

కానీ మాత్రం అయినా మిగిలి ఉంది అంటే దానికి వెనకనున్నది వాళ్ళద్దరే!

"నాకు మాత్రం నిన్ను పంపటం ఇష్టం లేదే! నిన్ను వాళ్ళో జీతంబత్తెం లేని వంటమనిషిగానూ, పనిమనిషిగానూ మార్చేస్తారు. నీ అవతారం మారిపోతుంది. గుండు గొరిగించినా ఆశ్చర్యపోనవసరం లేదు" అన్నాడు అన్న!

"మీ ఇష్టం అన్నా! మీ రెలా చెప్తే అలా వింటాను" అంది మిత లేచిపోతూ!

"ఉత్తరం తీసుకెళ్ళు మితా! చదువుకో!" అంది ఉత్తరాన్ని అందిస్తూ వదిన.

మిత ఉత్తరాన్నందుకుని తన గదిలోకి నడిచి లోపల గడియ పెట్టుకుంది. కాస్త రిలీఫ్‌గా అనిపించింది. ఎందుకో మునపటిలాగ నలుగురిమధ్య నిముషంసేపైనా ఉండలేకపోతోంది.

కాస్సేపు ఎటో చూస్తూ కూర్చుండిపోయింది.

తరువాత ఉత్తరాన్ని అందుకుంది.

మా కోడలైన మితని,

ఆశీర్వదించి వ్రాయునది. మా అన్నయ్యగారూ, వదినగారూ కూలాసాగా ఉన్నారని తలుస్తాను. మీ అన్నయ్యగారూ వదినగారూ కూడా క్షేమమే కదా!

నువ్వు మా అబ్బాయి పోయిన పన్నెండో రోజున నీ పుట్టింటికి వెళ్ళావు. కష్టం వచ్చినప్పుడు పుట్టింటికి వెళ్ళడం సబబే! కాదనము. కాని నువ్వు వెళ్ళి ఆరునెలలైపోతున్నా ఇంకా తిరిగి రాకపోవడం మాత్రం బాగులేదు. కనీసం ఒక్క ఉత్తరమైనా నీ నుండి రాలేదు. ఎక్కడి వాళ్ళు అక్కడే ఉండాలి. ఎంత కష్టం వస్తేమాత్రం ఎన్నాళ్ళని పుట్టింట్లో ఉంటావు? అదీకాక నువ్వు ఉద్యోగంలో చేరావని తెలిసింది. అది మా ఇంట్లో కోడలు చేయరానిది. మాకది ఏ మాత్రమూ ఇష్టం లేదు. కనక వెంటనే దానికి రాజీనామా చేసితీరాలి. ఆపైన నువ్వు వీలుపడినంత త్వరగా ఇక్కడికి రావాలి. ఏ విధంగా చూసినా నువ్వు ఇక్కడ మాతో ఉండడమే సముచితంగా తోస్తోంది.

ఆశీస్సులతో అత్తమామ.

అలాంటి మరో ఉత్తరం తండ్రికి కూడా రాసి ఉంది.

మిత మోకాళ్ళలో ముఖం దాచుకుంది.

గుండె మండిపోతోంది ఉత్తరంలోని

సారాంశానికి.

కడుపు మండిపోతోంది ఆకలి అధికం కావడంవల్ల!

కాని మిత అలాగే కూర్చుండి పోయింది ఆమెని ఎవ్వరూ ఓదార్చడానికి రాలేదు. అన్నానికి అసలే రమ్మని పిలవ లేదు. ఉత్తరం ఆమెలోని ఆకలిని చంపేసింది అనుకుంటున్నారేమో వాళ్ళు.

కాని ఆకలి ఏ కష్టం వచ్చినా చావదని దాని చావు మనిషిచావు తర్వాతే నని బహుశా వాళ్ళు మరచిపోయి ఉంటారు.

* * *

మితని అత్తవారింటికి పంపడమే సబబు అని యింట్లోవారంతా నిర్ణయించ డంతో ఆమెకి బలవంతంగానైనా బయలు దేరక తప్పలేదు.

ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేస్తుంటే ఆఫీసు స్టాఫ్ అంతా పిచ్చిదాన్ని చూసి నట్టు చూసారు.

ఆ ఉద్యోగం సంపాదించి పెట్టడానికి అన్న పడిన కష్టం ఆమెకి బాగా గుర్తుంది. ఇది పోతే ఇంత మంచి ఉద్యోగం వస్తుందా అన్నమాట పక్క నుంచి అసలు ఉద్యోగం వస్తుందా అన్నది ఆమెని పీడిస్తున్న ప్రశ్న.

ఆమెని రైలెక్కించడానికి అన్నా వదినెలు స్టేషన్కొచ్చారు. వాళ్ళిద్దరూ కూడా ఏమీ మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయారు.

రైలు కూత పెట్టింది.

"నేను చెప్పినపని చేసావా లేదా?" అన్న వదినని అడుగుతున్నాడు.

"అదే ఎలా చెయ్యాలా అని ఆలోచిస్తున్నాను" అంది వదిన.

"ఏమిటి వదినా అది?" అడిగింది మిత.

జవాబు చెప్పలేదామె! తన చేతిలోని రుమాలుతో మిత నుదుటమీద గల బొట్టుని తుడిచేసి గబగబా రైలు దిగి పోయింది.

"మీ అత్తవారింటికి ఇలా వెళ్తే రేపు వాళ్ళు మమ్మల్నంటారు." జవాబిచ్చి వెనుదిరిగాడు అన్న.

ఇంకేమీ వినలేనట్టు పరుగు లంకించు కుంది రైలు.

మితకి అన్నా వదినెల మీద గల అభిమానం ఆ ఒక్క చర్యతో అంతరించి పోయింది.

అంతమంది ఎదుట వాళ్ళు చేసిన పని మితని సిగ్గుపడేలా చేసింది. కంపార్ట్ మెంట్లోకి చూసింది.

ఇంకా చాలామంది కళ్ళు ఆమెనే గుచ్చి గుచ్చి చూస్తున్నాయి. ఆ కళ్ళల్లో కదపల కొద్దీ జాలి. కదలి అంత సానుభూతి.

ఆ చూపులను తప్పించుకోడానికా అన్నట్టు గబగబా టాయ్‌లెట్ వైపుకు నడిచింది చాలాసేపు టాయ్‌లెట్‌లో నిశ్శబ్దంగా నిలిచి ఉండిపోయింది

ఆమె బయటికొచ్చేసరికి అప్పుడే మూడొంతులమంది బెర్తుల మీద వాలిపోతున్నారు. రిలీఫ్‌గా అనిపించింది మితకి.

ఏ ఆలోచనా లేకుండా తనూ పడుకుండిపోయింది. ఆమె మీద నిద్రాదేవికి కూడా జాలి కలిగినట్టు లేదు. అడుగు దూరంలో నిలబడిపోయింది.

అత్తవారింటి ముందు ఆటో దిగింది మిత. సామాన్లు తీసుకుని గేటుదగ్గరికి నడిచింది.

గేటు తీస్తోంది.

"మితా! అక్కడే ఆగు" అంగుమంది మామగారి కంఠం. ఆ కంఠంలో అనంతమైన అధికారం!

మిత ఆగిపోయింది.

మిత అత్తగారు గబగబా గేటు తీసుకుని బయటకి వచ్చింది.

"ఏమిటమ్మా ఈ వాలకం? ఇలా ఉన్నావేంటి? ఇంత చిక్కిపోయావేమిటి? శుక్రవారం ప్రొద్దున్న ఇలాగేనా ఇంటికి వచ్చేది" అంటూనే మిత నుదుట ఎర్రటి కుంకుమ దిద్దింది. గబగబా రెండు మట్టి గాజులు తోసిగా ఉన్న ఆమె కుడిచేతికి తొడిగింది. "ఇప్పుడు లోపలికి రామ్మా!"

మితకి అడుగులు తడబడుతున్నాయి.

అంతసేపు బుద్ధిగా ఉన్న చీర కుచ్చెళ్ళు ఇప్పుడు అడ్డుకుంటున్నాయి కళ్ళు మసకలు క్రమ్ముతున్నాయి.

తల్లి కుంకుమ చెరిపేసింది ఒకరోజు!

వదిన కుంకుమ చెరిపేసింది నిన్నటి రోజు!

ఆ పని వాళ్ళచేత చేయించారు తండ్రి, అన్నగారు.

కాని ఇప్పుడు జరిగినదేమిటి! ఓ అత్తగారు వితంతువు అయిన కోడలి నుదుట తనంత తానుగా కుంకుమ దిద్దింది.

ఇల్లంతా చాలా సందడిగా ఉంది.

మితని త్వరపెట్టి స్నానం చేయించింది అత్తగారు.

తర్వాత ఆకుపచ్చటి పట్టుచీర, జాకెట్టు, గాజులు ఆమెకి ఇచ్చింది. తనే స్వయంగా జడవేసి పూలుపెట్టింది.

ఇంట్లోని బంధువుల చూపులు మితకి గుచ్చుకుంటున్నాయి. వాళ్ళలో ఒక్కరు కూడా నోరు విప్పే సాహసం చేయలేదు.

తర్వాతి కార్యక్రమం నిర్విఘ్నంగా సాగింది.

అది దత్తత స్వీకార మహోత్సవం!

పాతికకీ ముప్పైకి మధ్య వయసున్న వంశోద్ధారక్ అనే వ్యక్తిని దత్తత




చేసుకున్నారు మిత అత్తమామలు.

తతంగమంతా త్వరత్వరగా పూర్తయిపోయింది.

బంధుమిత్రులంతా వెళ్ళిపోయే హడావిడిలో పడ్డారు.

అప్పుడు మిత మామగారు అందరినీ ఒకసారి హాల్లోకి రమ్మని పిలిచారు.

అంతా కూర్చున్నాక మితని పిలిచారాయన.

పసుపు పచ్చటి బట్టల్లో కళకళలాడిపోతున్న మిత మామగారి దగ్గరికి నడిచింది.

ఆమె చేతికి ఓ శుభలేఖని ఇచ్చారాయన. మీ అమ్మగారింటికి కూడా ఇదీపాటికి చేరే ఉంటుంది. ముఖ్య బంధుమిత్రులంతా ఇక్కడే ఉన్నారు కనక వాళ్ళందరికీ ఇప్పుడు ఇస్తున్నాను." అంటూ అందరికీ పంచారు.

మా ఏకైక పుత్రుడు చి. వంశోద్ధారక్‌కి చి సౌ. మితని ఇచ్చి వివాహము చేయ నిశ్చయించినామని తెలియజేయుటకు సంతసిస్తున్నాము.

నివ్వెరపోయింది మిత

నిశ్చేష్టులయ్యారు బంధుమిత్రులు

ఆచారాలెంత ఆర్తనాదాలు చేసాయో!

సాంప్రదాయాలెంత సాహసాన్ని కోల్పోయాయో!

కాని మేరుపర్వతంలా నిలబడి ఉన్న మిత మామగారిని చూసి ఆయన వాక్ప్రవాహాన్ని విని ఏ శక్తి అడ్డుకునే

యత్నం చేయలేదు.

"మా కోడలు మహాలక్ష్మిలాగ కళకళ లాడుతూ ఏళాదిన్నరక్రితం మా ఇంట కాలుపెట్టింది. కాని మా ఏకైక పుత్రుని అకస్మిక మరణం సంభవించి ఆమెకి విధంతువు అన్న ముద్రపడింది.

ఇలాంటి సంఘటనేదైనా జరిగితే అయ్యో పాపం అని ఊరుకుంటారు కొందరు. ఆ పిల్లకి మళ్ళీ పెళ్ళి జరిగితే బాగుండుననుకుంటారు మరికొందరు.

కాని ఒక్కరు కూడా ఆమెని వివాహితని చేసేందుకో చెయ్యివెయ్యరు. ఓ మాట చెప్పరు.

ఇరవై ఏళ్ళ ఈ చిన్నపిల్ల అరవై ఏళ్ళ వైరాగ్యాన్ని తెచ్చుకుని జీవించాలనడం అమానుషం. అనాగరికం.

అందుకే నేనీ పని చేసాను.

మా అబ్బాయి తన పితృలోకాలకి తర్పణం వదలవలసినవాడు. శ్రార్ధం పెట్ట వలసినవాడు. కాని తనకే పెట్టేవారు లేకుండా అయిపోయాడు.

అలా జరగడానికి వీల్లేదనే దత్తత చేసుకున్నాను. వంశోద్ధారక్ ఉత్తమోత్త ముడు. అన్న వంగతి తన పై తరం సంగతి చూసుకుంటాడు.

నాకు ఆచారాలు అధికమే. కాని వాటి కోసం ఓ పసిపాపని బలి ఇచ్చే కసాయి వాడిని కాను నేను. మీరందరూ ఉండి వధూవరులను ఆశీర్వదించి వెడితే సంతోషం."

మిత కి అత్తమామలని గొంతెత్తి ప్రశంసించాలని ఉంది. తనను కన్నవారి కంటె, తనకంటె, ఈ సమాజం కంటె ఎంతో ఎత్తుకు ఎదిగిపోయిన వారిని వేనోళ్ళ కొనియాడాలని ఉంది.

కాని పెదవులు దాటి పలుకు రావడం లేదు.

మిత అత్తమామల కాళ్ళమీద వాలి పోయింది.

ఆమె కన్నీళ్ళు వారి పాదాలను అభిషేకిస్తున్నాయి.

తమకు తోచిన రీతిలో అభినందిస్తు న్నాయి.

ఆనంద బాష్పాలు రాలుస్తూ ఉన్నాయి.



సీరియల్

# సౌందర్యదీపం

ఆర్. సంధ్యారాణి

(గత సంచిక తరువాయి)

## 60

కృష్ణమూర్తి లక్ష్మీనారాయణగారి దంపతులకి కబురుచేసి అక్కడికి రప్పించాడు.

ఆ దంపతులు ఎందుకు? ఏమిటి అని ప్రశ్నించకుండా వచ్చారు.

వాళ్ళకి అప్పుడు ఇందూ గురించి చెప్పాడు వివరంగా. అతను చెప్పింది అంతా ఆశ్చర్యంగా విన్నారు ఆ దంపతులు.

"ఏమిటి నువ్వు ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నావా?" అడిగారు ఆయన.

అతను తల ఊపాడు.

ఆవిడ ఏం మాట్లాడలేదు.

"నువ్వు అంటే కొంచెం కూడా ఇష్టం ఉన్నట్టు కనిపించటంలేదు నీ మాటలు బట్టి చూస్తుంటే. అలాటి అమ్మాయిని పెళ్ళిచేసుకుని నువ్వు ఏం సుఖపడతావు?" అడిగారు ఆయన శాపీగా.

అతను చిన్నగా నవ్వాడు.

"నేను సుఖపడతానా లేదా అని నేను ఆలోచించటంలేదండి."

"ఏమిటి ఆలోచిస్తున్నావు? పెండ్లి అంటే ఏమిటి అనుకుంటున్నావు? ఇది బొమ్మలాట కాదు. సినిమా కాదు కథా కాదు జీవితం బాబు జీవితం ఆ జీవితాన్ని, ఆ జీవితంలో ఆనందాన్ని సుఖాన్ని వేజేతుగా పోగొట్టుకుంటే తిరిగి పొందలేవు జీవితం అంతా బాధ పడతావు" నచ్చచెప్పడానికి చూశారు లక్ష్మీనారాయణగారు

"నిజమేనండి మీరు చెప్పింది. కాని పంతం పట్టి ఉన్నాను ఈ పెళ్ళి జరిగి తీరాలి."

"పౌర్వానికిపడి పంతాలకి పోతున్నావు జరగబోయేది ఏమిటో ఆలోచించటం లేదు నువ్వు" అంటూ ఆగి-

"పెళ్ళి అంటే నూరేళ్ళపంట బాబూ, భార్య అంటే అర్థం మగవానికి ఒక

చక్కని ఇల్లాలు, భర్తతో పాలునీళ్లలా కలిసిపోయే అర్ధాంగి, సుఖసంతోషాల్లోనే కాకుండా కష్టాల్లో కూడా పాలు పంచు కునేది అర్ధాంగి. భర్త నీడను అంటిపెట్టు కుని ఉండే స్త్రీ చక్కని ఇల్లాలు అని పించుకుంటుంది కాని...! ఈ అమ్మాయి....!"

కృష్ణమౌళి మాట్లాడలేదు.

ఆయన చెప్పినమాటల్లో ఎంతో సత్యం ఉంది. పెద్దాయన జీవితాన్ని కాచి వడ బోసి మాట్లాడుతున్నారు.

చనువుగా తనకి సలహా ఇస్తున్నారు.

తన మంచిని కోరుతున్నారు.

తన జీవితాన్ని చేజేతులా పాడుచేసు కుంటున్నానని బాధపడుతున్నారు.

ఒక్కక్షణం మౌనం వహించాడు.

వాళ్ళు చెప్పింది నిజమే అనిపిస్తుంది

కాని తల్లికి తను మాట ఇచ్చాడు!

ఆ మాటే ఆయనకు చెప్పాడు.

"మీరు చెప్పింది నాకు అర్థం అయింది. నా మంచికోరి చెప్తున్నారు ఈ మాటలు. నేను మా అమ్మగారికి మాట ఇచ్చాను"

"నువ్వు మీ అమ్మగారికి మాట ఇచ్చాను అంటున్నావు సరే. ఆ అమ్మాయి నిన్ను ఇష్టపడి మనస్ఫూర్తిగా ఈ పెళ్ళికి అంగీకరించినట్టు అయితే నువ్వు ఈ పెళ్ళి చేసుకుని మీ అమ్మగారిమాట నిల బెట్టినా అర్థంఉంది. కాని ఆ అమ్మాయి నువ్వు అంటే ఇష్టపడటంలేదు పైగా ఆ అమ్మాయికి అహంకారం, అతిశయం ఎక్కువే అని తెలుస్తుంది. చనిపోయిన మీ అమ్మగారికి ఇచ్చిన మాటకోసం నువ్వు ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకుంటే జీవితం ఏమవుతుందో ఆలోచించుకో బాబూ" అన్నారు.

అతను ఏదో చెప్పబోతుంటే ఆవిడ అన్నారు.

"చూడు బాబూ కృష్ణా! నువ్వు ఇష్టపడ్డావు అంటే మేము ఏం చెప్పలేం కాని నిన్ను మా కొడుకుగా భావించి ఒక్కమాట చెప్తున్నాను. మగవాడికి చేసుకున్న భార్యవలన పేరు ప్రతిష్టలు మరింత ఎక్కువ అవ్వాలిగాని ఆ పేరు ప్రతిష్టలు తగ్గకూడదు. నలుగురిలో తన భార్యమంచి నవ్వులపాలు కాకూడదు. నీ భార్యతో యిల్లుదాటి బయటకు అడుగు పెట్టినప్పుడు అందరూ మీ జంటనుచూసి మెచ్చుకోవాలి. మీ అన్యోన్యతను చూసి ఈర్ష్యపడాలేగాని మీ జంటను చూసి చాటుగా నవ్వుకునేటట్లు ఉండకూడదు. బాగా ఆలోచించుకో. నీవు అన్నీ ఆలో చించుకుని ఈ పెళ్ళి చేసుకోవడానికి సిద్ధ పడితే ఇక ఆలోచించేది ఏమీ లేదు. ఇప్పుడేవెళ్ళి ఆ అమ్మాయిని అడుగుతాం" అన్నారు ఆవిడ.

ఆ మాటలకు అతను చిన్నగా నవ్వుతూ—

"అమ్మా మీరు నా మంచికోరి ఇంతగా ఆలోచిస్తున్నారు అంటే నేను ఎందుకు చాలా సంతోషిస్తున్నాను ఈ విషయాలు అన్నీ నేను ఈ ఊరు రాకముందే ఆలో చించుకున్నాను "

"నేను అంటే ఆమె ఇష్టపడి పెళ్ళి చేసుకుంటే సరే లేదా బలవంతంగా ఆమెను పెళ్ళిచేసుకుంటే జీవితం ఏమిటి అని."

"కొన్నిరాత్రులు కొన్ని పగలూ ఈ విషయాన్ని తర్జనభర్జన చేసి ఆలోచించి ఈ నిర్ణయానికి వచ్చాను. మా అమ్మ గారికి మాట ఇచ్చినందువలన ఈ పెళ్ళి చేసుకుని మావయ్యపొగరు అణచాలని నిశ్చయించుకున్నాను.

"ఇందూని చూశాక నా మనసు మరో విధంగా ఆలోచించసాగింది.

"ఇందూ చాలా అందమైన అమ్మాయి. ఆమెకు పొగరు ఉంది. పెంకితనం ఉంది. నిర్లక్ష్యంఉంది. అలాటి అమ్మాయిని పెళ్ళిచేసుకుని ముక్కుకి తాడువేసి నా దారికి తెచ్చుకోవటంలో నాకు ఆనందాన్ని సంతోషాన్ని కలిగిస్తుంది అని నిశ్చయించుకున్నాను.

"ఆ అమ్మాయి పొగరు, గర్వం, కవ్వింపు నాకు సవాలు అయ్యాయి. ఆ సవాలుని ఎదుర్కోవాలి. నేను గెలిచి తీరాలి అదే నా శపథం" అన్నాడు దృఢ నిశ్చయంతో.

ఆయనా ఆవిడా ఒక్కసారి ముఖ ముఖాలు చూసుకున్నారు

ఆవిడ శాంతంగా చిరునవ్వుతో ఆయనతో అంది.

"మనం వెళ్ళి అమ్మాయితో మాట్లా డదాం. అబ్బాయి ఈ నిర్ణయం తీసు కున్నాడు అంటే బాగా ఆలోచించే ఈ నిర్ణయం తీసుకున్నాడని అనిపిస్తుంది. ఈ కాలంపిల్లలు మనం ఊహించినంత తెలివితక్కువవాళ్ళు కారు. వాళ్ళ సమ స్యలు వాళ్ళే పరిష్కారం చేసుకోగలరు. మనం భయపడనవసరంలేదు. "

"తాళిబొట్టులో మహత్యం ఉంది. ఆడ ల్లపి మెడలో తాళిబొట్లు పడగానే ఎలాటి అమ్మాయి అయినా యిట్టే లొంగి పోతుంది. భర్తముందు తలవంచుతుంది" అన్నారు ఆవిడ.

ఆయన నిజమే అన్నట్టుగా చిరునవ్వు నవ్వారు.

"కృష్ణా! నీవు చెప్పినట్టే వెళ్ళి ఆ అమ్మాయిని అడుగుతాం. నీ జీవితం ఏమవుతుందో అని నీకు నచ్చచెప్పటానికి చూశాం. నీకు అంత నమ్మకం ధైర్యం ఉంటే మాకు ఎలాటి అభ్యంతరం లేదు. నీవు సుఖంగా సంతోషంగా ఉండటమే

మా కోరిక. పద, ఆ అమ్మాయి ఎక్కడ ఉంది!" అన్నారు లక్ష్మీనారాయణగారు.

"రండి చూపిస్తాను" అన్నాడు కృష్ణమౌళి.

అతని వెనకాల ఆ దంపతులు ఇద్దరూ వెళ్ళారు

* * *

కృష్ణమౌళి ఆ గదిలో అడుగు పెట్టగానే చప్రున చూసింది అతనివైపు ఇంద్రసేన.

అతను నవ్వలేదు

సూటిగా ఆమె కళ్ళల్లోకి చూశాడు.

మీకు ఇక్కడ ఏం పని! నా గదిలోకి ఎందుకు వచ్చారు! అన్నట్టు కోపంగా చూసింది.

అతని స్వభావం పూర్తిగా తెలుసుకున్న తరువాత ఆమె అతని దగ్గర నటించటం మానేసింది.

కథలకి కబుర్లకి లొంగేరకం కాదు అతను. తను ఆలోచించి నిర్ణయించుకున్న పనే చేసితీర్తాడు - అని గ్రహించుకుని అతను అంటే ఇంకా కోపం, కసి, కక్ష పెరిగిపోసాగాయి.

లక్ష్మీనారాయణగారిని ఆయన భార్యని పరిచయం చేశాడు

"వీరు మనకి కావలసినవాళ్ళు. చాలా మంచివాళ్ళు. నాకు అమ్మానాన్నగార్లతో సమానం" అంటూ చెప్పాడు.

వీరు మనకి కావలసినావాళ్ళా!

మనం అంటే?

మీరూ నేనూ ఒకటా! అన్నట్టు కోపంగా చూసింది.

"ఈమె ఇంద్రసేన. మా మావయ్య కూతురు తండ్రి నోట్లోనుండి ఊడిపడి నట్టు ఆయన పోలికలు ముఖ్యంగా ఆయనబుద్ధులు పుణికి పుచ్చుకుంది" అంటూ నవ్వాడు.

ఆ నవ్వులో రవ్వంత వ్యంగ్యం మిళితమైఉంది. అది గ్రహించుకున్న ఇందూ మండిపడిపోయింది.

తండ్రిని తనని వాళ్ళ ఎదుట అవమానిస్తున్నట్టేగా!

ఆ దంపతులని పరిచయం చెయ్యగానే నిర్లక్ష్యంగా అయిష్టంగా చేతులు జోడించి నమస్కరించింది ఆ దంపతులకి.

లక్ష్మీనారాయణగారు ఆయన భార్య చిరునవ్వు నవ్వారు.

కృష్ణమౌళి నేను వెళ్తాను అన్నట్లు వాళ్ళకి కళ్ళతో చెప్పి "వస్తాను" అంటూ వెనుతిరిగాడు.

వెళ్తున్న అతనివైపు కళ్ళు చిట్లించి కరకరా చూడసాగింది.

లక్ష్మీనారాయణగారు చొరవగా అక్కడ సోపాలో కూర్చుంటూ భార్యతో అన్నారు.

"అమ్మాయి మనకి మర్యాద చెయ్యా లేమిటి? అలా కూర్చో"

ఆవిడ చిన్నగా నవ్వు కుంటూ కూర్చుంది.

ఇందూ కూర్చోలేదు.

ఈ ముసలిమేళం ఇక్కడ ఎందుకు చేరింది అన్నట్టు చూడ సాగింది.

"అలా కూర్చో అమ్మాయి" అంది ఆవిడ.

ఇందు వెంటనే కూర్చోలేదు

ఆవిడ ఆమెవైపు క్షణంసేపు పరీక్షగా చూసి మళ్ళా చెప్పింది.

"కూర్చో అమ్మాయి" అంటూ.

ఆ మాటలకి ఇందూ టపీమని విసురుగా అక్కడ ఉన్న సోఫాలో కూర్చుంది.

ఆమె ఎంత కోపంగా ఉందో లక్ష్మీ నారాయణగారు గ్రహించుకోలేకపోలేదు.

పైకి శాంతంగా నవ్వుతూ అన్నారు

"అమ్మాయి నువ్వు అలా సన్నగా నాజూగ్గా వున్నావు కాబట్టి నువ్వు అలా విసురుగా సోఫాలో కూర్చున్నా సోఫా ఏం కాలేదు. అదే లావుగా ఉన్న అమ్మాయి అయితే" అంటూ నవ్వారు.

ఆయన అలా హాస్యంగా అంటుంటే ఇందూకి ఒళ్లు మండిపోయింది.

పైకి ఏం అనలేదు. నవ్వు రాక పోయినా బలవంతంగా పెదవులమీదకు నవ్వు తెచ్చుకుంది.

"చదువు ఎంతవరకు" అడిగారు.

"డిగ్రీవరకు" ముక్తసరిగా చెప్పింది.

"ఆహా" అన్నారు.

"ఏదమ్మా నీ చెయ్యి చూపించు" అన్నారు.

ఎందుకు అన్నట్టు చూపింది ఆయన వైపు.

"నీ వివాహం ఎప్పుడు అవుతుందో చెప్తాను" అన్నారు.

"ఒద్దండీ. నాకు పెళ్ళివయసు దాటి పోలేదు వివాహం ఎప్పుడు అవుతుందో తెలుసుకోవాలన్న కుతూహలం నాకు లేదండీ" అంది మెల్లగా.

మెల్లగా చెప్పినా ఆ మాటలు కరుకుగానే ఉన్నాయి.

అమ్మాయి చాలా మొండిది. చాలా పెంకిది. అలాటి అమ్మాయితో ఎలా ఈ విషయం కదపాలా అని ఆలోచించ సాగారు.

ఆయన అలా ఆలోచిస్తుంటే ఆవిడ మెల్లగా అన్నారు.

"చూడమ్మా కృష్ణ మీ మేనత్త కొడుకా!"

"చెప్పమ్మా మీ మేనత్త కొడుకా! కృష్ణ నిన్ను పరిచయంచేస్తూ మా మామయ్య కూతురు అని అంటుంటేను."

"అతనికి మతిలేదు. నాకు అతను

మేనత్తకొడుకేమిటి!" కోపంగా అంది.

ఆవిడ చిత్రంగా చూసింది.

"మా అంతస్తు ఎక్కడ కృష్ణమౌళి అంతస్తు ఎక్కడ! నక్కకూ నాగలోకానికి ఉన్నంత తేడా ఉంది. నక్క నాగలోకానికి ప్రయాణమా! వింటుంటే హాస్యాస్పదంగా ఉంటాయా మాటలు."

"అయితే అబ్బాయి చెప్పినట్లు మీ మేనత్తకొడుకు కాడా!" అడిగింది ఆవిడ.

"కాడు" అంది కటువుగా.

"మరి అలా చెప్పాడెందుకు!" అన్నారు ఆయన కావాలన్నట్టుగా.

ఇందూ మాట్లాడలేదు.

"అమ్మాయి నీ మాటలు చూస్తుంటే ఇట్లా ఉన్నాయి, అబ్బాయి మాటలు చూస్తే అట్లా ఉన్నాయి. ఇరతకు నిజం ఏమిటి!" ఆవిడ అడిగారు.

"నిజం ఏమిటో చెప్పమంటారా!" సూటిగా అడిగింది.

"చెప్పమనేగా అడుగుతున్నాం" అన్నారు ఆయన.

"మా డబ్బు చూసి వలవేస్తున్నారు. అతను పై అంతస్తులకి ఎగబ్రాకాలని ఆకాశానికి నిచ్చెనలు వేస్తున్నాడు."

"అది దురాశే అవుతుంది" అంటూ క్షణం ఆగి అంది.

"చూడండి మిమ్మల్ని ఒక మాట అడుగుతాను సూటిగా జవాబు ఇస్తారా!"

"సూటిగా అడిగిన ప్రశ్నకి సూటిగానే జవాబు ఇస్తాం అడుగమ్మా" అన్నారు ఆయన.

"కృష్ణమౌళి తల్లి మా యింట్లో వంట మనిషిగా ఉండేది. మీరు చెప్పండి వంట మనిషి నాకు మేనత్త ఎలా అవుతుంది!"

ఆ మాటలకి లక్ష్మీనారాయణగారి ముఖం గంభీరంగా మారిపోయింది.

"చూడమ్మా నేను ఒక మాట చెప్తాను నువ్వు జాగ్రత్తగా విను."

"నువ్వు వంటగదిలోకివెళ్ళి వంట చేస్తుంటావు అనుకో. ఈ మీ అంటీవచ్చి నీకు సాయంచేసి వంటచేసిపెడ్తుంది అనుకో, అప్పుడు ఈ మీ అంటీ నీకు వంటమనిషి అయిపోతుందా!" అడిగారు

ఆవిడ చిన్నగా నవ్వింది.

"అది అదికాదండీ" అంటూ తడబడింది.

"అది ఫర్వాలేదు చెప్పమ్మా" అన్నారు ఆయన.

"అంటీని అలా ఎందుకు అంటానండీ ఆవిడ అదే ఆ కృష్ణమౌళి తల్లిని అన్నాను గాని" అంది ఇంద్రసేన.

ఏం చెప్పాలో తోచలేదు.

ఆయన గట్టిగా నవ్వేశారు.

ఆవిడ కూడా నవ్వింది.

"చూడమ్మా! కలకాలం ఉండేది ధనం కాదు, అనురాగధనం. మీ మేనత్త అంటే




కృష్ణకల్లి పరిస్థితులవలన భర్త చనిపోతే అన్నగారి పంచనచేరి ఉంటుంది ఆవిడ. ఈ రోజులు వేరు ఆ రోజులు వేరు. ఈ రోజున స్త్రీ భర్త చనిపోయినా ఉద్యోగంచేసి ఆ డబ్బుతో పిల్లల్ని పోషించుకోగలదు. ఎవరి పంచనా చేర నవసరంలేదు."

"ఆ రోజులు ఆలా కాదు. స్త్రీకి భర్త చనిపోతే ఎవరిదో ఒకరి అండ కావల సిందే. ఆ రోజుల్లో స్త్రీకి చదువులు లేవు సంపాదనలేదు. ఆవిడ పుట్టింట్లో తల దాచుకోవడానికి వచ్చి ఉంటుంది."

"మీ నాన్నగారు ఆవిడ్ని వంటమనిషిగా అట్టేపెట్టి ఉంటారు. అన్నగారు ఆదరిస్తారు అని పుట్టెడు ఆశతో వెళ్ళిన ఆవిడకి నిరాశ ఎదురై ఉంటుంది. అయినా ఆ గుండెకోతవి మనసులోనే మింగుకుని పసివాడికోసం రోజులు వెళ్ళబుచ్చి ఉంటుంది" అన్నారు.

"అతను మీకు అలా చెప్పాడా!" కోపంగా ప్రశ్నించింది.

"అతను చెప్పే మాటలుకంటే నీ మాటలు బట్టి అసలు విషయం తెలుసు కున్నాను"

"తెలుసుకున్నారుగా, సంతోషం. ఇక మీరు వెళ్ళవచ్చు" అంది కోపంగా.

"నీకు ఈ విషయాలు చెప్పి వెళ్ళిపోవడానికి రాలేదమ్మా."

మరి! అన్నట్టు చూసింది.

"నీకు అర్థం అయినట్టుగా చెప్పి

కృష్ణతో నీవు పెళ్ళికి అంగీకరించేటట్టు చేసి వెళ్ళాలని నిశ్చయించుకున్నాం."

"అది ఈ జన్మలో జరగనిది. అవిడ ఎవరో నాకు అనవసరం. కృష్ణమౌళి నాకు ఊహ తెలిసినప్పటినుండీ నాకు అతను వంటమనిషి కొడుకుగానే తెలుసు. అతన్ని వివాహం చేసుకుని మా నాన్న గారు అమ్మగారు మా యింటి వంశగౌరవాన్ని నాశనం చెయ్యదలుచుకోలేదు."

"ఇందూ!" ఆయన శాంతంగా పిలిచారు

"చిన్నతనంతో ఏదేదో అంటున్నావు తల్లీ. పంతాలని పట్టుదలని ఒక్క నిమిషం పక్కకు పెట్టి కృష్ణమౌళిగురించి ఆలోచించు. అతను అందగాడు. గుణవంతుడు. విద్యావంతుడు. అయిశ్వర్యవంతుడు. అన్ని విధాల నీకు తగినవాడు."

"నాకు తగినవాడు అంటున్నారు. ఈ ప్రపంచంలో అతను ఒక్కడేనా అయిశ్వర్యవంతుడు, అందగాడు, గుణవంతుడూనూ. ఇంకెవరూలేరా!"

"ఉన్నారు" శాంతంగా అన్నారు.

"మరి!" నిర్లక్ష్యంగా చూసింది ఆ దంపతులవైపు.

"నూటికీ కోటికీ ఉన్నా వాళ్ళ నిన్ను కృష్ణ అంతగా మనస్ఫూర్తిగా ఇష్టపడి కోరుకోవడంలేదే."

దెబ్బతిన్నట్టు చూసింది ఇందూ.

ఆవిడ అన్నారు

"ఆడిపిల్లకు అహంకారం అతిశయం ఉండకూడదమ్మా. ఆడపిల్ల పురుషుడి నీడలో తలదాచుకోవడంలో ఉంది గౌరవం."

"అవన్నీ పాత కబుర్లు. ఇప్పటి ఆడపిల్లలు ఎవ్వరూ అలా వుండటంలేదు"

"అలా వుండటంలేదు అన్నవాళ్ళని ఒక్కళ్ళని చూపించు" అన్నారు ఆవిడ.

వెంటనే జవాబు ఇవ్వలేదు ఇందూ.

ఆవిడ చిన్నగా నవ్వుతూ అన్నారు.

"మగాడు అర్ధరాత్రి ఒంటరిగా వదిచి వెళ్ళగలడు. ఆలా స్త్రీ అర్ధరాత్రి ఒంటరిగా నడవగలదా! మగవాడి అండ స్త్రీకి ఎప్పుడూ ఉండాలమ్మా."

"ఆమె ఎంత పెద్ద చదువులు చదువుకున్నా ఎంత డబ్బు సంపాదిస్తున్నా స్త్రీ ఎప్పుడూ అద్దాల్లోఉండే బొమ్మేనమ్మా.

"ఇది సత్యం. స్త్రీకి స్వేచ్ఛ స్వాతంత్ర్యం వచ్చినా అది అన్ని వేళల్లో కాదమ్మా. ఆమెకు భర్త తోడు ఉండాలి. అతను మంచివాడు, బుద్ధిమంతుడు అయి ఉంటే ఇక స్త్రీకి కావలసినది కోరుకునేది ఏముంది! ఆ స్త్రీ జీవితం నందనవనమే" అంది ఆవిడ.

"అవునమ్మా. మీ అంటీ చెప్పిన మాటల్లో అక్షరాలా నిజం ఉంది" అన్నారు ఆయన.

"నిజం ఉండొచ్చు ఉండకపోవచ్చు కాని నేను మాత్రం కృష్ణమౌళిని పెళ్ళి చేసుకోవటం కలలో మాట. చావనైనా ఛస్తాను కాని అతన్ని మాత్రం పెళ్ళి చేసుకోను" అంది ఇందు కచ్చితంగా చెప్పేస్తూ.

లక్ష్మీనారాయణగారు బరువుగా నిట్టూర్చారు.

ఎంతగా నచ్చచెప్పాలని చూసినా ఇందూ నిర్లక్ష్యంగా పెంకిగానే చెప్తుంది

వాళ్ళ మాట ఒకటీ వినటంలేదు.

"సరే మేం చెప్పవలసింది చెప్పాం. అబ్బాయి మంచివాడు. నీవు చేసుకుంటే సుఖపడతావు. ఇతన్ని కాలదన్నుకుంటే నీ అదృష్టాన్ని కాలదన్నుకున్నట్టే నీవు. మా మాట వినకపోతే ఏంచేస్తాం? వస్తాం" అంటూ లేచారు ఆయన.

"మంచిది" అంటూ ఇందూ కూడా లేచి నిలబడింది.

ఆవిడకూడా వెళ్తూ అంది ఇందూ చెయ్యిపట్టి-

"చూడమ్మాయి! విధి సంగతి నీకు తెలీదు. నోటిమాటలని మదుటి వాత చెరిపేస్తుంది. మనిషి పుట్టినప్పుడే బ్రహ్మ ముడి కూడా వేసేస్తాడు. ఆ ముడి ఎవ్వరూ విప్పలేరు. నీకు కృష్ణతోనే ముడిపడిఉంటే నువ్వు ఇప్పుడు ఎంత అరిచి గీపెట్టినా ఆ టైము వస్తే ఆ పెళ్ళి జరిగిపోతుంది. ఆ మూడుముళ్ళు పడిపోగానే మన్నుతిన్న పాములా పడి ఉంటావు."

"అప్పుడు ఈ కబుర్లు ఉండవు ఈ గడుసుతనం ఉండదు' అర్థంఅయిందా!"

"మేము వెళ్తాం" అంటూ ఆవిడ ఆయనతో వెళ్ళిపోయింది.

ఇందూకి ఒళ్ళు మండిపోయింది.

ఏదో అనాలని అనుకుంటుండగా వాళ్ళు గుమ్మందాటి వెళ్ళిపోయారు.

అయ్! ముసిలి ఎంతమాట అన్నావు.

చెప్తా చెప్తా అంటూ పళ్ళు పటపట లాడించింది.

నాకు ఆ కృష్ణమౌళికి ముడిపడిఉంటే ఉంటుంది అని చెప్తావా!

ఆ కృష్ణమౌళిగారు నాతో చాల్లేక మిమ్మల్ని పంపించావా? అడిగిరమ్మని.

పాపం ఆయనా చాల్లేక ఓడిపోయి కూర్చున్నారా?

ఇంకా ఎన్నాళ్ళు! ఓడిపోయి తనని ఇంటికి పంపించేస్తాడు.

కబుర్లు చెప్పినంత తేలికా కథలు నడపటం.

ఇందూ మనసులో నవ్వుకుంది.

నాతో ఈ ముసిలిమేళం తాలగలదా? వచ్చిన తోవనే వెళ్ళిపోయారు అనుకుంది. (సశేషం)



# రాజీ

## కృష్ణ

"మానవజన్మ ఎంతో ఉత్కృష్టమైనది. ఎంతోపుణ్యం చేసుకున్న జీవికిగాని యీ జన్మ లభించదు. అందుకే నరజన్మ మిక దుర్లభమురా....." గుడిలో చెబుతూన్న హరికథకుడి మాటలు చెవిన బడగానే నవ్వొచ్చింది సోమయాజులుకి. అబద్ధం— మోసం— దగా అనుకున్నాడు. పాపం చేసుకున్న జీవులే మానవులుగా పుడతారంటే సమంజసంగా వుంటుంది. లేకపోతే పుణ్యం చేసుకున్న జీవులు ధనికమానవులుగా పుడతారంటే సముచితంగా వుంటుంది. ధనమూలమైన యీ జగత్తులో పేదవాడుగా పుట్టడమంటే— అన్ని రకాల శిక్షలూ వేసినట్లే. అన్ని శిక్షల మూర్తీకృత రూపమే నరజన్మ గాదూ—?

దేవాలయం దాటి వొచ్చేశాడు—హరిదాసు గొంతు విన్పిస్తూనే వుందిగాని మాటలు విపులంగా విన్పించడంలేదు.

ఇంతకీ వెతనుదుక్కుంటూ వెళ్తున్న కిషన్‌లాల్ యీ వేళప్పుడు యింట్లో వుంటాడో లేదో? సాధారణంగా గురువారాలు రాఘవేంద్రస్వామి సంకీర్తనకి, శనివారంనాడు ఆంజనేయస్వామి గుడికి భజనకూ, సోమవారం శివాలయానికి వెళ్తుంటాడీ వేళప్పుడు. వేరే వారంనాడు గుడికి వెళ్ళడని గాదు—కానీ యింట్లో వుండే అవకాశం వుంది.

వాళ్ళింటిముందే నిల్చుని వున్నాడు కిషన్‌లాల్ ఎప్పటిలాగే చిరునవ్వు మాయని ముఖంతో—అయిదుగురు పిల్లలు— తనలాగే చిన్న వుద్యోగం కానీ ఆ

మొహాన చిరునవ్వుని మాయనివ్వడు- ఎప్పుడూ సుబ్బరంగా వుతికి రానిపాల్ వేసిన తెల్లని షర్టులా ఆ చిరునవ్వుని మాత్రం తొడుక్కునే వుంటాడు.

తనని చూడగానే సెట్టుదిగి రెండు చేతులూ జోడించి - "నమస్కారం సోమయాజులుగారూ—రండి రండి-యిటు యిటు-" అంటూ ఎంతో కన్నంత దుకు బాధపడుతూ జాగ్రత్తగా యింట్లోకి తోడ్కొని పోయినాడు.

వీళ్ళిద్దరినీ చూడగానే ఆ గదిలో వున్న శ్రీమతి కిషన్‌లాలూ, పిల్లలూ చప్పున లేచి రెండో గదిలోకి వెళ్ళి పోయినారు.

పడకకుర్చీ సోమయాజులుకు చూపి తను మడతకుర్చీ వాల్చి కూర్చుని చేతులు రాసుకుంటూ "చెప్పండి- ఎలాంటి సేవ చేయగల్గుతాను తమకోసం?" అన్నాడు ఆవు నెయ్యిలాంటి హిందీలో.

గిల్టీగా నవ్వేడు సోమయాజులు- "ఏముందీ- మామూలు యాచనే- మా పెద్దాడు మొన్న బి కాం. పాసైనాడు- మీకు తెలుసుగా-పేపర్లో ఉద్యోగప్రకటన వొకటి పడింది. అప్లికేషన్‌ఫాం ఇరవై రూపాయలు - మరో పదిరూపాయల పోస్టల్ ఆర్డరు- ఈ మధ్యాహ్నం దాకా ఎక్కడేనా దొరుకుతాయేమోనని చూశాను, ఎల్లుండే చివరి తేదీ- మిమ్మల్నిబ్బంది పెట్టక తప్పడంలేదు-"

చిరునవ్వుతో సోమయాజులు వంక చూస్తూనే వున్నాడు కిషన్‌లాల్, ఆయన మాటలకి 'ముగ్గుడై' పోయినవాడిలా.

ఆ చూపు చూసి సోమయాజులే విస్తుపోయి ఆ తరువాత దిక్కుతోచక ముఖం చిట్లించి ప్రశ్నార్థకం చేసి- "క్షమించాలి- మీకూ నెలాఖరు రోజులే- నాకు తెలీకనా! కానీ యేం చెయ్యాలో దిక్కుతోచని స్థితిలో యిదిగో నా కాళ్ళిట్లాగే లాక్కొచ్చి పడేసేయి మీ యింట్లో-" అంటూ నేరం కాళ్ళమీదికి తోసేసి నిట్టూర్చేడు.

నవ్వేడు సోమయాజులు మాటలకి కిషన్‌లాల్- "ఎంత వసం దత్తుందంటారు చెప్పండి?"

"ఎంతో నా! ఏభై రూపాయలు- ఏదో మీ చేతిమీదుగా యీ సర్దుబాటు జరిగితే మావాడికా వుద్యోగం దొరుకుతుందేమో నని-" ఆతుకుల చిరునవ్వుని తొడిగేడు సోమయాజులు.

"అట్లాగే-" తలూపేడు కిషన్‌లాల్. అంతకన్నా ముఖ్యమైన విషయాన్ని ప్రస్తావించేడు "నిన్న పారాయణకి వొస్తారేమోనని చాలా ఎదురుచూశాను మందిర్‌లో-"

రామాలయంలో జరిగే రామచరిత మానస్ పారాయణానికి కిషన్‌లాల్ కోసమన్నట్లుగా ఎప్పుడో ఒకసారి వెళ్తుం

టాడు సోమయాజులు. తనకి హిందీయే సరిగా రాదు. అందులోనూ అదేదో బ్రిజ భాష అట - వెళ్ళినప్పుడు అందర్తోబాటు పెదాలు కదిలించి- ఆ తరువాత చిత్తం ఏమరపాటులో వుండినందుకు రాముల వారి విగ్రహం ముందు చెంపలు వాయిం చుకుని యింటికి వొచ్చేస్తుంటాడు.

"నిన్న మీరు వచ్చుండాల్సింది- ఆ వనాంతర భూములనెంత గొప్పగా వర్ణిం చేడు గోస్వామీజీ!" అంటూండగానే కిషన్‌లాల్ కన్నులు చెమర్చినట్లు అన్పించి బెదురు బెదురుగా చూశాడు సోమయాజులు.

ఆ మందిరాలూ - ఆ భజనలూ - ఆ పారాయణాలూ- ఈ కిషన్‌లాలూ- యీ పారవశ్యం- యీ స్పందనా! ఏమిటో అర్థమై యేడవదు సోమయాజులుకి. మళ్ళీ కులం చూస్తే- సాక్షాత్తూ ఆ ప్రవ హనశైవాలి అవతారం అన్పిస్తూంటుంది. తమా మరి! రావడమైతే తనకూ మంత్ర పుష్పం వొచ్చు - విష్ణు సహస్రనామం, కృష్ణకర్ణామృతం, కరావలంబస్తోత్రం, ముకుందమాల వగయిరాలు వొచ్చు. కానీ యే ఆలయంలో నిలచినా, యే మూర్తి ముందు చేతులు జోడించినా ప్రతి శ్లోకం- ప్రతిపాదం కాగానే 'మావాడి కుద్యోగం కావాలి స్వామీ' అనీ, 'నా ప్రమోషను సంగతి కాస్త చూడు స్వామీ' అనీ, 'చిన్నాడు పొత్తిగా అకతాయిలా తిరుగు తున్నాడు స్వామీ- కాస్త వాణ్ని సరైన మార్గంలోకి మళ్ళించు స్వామీ' అనీ- ఆకుపూజలో ఒక్కో- ఆకూ విసిరినట్లు ఒక్కో- నివేదనా స్వామివారి పాదాల మీఁడికి మృదువుగా విసుర్తుంటాడు తను.

లోపల్నించి పిలుపు- కిషన్‌లాల్ టీ పట్టుకొచ్చేడు.

ఏభై రూపాయిలు జేబులో వేసుకుని యింటికి నడుస్తున్నాడు సోమయాజులు- కిషన్‌లాలూ తనలా చిన్న వుద్యోగే- తన కుటుంబం కంటె పెద్దది అతని కుటుంబం-కాకపోతే యింటద్దె తనకంటే తక్కువ అతనికి- పెళ్ళాం- బిడ్డా కుట్టు మిషన్ పనిచేస్తారు. విస్తళ్ళు కుడుతుంది వాళ్ళమ్మ. ఆ సంపాదన బాగానే వుండొచ్చు. అందుకేనేమో 'సమన్వ' అంటే యేమిటో తెలీనివాడినా కన్పిస్తాడు. నిరంతరం చిన్మయముద్రలో వుంటాడు.

తాత్కాలికంగా అవసరం తీరింది సోమయాజులుకి- పెద్దాడు అప్లికేషన్ యిచ్చేశాడు

దరఖాస్తు పంపిన దగ్గర్నించీ-ఇంట ర్వ్యూ ఎప్పుడుంటుందో! సిఫారసులు నడుస్తాయేమో-! ఎవరికేనా చెయ్యి తడ పాల్సిన అవసరం పడ్తుందేమో! ఒక వేళ అట్లాంటి అవసరం వస్తే-? అని పరిపరివిధాల ఆలోచనలు.

ఇట్లా ఆలోచనల్లో సతమతమౌతుంటే కిషన్‌లాల్ బలవంతంగా రామ మందిరానికి తీసుకుపోయినాడు.

ఆ గంటన్నరసేపూ పారాయణంలో కూర్చున్నాడు సోమయాజులు అంత సేపూ తన చూపు లెక్కడున్నయ్యో! చిత్త మెక్కడుందో. చేతిలో చిటితాళం యేం చేస్తూందో - ఆ భజనలో నోరేం వల్లించిందో యేమీ తెలవదు అతనికి.

"ఇవాళ మీరు చాల ప్రశాంత చిత్తంతో ఆధ్యాత్మిక చిత్తవృత్తిలో వున్నారు. చుట్టుపక్కల దేన్నీ పట్టించుకోనంత సంపూర్ణంగా భజనలో లీనమైపోయి నారు. మీరు పారాయణానికి క్రమం తప్పకుండా వస్తే బాగుంటుంది. ఆ కాస్త సేపయినా యీ ఐహిక లంపటం నుంచి బయటపడతాము....." అని కిషన్‌లాల్ అంటే—

"అఁ—నా బొంద....." అనుకున్నాడు సోమయాజులు- 'మీ మొహం' అని అనుకున్నాడేమో గూడా. చుట్టుపక్కల వాళ్ళవైపు గూడా చూశాడు—"ఏమోనండి నాకైతే దేవాలయానికి వెళ్ళినప్పుడే సమస్తమైన సమస్యలూ లిస్టు చదువు తున్నట్లు జ్ఞాపకం వొస్తాయి. ఇంట్లో యేదయినా సమస్య వచ్చినప్పుడుమాత్రం ఆ భగవంతుడు గుర్తొస్తాడు. అందుకని యింట్లోవుంటేనే ఆ భగవంతుణ్ణి తలచు కున్నట్లుంటుందనీ—" అన్నాడు సోమ యాజులు.

ప్రశాంత వదనంతో చిరునవ్వు నవ్వేడు కిషన్‌లాల్— "చమత్కారంగా మాట్లాడ్డంలో మాత్రం మీకు మీరే సాటి సోమయాజులుగారూ—!"

"అఁ" అని చప్పరించి యిందాకటిదే మళ్ళీ అనుకున్నాడు సోమయాజులు- కిషన్‌లాల్ చాల అదృష్టవంతుడు - తన లాగా కాదు. వరసగా ముగ్గురు మగ పిల్లలు- అదీ ఎలాంటి వరసనీ! ఏడాది గడవగానే పెద్దాడి బట్టలు రెండోవాడికీ, రెండోవాడివి మూడోవాడికి సరిపోయేలా కుటుంబాన్ని ప్లాన్ చేసుకున్నాడు. నాలుగూ అయిదు క్లాసులకి యింకా బట్టల అవసరం పడుతున్నట్లు లేదు- స్కూలు పుస్తకాలూ అంతే.... పెద్దాడు పైక్లాసుకు పోగానే వాడవి రెండోవాడికీ, రెండో వాడివి మూడోవాడికీ- అంతేకాదు కిషన్ లాల్ కట్టే ఆ నెరవుతుక్కువ లుంగీలు చూసినప్పుడల్లా యింకో అనుమానమూ వస్తూంది తనకి. సరే ఆ తలుపు కర్టెన్ అయితే ఖచ్చితంగా కిషన్‌లాల్ లోగడ కట్టిన లుంగీయేనని తనకి తెలియనే తెలుసు.

తనూ అట్లా కుటుంబాన్ని ప్లాన్ చేసుకోలేకపోయినా కనీసం యింటి ఖర్చులన్నా అట్లా ప్లాన్ చేసుకోవచ్చుగదా

అప్పించి ఆ సాయంత్రమే శ్రీమతితో తనకు యింగీల ఏర్పాటు గురించీ వీధి తలుపు కర్టెన్ విషయమూ మాట్లాడాలని నిర్ణయించుకుంటే బాగుంటుందేమో నవ్పించింది సోమయాజులుకు

ఆ సుర్నాడే పెద్దాడికి వచ్చిన యింట ర్వ్యూ పిలుపు చూడగానే ఉద్యోగం రావడానికి అన్ని యేర్పాట్లూ జరిగుతూ న్నట్లనిపించింది

సరిగ్గా యింకో వారం రోజులకే యింటర్వ్యూ- కెటికి వెళ్ళి ఏదేనా ప్రయత్నం చేస్తే బాగుంటుం దన్పించింది- దరఖాస్తు పెట్టి పోస్టాఫీసులు పంపి యింట ర్వ్యూ పిలుపు వచ్చిన తరువాత గూడా యేమీ ప్రయత్నం చెయ్యకుండా వుండట మంటే 'యీనగాని నక్కలపాలుచెయ్య డమే కాదూ-' అనుకోగూడదు గనీ-

ఇట్లాంటి విషయాల్లో తనకు సల హాలూ సదుపదేశాలూ చేసే ఏకైక మిత్రుడు కిషన్‌లాలే- అందుకే ఆ పిలుపు జాబు తీసుకుని నేరుగా అతని దగ్గరకే వెళ్లాడు.

కిషన్‌లాల్ పిల్లలు నాలుగు- ఐదు గా త్రీలు ఆ కుంటున్నారు- చూసి అతని బిడ్డల ప్లానింగ్ విషయంలో తాననుకున్నది నిజమే కావడంతో సంతృప్తి చెందేడు సోమయాజులు.

ఇంతలో ప్రత్యక్షమై రెండుచేతులూ జోడించి- "నమస్కారం ప్రియ మిత్రు లకు-" అన్నాడు కిషన్‌లాల్ హిందీలో- "ఎలా సేవించగల్గతాను మిమ్మల్ని!"

తనకూ అట్లా ఘుమఘుమలాడే హిందీలోనే మాట్లాడాలన్పించి- "అచ్- సేవానహీఁ మేరా ముఖ్‌నహీఁఉమ్హారా సల్లాకా వాస్తే అయాహూఁ తెరీ అంగ్ నేమే-" అన్నాడు సోమయాజులు.

ఇంట్లోకి తీస్కెళ్ళాడు కిషన్‌లాల్. శ్రీమతి కిషన్‌లాలూ పిల్లలూ చప్పున లేచి వంటగదిలోకి పోయినారు.

పడక్కుర్చీలో తనూ, మడత కుర్చీలో కిషన్‌లాలూ కూర్చున్నాక సంగతిచెప్పేడు సోమయాజులు.

ఇంటర్వ్యూ పిలుపు చూశాడు కిషన్ లాల్, ఆ తరువాత కళ్ళజోడు తీసి ఒక చేత్తో పట్టుకుని మరో చేతి వేలన-మడియు- చూపుడు వ్రేళ్ళు కనురెప్పలపై వుంచి ధ్యానమగ్నుడిలా వుండిపోయినాడు- తరువాత మామూలు భంగిమలోకి వచ్చి "నా కొక ఆలోచన కల్పిస్తున్నాదా రాముడు సోమయాజులుగా రూ- మరి మీకు అది ఆమోదయోగ్యంగా అన్పిస్తుందో లేదో గాని-" అని ఆగిపోయినాడు.

"అయ్యయ్యో- అంతకంటేనా- చెప్పండి చెప్పండి- ఏ పుట్టలో ఏ పాముందో!"

ఆ పాముని కాస్తా బైటికి లాగేడు కిషన్‌లాల్- "మా వాళ్ళకి తెలిసిన పోలి




టీషియనా కాయమన్నాడు— ఇట్లాంటి పైరవీలంటే ఆయనకి కొట్టిన పిండి—కాక పోతే—" విద్యుత్సరఫరా ఆగిపోయినట్లు ఆగిపోయినాడు.

"కొంచెం చెయ్యి తడపాల్సుంటుంది—ఔనా—" వ్యవధి తీసుకోకుండానే పూర్తి చేశాడు సోమయాజులు— "ఎందాకా పోవచ్చునంటారు?"

"అహఁహఁ— నాకు జ్ఞాపకం వొచ్చిన సంగతి చెప్పేను— మా కాలనీలో నలుగురైదురికి ఆయన అనుగ్రహంతోచే వుద్యోగాలు దొరికినయ్. ఆ సంగతి మాత్రం నే నెరుగుదును—పోతే వివరాలూ అంతే నాకు తెలియదు—"

కిషన్‌లాల్ చేతుల్ని తన రెండు చేతుల్లోకి తీస్కున్నాడు సోమయాజులు. "బాబ్బాబు— మీరు నా గురించి చెప్పొద్దురూ— ఆవేవో వివరాలు కనుక్కొచ్చేరంటే ఎక్కడేనా తల తాకట్టుపెట్టేనా సర్దుకోవచ్చు—"

"అట్లాగే" అన్నాడు కిషన్‌లాల్.

అన్నందుకు హైదరాబాదు వెళ్లొచ్చేడు—వివరాలన్నీ సేకరించుకు వచ్చేడు.

ఉద్యోగం స్కేలు ప్రకారం చూస్తే మొదటిజీతం పన్నెండొందలకి తక్కువ గాదు. ఇటువంటి కేసుల్లో సాధారణంగా అతగాడు ఏడెనిమిది వేలదాకా తీసుకుంటాడు— అయితే కిషన్‌లాలూ అతని బంధువులూ చొరవతీసుకుని కొంచెం కనికరం చూపించాల్సిన కేసు అని చెప్ప

దంతో ఏడువేలకి దిగేడు.

"నాలుగువేలు మొదటే చేతిలో పెట్టి వుంటుంది. మిగతావి అర్ధరు చేతికందిన నెలరోజుల్లో నెమ్మదిగా సర్దొచ్చు గానీ నమ్మకంగా–" అన్నాడు కిషన్‌లాల్.

ఎంత స్నేహితుడైతేనేం ఆ వార్తతో ఒక్క–సారిగా సోమయాజులుముఖంలోని నెత్తుటిసంతా పిండేశాడు కిషన్‌లాల్.

స్నేహితుడిచ్చిన మంచినీటి గ్లాసందుకున్నాడు సోమయాజులు– ముఖాన చల్లుకోవాలో– గొంతు తడుపుకోవాలో– చేత్తో వొదలాలో క్షణం తోచలేదు తెప్పరిల్లుకుని మొత్తల్దాకా వెళ్ళి కాస్త ముఖాన చిలకరించుకొని మిగతావి తాగేశాడు.

మర్నాడే భార్య మెళ్ళో నానుతాడూ, తనచేతికున్న వెంకటేశ్వరస్వామి వుంగరమూ అమ్మాయికి చేయించిన ఒంటిపేట గొలుసూ– బాంక్‌లో పెట్టి "బంగారం అప్పు" మూడువేలూ జీతంరాగా నే నూటికి మూడురూపాయల వడ్డీతో యిస్తానని పన్నెండొందలూ పోగుచేసి కిషన్‌లాల్– చేతికిచ్చాడు.

ఇబ్బంది ముఖం పెట్టేడు కిషన్‌లాల్. "ఇది డబ్బుతోకూడిన వ్యవహారం సోమయాజులుగారూ.మీరూ స్వయంగా వొస్తే బాగుంటుంది–అంతా సక్రమంగా నడిస్తే మనిద్దరికీ ఆనందమేననుకోండి– అహా కిడెంచి మేలెంచమంటారు గదా– కాబట్టి మీరేవొస్తే బాగుంటుంది– వెంట నేనూ వుంటాను–"

సోమయాజులు కండ్లు టపటపలాడించి అన్నాడు– "ఈనాడు మీకంటే నాకు ఆప్తులెవరూ లేరు– యీ డబ్బు ఎట్లా అమరిందో మీకు తెలుసు–ఇహ కీడూ–మేలూ అంటారా– మా ప్రాప్తం ఎట్లా వుంటే అట్లా జరుగుతుంది. ఈ పని మీ చేతుల మీదుగా జరుగుతుందని నాకో విశ్వాసం కుదిరింది ఈ కాస్త శ్రమా మీరే తీసుకోవాలి–"

ఇక కిషన్‌లాల్ రెట్టించలేదు. స్నేహపూర్వకంగా సోమయాజులు చేతిని నొక్కి– "అ రాముది యిచ్చ–!" అన్నాడు.

"మన ప్రయత్నం మనం చేస్తున్నాం– ఆపైన ఆ ఏడుకొండలవాడి దయ!" అన్నాడు సోమయాజులు.

ఆ శ్రీరాముడికీ– ఏడుకొండల దేవుడికీ పరస్పర పరిచయం వుందో లేదో గాని మిత్రులిద్దరు కలిసి వారిద్దరికీ సంయుక్తంగా యీ బాధ్యతను కట్టబెట్టేరు.

కిషన్‌లాల్ ఆ రోజే బయల్దేరి హైదరాబాదుకు వెళ్ళేడు.

మర్నాడు అతను పటీనుంచి వొచ్చేలోగా సోమయాజులు గుండెల్లో పాసెంజర్లూ, గూడ్సులూ, ఎక్స్‌ప్రెస్‌లూ ఎన్ని

పరిగెత్తాయో లెక్కలేదు. ఆ రైళ్ళన్నీ అయన శ్రీమతి, పెద్దబ్బాయీ, పెద్ద మ్మాయీ మొదలైన స్టేషన్లన్నింట్లోనూ ఆగినయ్.

వస్తూ వస్తూ కిషన్‌లాల్ రానున్న వుద్యోగపు బయానాలాగా బాంబేహల్వా తెచ్చేడు.

ముందుగా ఆ స్వీటులోంచి ఓముక్క తీసి కిషన్‌లాల్ నోటిని తియ్యబరచి— "మీ ఋణం ఎలా తీర్చుకోగలను—వచ్చే జన్మలో మీ కడుపున పుడ్తాను—"అన్నాడు సోమయాజులు.

శ్రీమతి కాన్పులప్పుడు పడ్డ యాతన గుర్తొచ్చింది కిషన్‌లాల్‌కి - ఎంత కృతజ్ఞతవున్నా సోమయాజులు ముచ్చట తీర్చడం తనవల్లనైతే కాదనుకున్నాడు—వచ్చే జన్మలోగానీ— ఆటావల జన్మలో గానీ.

నాటినుంచి మూడోరోజున యింట ర్వ్యూకి వెళ్ళివచ్చేడు శ్రీనివాసు.

అభ్యర్థులందరిలో ఎక్కువసేపు తననే యింటర్వ్యూ చేయడమూ—వాళ్ళ కఠినమైన ప్రశ్నలడగటమూ— వాటన్నిం టికీ తను టకటక సమాధానం చెప్పడమూ ఇంటర్వ్యూగదిలోంచి బైటికి వస్తుండగా చాలామంది అభ్యర్థుల ముఖాన అసంతృప్తిని తను కనిపెట్టడమూ— వివరించేడు శ్రీనివాసు.

సోమయాజులు గుండె ఎక్స్‌ప్రెస్ వెళ్ళిపోయిన ప్లాట్‌ఫాంలా తేలికబడ్డది కానీ ఎక్కడో ఓ మూల వుద్యోగం గురించిన సందేహం 'ఔటర్' మలుపు దగ్గర యింజన్‌లా కన్పిస్తూండే చెట్ల గుంపులో వుండిపోయింది.

ఇంతలో సోమయాజులు చిన్న కొడుకు వొచ్చి తండ్రిఎదుట నిల్చున్నాడు.

"ఏం బాబూ - నువ్వింకా కాలేజీకి వెళ్ళలేదూ— టైం కాలేదూ?" అన్నాడు కిషన్‌లాల్—

కిషన్‌లాల్‌కు తల వూపుతో సమా ధానం చెప్పి అన్నాడు చిన్నాడు— "డాడీ నాకో రెండొందలు కావాలి—"

ఆ ఆశ్చర్యంలో ముఖం చిట్లించడం మరచిపోయాడు సోమయాజులు— "రెండొందలా?—"

"ఔను—" దృఢంగా సమాధానం వచ్చింది—"రెండొందలు సరిపోతయ్యేవి గాదు— కనీసంగానే— మా కాలేజీ ఎన్ని కల్లో నేను సెక్రటరీగా పోటీ చేస్తున్నాను.

ఇప్పుడు ముఖం చిట్లించేడు సోమ యాజులు— "మతిగాని పోయిందేవిట్రా నీకు— మొదటి సంవత్సరంలో రెండు సబ్జెక్ట్సు పోయినయ్— ఇప్పుడేమో ఎల క్షన్లో నిల్చుంటా నంటావా? ఎలక్షన్లు, పిలక్షన్లు మనకేమీ అక్కర్లేదు. ఇప్పటి

త్రైనా బుద్ధితెచ్చుకుని కాస్త చదువుమీద ధ్యాస నిలుపు-చదువు కపోతే ఎందుకూ పనికిరాం మనం-" అని ఒకటి రెండు మంచి ఉదాహరణలు గూడా చెప్పా లన్పించి అన్నాడు- "ఆ ఎదురింటి శంక రయ్యగారి అమ్మాయి చూడు-ప్రతి క్లాసు లోనూ- ప్రతి సబ్జక్టులోనూ-"

కిషన్‌లాల్ నవ్వు విని ఆపి యిటు చూశాడు సోమయాజులు.

చిన్నాడు ఎదురుగా లేడు-

ఆశ్చర్యంలోంచి రెండు క్షణాల క్రితమే చిరుకోపంలోకి వచ్చాడా సోమ యాజులు పాపం! కోస్తయినా తెరపి లేకుండానే వెంటనే నిస్పృహలోకి వెళ్ళి పోవాల్సొచ్చింది- "అయ్యా- బాబూ- ఇదిగో చూశారుగా- వీణ్ణి గురించే నాకు పట్టింది దిగులు- ఆ మెట్రిక్ ఏదో తిప్పలు మార్కులతో మిడితేడు. ఇంటర్ మొదటేడువి రెండు సబ్జక్టులలాగే వుండి పోయినయ్. అస్తమానమూ ఓ పదిహేను యిరవైమంది గాంగు వీడివెంట- నెల వాచ్చించంటే పొద్దున పోతాడు దీపాలు పెట్టేక వస్తాడు- లేకపోతే క్రికెట్టం టాడు. ఇదిగో యిప్పుడేమో ఎలక్షన్లో పోటీ చేస్తాట్ట- నా లక్షం లేదనుకోండి- తల్లేమైనా అంటే తిండి మానేస్తాడు-"

బాధ సేవచ్చింది తన డైలాగుకోసం ఎదురు చూస్తున్న పాత్రధారిలా - "వ్వ్- చిన్నతనంలెండి-" అన్నాడు కిషన్‌లాల్.

రోజులు గడచిన- ఒకటి- రెండు- నాలుగు- అయిదు- వారం అయింది యింటర్వ్యూ గడచి-

ఆ లోచనలు పరుగెత్తినయ్ సోమయాజులు మనసులో. చూస్తూ చూస్తూ నాలుగువేలు సమర్పయామి చేసుకున్నాడు తను. మరి ఆ వుద్యోగం వాస్తుందో మొరాయిస్తుందో?

మళ్ళీ గూడ్సులూ. ఎక్స్‌ప్రెస్‌లూ, రైళ్ళరాక యథావిధిగా మొదలైంది సోమయాజులు గుండెల్లో.

"ఇంట్లో యే ఖర్చు కావాలన్నా పైసాకి పైసా లెక్కలు దీస్తారు నాలుగు వేల రూపాయీలు తీసుకుపోయి వాడెవడో వల్లకాట్లో రామరుద్రాయి మొహాన కొట్టేరు-" అంటూ సాధించటం మొదలెట్టింది శ్రీమతి.

నాలుగు రోజులింకా హడలగొట్టి, ఉద్రిక్తతలో పెట్టినాక నవ్వుతూ ఓ మధ్యాహ్నం వచ్చింది సెలెక్షనూ- ఆర్డరూ.

ఈ నాలుగు రోజుల్లో పరిపరివిధాల ఆలోచించినందుకు, చెంపలు వాయించు కున్నాడు సోమయాజులు.

తనుగూడా టపాటపా చపేటాలతో దండం పెట్టింది ఆయన శ్రీమతి.

శ్రీనివాసు ఆ సాయంత్రం ముఖం



రెండుసార్లు రుద్ది- తల మూడుసార్లు దువ్వి - నాలుగుసార్లద్దంలో చూసుకుని మరీ బైలుదేరేడు బజారుకి.

చిన్నవాడు మాత్రం తండ్రిపట్ల నిష్ఠురాన్ని చూపుల్తోనే వీలైనంత స్పష్టంగా తెలియజేస్తున్నాడు.

ఆదివారంనాడు కిషన్‌లాల్‌ని వెంట తీసుకుని బయలుదేరేడు సోమయాజులు అపద్బాంధవుడిలా వొచ్చి వుద్యోగం యిప్పించిన పెద్దమనిషికి కృతజ్ఞతలు తెలియజేసుకోడానికి.

"ఆ గిరిగారు కావడానికి వయసులో మనకంటే కొంచెం చిన్నవాడే అయుం డొచ్చు కానీ—అబ్బ ఎంత నిదానస్తుడండీ మనిషి! చెప్పిందంతా వోపిగ్గా వింటాడు—ఫలానరోజున కలండి అని మీతో అన్నా డంటే ఆ రోజున మీరు వెళ్ళగానే ముందాయనే పేరుతో పలకరిస్తాడు—ఒక సారి చూశాడంటే యిహ ఆ మనిషిని మరచిపోడనుకోండి—" రాయలసీమ ఎక్స్‌ప్రెస్‌లో కూర్చున్నాక చెప్ప సాగేడు కిషన్‌లాల్.

"ఇంతకీ ఆయనేంచేస్తున్నారు కిషన్ లాల్‌జీ?"

"అయ్యో—సోమయాజులుగారూ—ఏమైనా చెయ్యాల్సిన అవసరం ఆయనకేముం దండీ, ఒకటర్మ ఎమ్మెల్యేగా వున్నాడు—మునిపల్ కౌన్సిలర్‌గా వున్నాడు—మా నగర్‌వాళ్ళేకాదు సిటీలో ఎక్కడెక్కడి వాళ్ళో పనులు చేయించిపెట్టమని ఆయన దగ్గరకొస్తుంటారు. ఉదయం ఆరింటిక ల్లా స్నానం పూజా ముగించుకుని సిద్ధంగా వుంటాడాయన విజిటర్స్‌కోసం. తొమ్మిది—తొమ్మిదిన్నర దాటిందంటే రాత్రి పదింటిదాకా దొరకడు మనిషి—"

"ఇంతకీ—యివ్వాళ మనకి దొరుకు తారంటారా?"

"దొరుకుతాడులెండి—ఇవ్వాళాదివారం కదా—ఆఫీసులన్నింటికి సెలవేనాయె—"

బేగంపేటలో దిగి సికింద్రాబాదులోని గిరిగారింటికి వెళ్ళేసరికి తొమ్మిదైంది.

గిరిగారింట్లోనే వున్నారు.

అయిదారుగురు విజిటర్స్‌రూంలోంచి అప్పుడే బైటికి వెళ్ళిపోవడంతో తనూ యింట్లోకి వెళ్ళబోతూ వీళ్ళని చూసి ఆగిపోయినాడు.

చూడగానే గుర్తుపట్టి—"రా—కిషన్ లాల్—రా నీకొండేటుపని అయింది గదా?" అన్నాడాయనే.

"చిత్తం—చిత్తం—అయిపోయిందండీ తమకి కృతజ్ఞతలు తెలియజేసుకోడానికి వచ్చామండీ—వీరు కొండేటు తండ్రి—"

మళ్ళీ వోసారి నమస్కరించి తను తెచ్చిన నేతిమిఠాయి ప్యాకెట్టు గిరిగారి చేతిలో వుంచేడు సోమయాజులు—మీ మేలు మరచిపోలేను—మా యింట్లో అందరిమంచీ మీకు కృతజ్ఞతాభివంద నాలు—దయవుంచండి—"

నవ్వుతూ తలూపేడు గానీ అన్య మనస్కంగా సోమయాజులు ముఖంకేసే చూస్తూ వుండిపోయినాడు గిరిగారు. కొన్నిక్షణాలు పోయినాక—"తమ పేరేంటన్నారు?" అన్నాడు.

"సోమయాజులండీ—నేను కాండూరు పంచాయతీ సమితిలో యూ. డీ. గా పనిచేస్తున్నాను.

'ఔ'నన్నట్లు సాత్వ్యంగా తలూపేడు కిషన్‌లాల్.

గిరిగారిచూపు యింకా అదే ధోరణిలో వుంది- "సోమయాజులుగారు గదూ? ఔనౌను- తమరు కేశవ్ మెమోరియల్ స్కూల్లో చదివేరు గదూ?"

చకితుడైనాడు సోమయాజులు. ఎక్కణ్నుంచో కొత్త ప్రాణం శరీరంలోకి ప్రవహిస్తున్నట్లన్పించిందతి సోమయాజులుకు- "చిత్రంచిత్రం-ఔనండీ" అన్నాడు సంతోషంతో.

అప్పటిదాకా నిల్చునే వున్నారు.

"కూర్చోండి - కూర్చోండి-" అని కూర్చోబెట్టి రెండు క్షణాలు యింట్లోకి వెళ్ళొచ్చి తన టేబిల్ విడిచి సోమయాజులు ప్రక్కనున్న కుర్చీలో కూర్చుని- "నేను మీకంటే మూడు సంవత్సరాలు జూనియర్ని- పండిత్ రావ్ సాబ్ హెచ్చమ్ వుండె అప్పుడు-" అన్నాడు గిరిగారు.

కొంచెం ప్రాణం లేచొచ్చింది సోమయాజులకు- "అలాగా- చాల సంతోషం- చాల సంతోషం-"

"మీరు చిక్కడపల్లిలో వుంటుంట్రి గదా- మీరున్న యింటెదురుగ ఒక పాత పెంకుటిల్లు వుండె- యాదున్నదా? మా నాయినగారు వజీర్‌సుల్తాన్‌ల పని జేస్తుండేవాడు. అదేయింట్ల వుంటు నేను మా యన్నా కేశవ్ మెమోరియల్ స్కూల్లో చదువుకుంటూంటిమి- మా యన్న పేరు తిరుపతయ్య-"

ముప్పైయేండ్ల క్రితం-చిక్కడ్‌పల్లి-తను అద్దెకున్న ఆ యిల్లూ- ఎదురుగా పాతబడ్డ ఆ పెంకుటిల్లూ- ఆ యింట్లోవి తనకంటే ఒకే సంవత్సరం జూనియరైన తిరుపతయ్యా- ఆ బొమ్మలన్నీ సినిమా వేసినట్లు గిర్రున సోమయాజులు స్మృతిపథాన తిరిగినయ్.

"గుర్తుకొస్తూంది- తిరుపతయ్య-యేం చేస్తున్నాడిప్పుడు-?"

"ఫౌజులో చేరికొన్నాడు-ఇండిపెండెన్స్ వచ్చినాక యిప్పుడు సెక్యూరిటీ ఆఫీసరుగా వున్నాడు వజీర్‌సుల్తాన్‌లనే-"

"మీ- చెల్లెళ్ళు వాళ్ళు- మీ నాయన గారు?"

"మా నాయన కాలంజేసి యిరువై సంవత్సరాలు దాటింది- మా చెల్లెండ్లిద్దర్నీ నేనే పెండ్లిండ్లు జేసిన- ఒకాయనకి కంట్రాక్టు లిప్పించిన- యింకొకాయనతో దుకనం పెట్టించిన- మాయమ్మగారుగూడ నా దగ్గర్నే వుండె. సంవత్సరమైంది కాలంజేసి- నేను మెట్రిక్‌తోటె చదువాపేసి పియాసత్‌ల దిగితిని- ఒక టర్మ్ ఎమ్మెల్యే జేసినాను- కొన్నాళ్ళు మునిసిపాల్టి కౌన్సిలర్‌గ వున్న-"

సోమయాజులు మనస్సు ముందుకూ వెనక్కూ తిరుగుతూ బొమ్మల్ని చూస్తోంది. ఆ పాత పెంకుటిల్లూ—ఖాగాకు కంపెనీలో పనిచేస్తూ రోజూ సాయంత్రం తాగి యింటికొచ్చి ఒక దృశ్యాన్ని చూపించే ఆ పెద్దమనిషి—చింపితలలతో చిరిగిన పరికిణీలతో తిరుగాడిన ఆ ఆడపిల్లలూ— స్కూల్లో లీదరుగిరీ వెలుగబెట్టిన తిరుపతయ్యా—చిరిగినగుడ్డల్తో జులాయి తిరుగుడు తిరుగుతూ గిల్లీదండు ఆడుతూ అప్పుడు స్కూలుకొస్తూండిన యీ గిరి—యాదగిరీ—కదిలేబొమ్మల్లా గుర్తుకొస్తున్నారు.

"లోపలికి రా— యిల్లు జూపిస్త—" అని స్నేహంగా చెయ్యిబట్టి లేపి తీసుకు పోయినాడు గిరిగారు సోమయాజుల్ని.

భార్యా— పిల్లల్ని పరిచయం చేశాడు. ఖరీదైన ఆ డైనింగ్‌టేబుల్‌మీద తనతో బాటు కూర్చోబెట్టుకుని ఉపాహారం తినిపించేడు.

అనుకోని యీ పరిణామానికి కలిగిన విస్మయంనుండి తేరుకో యత్నిస్తున్నాడు కిషన్‌లాల్.

"మీరు నాకు బాగా యాద్—" మళ్ళీ వచ్చికూర్చున్నాక మొదలేశాడు గిరిగారు. ఆయన కండ్లల్లో జ్ఞాపకాల మెరుపు కన్పిస్తోంది "డిబేట్లు— ఎస్సేరైటింగ్‌ల ఎప్పుడూ మీరే ఫస్టొచ్చేటి. ఒకసారి హిందూమతం లోపాలిని గురించి ఎవరో విమర్శచేస్తే— ఆయన శిలాఖాల మీద బెహిత్రీన్ జవాబు చెప్పుంటిరి— మీకు యాదుందకుండొచ్చిగాని నాక గనాబాగ యాదుండి—"

ఎందుకనో సోమయాజులు కండ్లు మసకబారినయ్ ఎక్కడి స్కూలు నాటి తను— ఎక్కడి యీనాటి తను—!! తనకు తనకే పోలిక కనబట్టంలేదు, మన సంస్కృతి— మన సాహిత్యం— మన సంప్రదాయం అంటూ జబ్బలు చరచుకుని— వాటికి స్వయం నియమిత ప్రతినిధిగా, సంరక్షకుడిగా, వ్యాఖ్యాతగా వుండిన ఆనాటి తనని— యీ జీవితం— దుర్వ్యాహ్యమైన యీ జీవితం— ఎట్లా ముక్కుతాడువేసి బరబరా ఎక్కడికో లాక్కుపోయి ఎందులోనో పడేసి— తన అభినివేశపు నడ్డి విరగొట్టి, అభిరుచి చెంపలు వాయించి, అభిప్రాయాల్ని ఆలోచనల్ని అవసరాల బరువుకింద అణగదొక్కి, 'మనో జీవితం'లోని మాధుర్యాన్ని పిల్చేసి, అనురక్తిని తుస్సుంచేసి....

అలసిన మనసుతో బలహీనంగా నవ్వేడు సోమయాజులు 'ఔ'నన్నట్లు.

గిరిగారు— యాదగిరి— యింకా జ్ఞాపకాల వూటనుంచి సోమయాజులు ప్రతిభని మాటల్లోకి తోడుతూనే వున్నాడు.

అ తరువాత ఉన్నట్లుండి సోమయాజులు చేయి పట్టుకుని ఒక్కణ్నే అవతలి గదిలోకి తీసుకుపోయి అడిగేడు గిరిగారు— "ఈ పైరవీ గురించి ఎంత యిచ్చుంటిరి తమరు?"

విస్తుపోయినాడు సోమయాజులు— చెప్పాలో వొద్దో తెలీలేదు— ఇందులో తనకి తెలీని మెలికలేమైనా వున్నాయేమో నని సందేహించేడు. అయినా గిరిగారు వయాన్నే బలవంత పెట్టడంతో చెప్పక తప్పలేదు.

కాసేపటికి మళ్ళీ వో కప్పు టీ వచ్చింది.

మళ్ళీ మళ్ళీ ఆయనకి కృతజ్ఞతలు చెప్పి బయలుదేరేడు సోమయాజులు

లోనుంచి సంచి వొకటి తెచ్చి యిచ్చేడు గిరి— నిమ్మ పండ్లూ— కరివేపాకూ— అరటికాయలూ— తమలపాకులూ నింపి— "ఇది బాకీకి యిచ్చినమస్తే చెప్పండి— ఎప్పుడైన సిటీకివొస్తే తీస్కరాండి— ఏమైన పని అవసరంబడ్తే రాండి—"

జీవితంలో ఏ పరిణామం, ఎట్లా, ఎంత అనూహ్యంగా వస్తుందో— మళ్ళీ వోసారి తెలియవచ్చింది సోమయాజులుకు.

ఇంటికి వొచ్చేశాడు సోమయాజులు అ సాయంత్రమే. కిషన్‌లాల్ పని వుందని సిటీలో వుండిపోయినాడు.

"అతనెవరో కాదు— నా చిన్ననాటి స్నేహితుడి తమ్ముడే— పరిచయస్తుడే, అతనే గుర్తుబట్టేడు నన్ను— ఎంత స్నేహంగా మాట్లాడేడో!" అంటూ భార్యకు చెప్పుకుపోయినాడు సోమయాజులు వివరాలన్నీ.

వింటూ సంచిలోని ఆకులూ కాయల్ని సర్దుతూన్నదల్లా విస్తుపోతూ — "ఇదేంటండీ?" అన్నది శ్రీమతి సోమయాజులు.

జేబురుమాల్లో చుట్టిన అ కవరు చూసి విస్మయచకితుడైనాడు సోమయాజులు.

తీసి చూశాడు— సరిగ్గా నాలుగువేలూ వున్నయ్. ఇది మిత్రుడు గిరి చేసిన పనే అని తెలిసిపోతోనేవుంది— 'అయ్యో!' అనుకున్నాడు— తను సరాసరి అతని దగ్గరకు వెళ్ళి మొహమాటంలో పెట్టిన ట్టైంది అన్పించింది.

"నిజంగా స్నేహితులంటే అట్లా వుంటారు చూడండి— పాపం ఎన్నేళ్ళ క్రిందట స్నేహమో. ఎంత గుర్తుంచుకున్నాడో!" అంది శ్రీమతి సోమయాజులు కన్నీళ్ళతో.

ఇంతట్లో యింటిముందు కలవరం విన్పించింది సోమయాజులుకు— బైటికి వెళ్ళి చూసేలోపున్నే చిన్నాడు లోపలికి వచ్చేడు.

అటు చూసిన సోమయాజులుకు వాకిట్లో యిరవై ముప్పైమంది_ చిన్నారి మిత్రుల సమూహం కన్పించింది.

ముద్దాయిలా తలవొంచుకు నిల్చుని "డాడీ_ మా ఫ్రెండ్సంతా వచ్చేరు_ నేను సెక్రట్రీగా పోటీచేసి తీరాలంటున్నారు_"

చిన్నారి వంక చూసింది తల్లి_ అపై సాలోచనగా భర్తకేసి చూసి అంది_ "పోనీయండి వాడంతగా ముచ్చటపడుతున్నాడు_ స్నేహితులంతా కావాలంటున్నారేమో_ నిలబడ్తే నిలబడ్నీండి_ ప్రపంచంలో ఎక్కడా ఎన్నికలు జరగడంలేదా_ ఎవరూ నిలబడటంలేదా_ పోటీ చెయ్యడం లేదా!"

మౌనంగా నిల్చుండిపోయినాడు సోమయాజులు. చేతిలో అ కవరు అట్లాగే వుంది.

అతని మనస్సులో అ క్షణాన ఎన్ని దృశ్యాలు మెదిలేయో_ ఎన్ని అభిప్రాయాలు సంఘర్షించాయో_ కరిగిపోయిన తన స్వప్నాలెన్ని జ్ఞాపకం వచ్చేయో_ జరగనున్న ఘటన ఎట్లా గోచరించిందో తెలీదు.

తండ్రిని అ స్థితిలో చూస్తూ ఆలోచనలో పడిపోయిన చిన్నాణ్ణి చూసి "నువ్వెందుకురా అట్లా పిచ్చాదిలా చూస్తూ నిలబడ్తావు! వెళ్ళు_ నిలబడ్తే నిలబడుదూగానిలే_ మీ నాన్నతో నే చెప్తాలే. కానీ తగాదాలు, పోట్లాటలూ మాత్రం తెచ్చుకోకండి నాయనా_" అన్నది శ్రీమతి సోమయాజులు.

అతి కష్టంమీద ఆణచుకున్నాడు సోమయాజులు 'అకారణం'గా పొంగుకొస్తూన్న కన్నీటిని.



# సూర్యోదయం

## మన్నెం శారద



హాల్లో ఈజీఛైర్లో కూర్చున్న రాఘవరావు చుట్టకొనను కసుక్కున కొరికి అన్నపూర్ణ వైపు చూసేడు.

గుమ్మానికి చేరబడి నిల్చున్న అన్నపూర్ణ తలదించుకుని వుంది. అంచేత అతని చూపుల్లోని తీక్షణతని ఆమె గమనించలేదు. కానీ.... అతడెంతగా వుడికిపోతున్నాడో మాత్రం ఆమెకి బాగా తెలుసు.

హాల్లో కిటికీకి పక్కన వేసివున్న బెంచీమీద కొందరు ఊరుపెద్దలు; దగ్గర బంధువులయిన హనుమాన్లు, పార్థసారధి కూర్చుని వున్నారు.

వీధి గుమ్మానికి పక్కగా రాఘవరావు భార్య కనకమ్మ, కూతురు జానకి కూడా నిలబడి వున్నారు

"చూస్తున్నావుగా. నీ కూతురు చేసిన నిర్వాకం!" అన్నాడు రాఘవరావు తీవ్రమయిన కంఠంతో.

అన్నపూర్ణ తలెత్తి అన్నగారివైపు చూసింది.

"ఇలాంటివి మన యింటావంటా వున్నాయా? పెళ్ళయిన మూడు నెలల్లోనే మొగుడుపోతే నువ్వెంత నీతిగా బ్రతికేవు! పరాయి మొగవాణ్ణి ఎన్నడైనా కన్నెత్తి చూసేవా? తొమ్మిది నెలలకి పుట్టిన బిడ్డని పెంచుతూ ఈ యింట ఎలా కాలం గడిపేవు! కానీ.... ఈ రోజు అది.... నా కొడుకు పోయేడో లేడో అప్పుడే మారు మనువుకి సిద్ధమయిందంటే.... దానికి ఎంత కావరమెక్కి వుందో ఆలోచించు!" అన్నాడు. ఆ మాటలు చాలా కఠినంగా బాకుల్లా దూసుకొచ్చేయి రాఘవరావు నోటినుండి.

అన్నపూర్ణ మాట్లాడలేదు.

"నిన్నయినా చూసి బుద్ధితెచ్చుకోమని

చెప్పమ్మా అన్నపూర్ణా! అసలే ఆయన చెట్టంత కొడుకుపోయి దుఃఖంలో మునిగి వున్నాడు. దెబ్బమీద దెబ్బగా ఈ పిల్ల వెంటనే పెళ్ళిచేసుకుంటే ఊరు 'ఛీ' కొట్టదూ! నీ తోబుట్టువు పరువు సంగతి ఆలోచించు!" అన్నాడు హనుమాన్లు శోక్యం చేసుకుంటూ.

"ఎందుకు చెబుతుంది! ఇదంతా ఆవిడకే మహా యిది!" అంటి కనకమ్మ చేతులు తిప్పుతూ!

అన్నపూర్ణమ్మ కనకమ్మవైపు అదోలా చూసింది.

పండక్కి పట్టుచీర కొనిపెట్టలేదని మొగుడిమీద అలిగొచ్చి— అర్నెల్లగా పుట్టింట్లో తిష్ఠవేసిన జానకిలాంటిదే తన 'శైలా' అని ఆమె వస్తే ఆలోచించదని అన్నపూర్ణకు తెలుసు!

"వాళ్ళకి నేనెంత చేసేనయ్యా! తల చెడి ఇది నా పంచచేరితే ఆరోజు నుండి దీన్ని — దీని కూతుర్ని కడుపులో పెట్టు కొని కాచలేదూ! దాన్ని ఏ కొరగాని వాడికో యిచ్చి కట్టబెట్టకుండా నా స్వంత కొడుకుకే చేసుకోలేదూ! మూడేళ్ళ కాపురం చేసిన దానికంత మరపొచ్చే సేదా మొగుడు! ఇదిగో, మంచిగా చెబు తున్నాను. నా మాట వినకపోతే భూమ్మీద మూకలు లేకుండా చేస్తాను దానికి! వెంటనే ఈ కాగితాలమీద సంతకాలు పెట్టి మర్యా దాగా ఇవ్వమను!" అంటూ రాఘవరావు అన్నపూర్ణకి కొన్ని కాగితాలు అందిం చేడు.

అన్నపూర్ణమ్మ వాటిని అందుకొని లోనికెళ్ళిపోయింది.

అన్నపూర్ణ వెళ్ళగానే హనుమాన్లూ, పార్థసారథి, వాళ్ళతోపాటు ఊరిపెద్దలు కూడ పైకిలేచేరు వెళ్ళడానికి.

"ఒప్పుకుంటుందిలే రాఘవ! చెట్టంత అన్నగార్ని వదలుకొంటుందా అన్న పూర్ణ! ఇదిగో ఆ దబ్బొచ్చేక నా సంగతి మరచిపోవుగా! నీ మీద భరోసా పెట్టు కొనే ఉలవపాడు సంబంధం ఖాయం చేస్తున్నాను సావిత్రికి!" అన్నాడు పార్థ సారథి

"సరిసర్లే! ముందు దాన్ని సంతకాలు పెట్టి ఏడ్వనీ!" అన్నాడు విసుగ్గా రాఘవ రావు జారిపోయిన చుట్టను మళ్ళీ వెలి గించుకుంటూ.

వాళ్ళిద్దరూ వెళ్ళిపోగానే జానకి తండ్రి దగ్గరగావచ్చి "ఎంతొస్తుందేంటి నాన్నా!" అంది గారంగా.

రాఘవరావు కూతురివైపు ముద్దుగా చూసి "చాలానే వస్తుంది! ఒక లక్ష కేష్, ఉండడానికో యిల్లు, చేసి వెలగబెడితే మీ వదినకు ఉద్యోగం " అన్నాడు.

"నన్ను కూడా అలా విమానాలు నడిపే వాడికిచ్చి చెయ్యాక అనవసరంగా పొలం

దున్నుకునేవాడికిచ్చి కట్టేరు! రేపేమన్నా అయితే నాకేం వస్తుంది పిండాకూడు!" అంటూ వాపోయింది జానకి.

*   *   *

అన్నపూర్ణ చెరువుగట్టున కూర్చుని దిండె తోముతున్నది.

ఎవరో కొంటెపిల్లవాడు విసిరిన రాయికి చెరువంతా అలలు చెలరేగేయి!

సరిగ్గా అన్నపూర్ణ అంతరంగమూ అలానే వుంది!

ప్రొద్దుటే అన్న వేసిన రాయికి ఆమె మనసంతా అల్లకల్లోలమయిపోయింది.

ఈ చిక్కు సమస్యని ఎలా విడదీసుకోవాలి?

ఒకపక్క కన్నకూతురూ! మరోపక్క అన్నగారు!

అన్నపూర్ణకి ఎటూ తోచడంలేదు!

గతమంతా ఆమె కళ్ళముందు గిర్రున తిరిగింది.

తనకి పదహారో సంవత్సరంలో కాబోలు— శేషగిరితో పెళ్ళయింది.

శేషగిరి పెద్ద అందగాడు కాకపోయినా చాలా మంచివాడు! అతని సాహచర్యంలో తనకి సుఖపడటం ఎలాంటిదో తెలిసింది!

సరిగ్గా అప్పుడే దేవుడు చూడలేకపోయేడు. పొలం నుండి తిరిగొస్తున్న అతను పాము కాటుకి గురయి మరణించేడు.

అంతటితో అప్పుడే వెలుగుని చూడ్డానికి అలవాటుపడ్డ తన జీవితంపై శాశ్వతంగా చీకటితెర పడింది.

అప్పటికే నెంతప్పిన తను అన్న పంచ చేరక తప్పలేదు!

తన పొలం— తన భర్త పొలం తిరిగి అన్నచేతికే చిక్కేయి!

వదినగారి దెప్పిపొడుపులతో— అన్నగారి ఈసడింపులతో తన హృదయం ఏనాడో మొద్దుబారిపోయింది.

మరో ఆరునెలలకి శైలజ పుట్టింది

శైలజకి పదో నెలలో ఫిట్సు వచ్చే సరికి బతకదనుకొన్నాను.

కన్నతల్లిని ఎరుగదు తను! తండ్రి ఊహ తెలిసేనాటికే పోయేడు!

కట్టుకున్న భర్త మూడునెలలు మురిపించి కన్నుమూసేడు!

ఇప్పుడు ఈ చివ్వరి వెలుగులు కూడ తీసేసుకుంటాడా ఆ భగవంతుడు?

తను సహించలేక పట్నంనుంచొచ్చిన ఇంగ్లీషు డాక్టరుకి చూపించమని అన్నగార్ని ప్రాధేయపడింది!

పట్టించుకోలేదతను!

"ఆ ముదనష్టపుది తండ్రి అయుష్షు పోసుకుని మరీ పుట్టిందిదానికేంకాదులే" అని ఈసడించి కండువా ఝూడించుకొంటూ మరీ వెళ్ళిపోయేడతను.

తను మరి భరించలేకపోయింది.

కనకమ్మ కొళ్ళా ప్రేళ్ళాపడి పది రూపాయిలు తీసుకుని బిడ్డను భుజాన వేసుకొని, జానకిని తోడు తీసుకుని అస్పత్రికి పరిగెత్తింది.

అప్పుడే తనకి డాక్టరు రాజా పరిచయ మయ్యేడు.

రాజా బిడ్డని పరీక్షచేసేడు.

వెంటనే హాస్పటల్లో ఎడ్మిట్ చెయ్యమని- పరిస్థితి ప్రమాదకరంగా వుందని చెప్పేడాయన.

జానకిని యింటికి పంపించేసి బిడ్డతో పాటు హాస్పటల్లో వుండిపోయింది మూడురోజులు।

ఆ మూడురోజుల్లో డాక్టరు మంచి తనాన్ని గ్రహించగల్గింది తను।

అతను తనదగ్గర నయాపైసా తీసుకోకపోగా తన బిడ్డని ఎంతో జాగ్రత్తగా కని పెట్టి ఖరీదైన మందులు వాడేడు।

చచ్చిపోతుందనుకొన్న తన శైలజ అతని వైద్యంలో తిప్పుకొంది।

అతనికి చేతులు జోడించి బిడ్డని తీసుకొని యింటికొచ్చింది।

పదిరోజుల తర్వాత చెరువు గట్టు మీద నిలబడి తనవైపే చూస్తున్న అతన్ని చూసి ఆదోలా అయ్యింది తనకి।

అడుగులు తడబడ్డాయి।

"మీరా!" అంది తను

"మీకోసమే అన్నాడతను" నవ్వుతూ.

ఆ కళ్ళు చిలిపిగా నవ్వినట్లనిపించింది తనకి.

తన గుండె దడదడ లాడింది. చేతిలోని నిండు నీళ్ళబిందె జారిపోబోయింది.

గబుక్కున పట్టుకున్నాడతను.

"అదేంటలా అయిపోతున్నారు! పాప గురించి అడగాలని వచ్చేనిక్కడే. మీరు కనీసం ఒకసారన్నా వచ్చి చెప్పలేదుగా" అన్నాడతను బిందెని తన నడుంమీద సరిగ్గా వుంచుతూ

సరిగ్గా ఆ దృశ్యం చెరువుగట్టున నీళ్ళకొచ్చిన కొందరు ఆడవాళ్ళ దృష్టిని దాటిపోలేదని తనకు తెలియదు;

వాళ్ళ కనుబొమ్మలు చూడరానిది చూసినట్లు పైకి లేచేయన్న విషయం తను గమనించలేదు।

తను తడబడుతూ ఇంటివైపు అడుగు లేసింది।

కాని ఆ రాత్రి నిద్రపట్టక దొర్లుతున్న తన ఆలోచనల నిండా అతను జొరబడటానికి ప్రయత్నించేడు।

అతని గురించి ఆలోచించటం కూడ మహా పాపమని తల విదిలించుకొని కళ్ళు మూసుకుంది తను।

మర్నాటి నుండి తన ప్రమేయం లేకుండానే అతనెక్కడయినా కన్పిస్తే బాంగుండునని తన కళ్ళు అతనికోసం వెదుకులాట ప్రారంభించేయి.




అతన్ని చూడ్డానికి ఒకసారి హాస్పిటల్‌కి వెళ్ళాలనిపించేది.

అంతలోనే ఏదో భయం ఆవరించి ఆ ఆలోచనని అదిమిపెట్టేది తన హృదయం.

వారం రోజుల తర్వాత మళ్ళీ చెరువు గట్టు దగ్గరే కనిపించేడు తనకి.

దూరంగా వున్న పొగడచెట్టు క్రింద అతన్ని చూడగానే తన హృదయం గోదావరిలా ఉప్పొంగిపోయింది.

"బాగున్నారా?" అంటూ పలకరించేసింది తను.

అతను నవ్వి "నువ్వు?" అన్నాడు ఆత్మీయంగా.

నవ్వింది తను చాల రోజులకి తియ్యగా.

భర్త పోయేక తను అలా మనస్ఫూర్తిగా నవ్వడం అదే మొదటిసారి.

ఇద్దరూ అలా అకారణంగా నవ్వుకోవడం ఆ గట్టునవున్నవాళ్ళ హృదయాన్ని మండించేస్తున్నాయనే సంగతి తనకిగాని అతనికిగాని తెలియదు.

మరో పదిరోజుల తర్వాత శైలుని డాక్టరుకి చూపించడానికి హాస్పిటల్‌కి వెళ్ళింది తను.

శైలుని పరీక్షచేస్తూనే మెల్లగా అడిగేడతను "ఎన్నాళ్ళీ ఒంటరిజీవితం గడుపుతారు?" అని.

తను తల దించుకొంది.

అతడు శైలుని తనకి అందిస్తూ అన్నాడు.

"మిమ్మల్ని కించపరచాలని అడగటం లేదు. మూడునెలల కాపురం కోసం— మీ జీవితమంతా యిలా ఒంటరితనంతో బతకడంకన్నా వేరే నరకం మరొకటి వుండదు। మీరు అభ్యంతరం లేకపోతే నేను మిమ్మల్ని పెళ్ళిచేసుకుంటాను."

తనకి వళ్ళంతా చెమటలుపోసేయి।

ఏ సంగతీ చెప్పకుండానే కంగారుగా శైలునెత్తుకుని ఇంటికి వచ్చేసింది.

ఇంటికొచ్చినా గుండెదడ తగ్గలేదు తనకి.

తను వచ్చేసరికి హాల్లో వదినగారితో పాటు హనుమాన్లు పెళ్ళాం ఆదిలక్ష్మి, పార్థసారథి పెళ్ళాం పర్వతవర్ధని చెవులు కొరుకుతున్నారు.

వాళ్ళ ముగ్గురు తనని అదోలా చూసే సరికి భయంవేసింది తనకి.

"ఎక్కణ్ణుంచి?" అంది వదిన అరాగా.

"పాపని ఆసుపత్రిలో.... చూపించి వస్తున్నాను।" అంది తను.

"దానికేం మాయరోగమొచ్చిందని? ఆ వంకతో ఆ కుర్రడాక్టర్‌గాడితో సరసాలాడ్డానికా?"

వదినగారి హుంకరింపుకి తన గుండె జారి క్రిందపడినట్లయింది.

ఆమెవేపు నిస్సహాయంగా చూసింది.

"అదే మంచిపని వదినా। ఆ చెరువు గట్టుమీద సరసాలు అందరూ చూసి నవ్విపోకుండా।" అంది రాగంతీస్తూ ఆదిలక్ష్మి.

"నేను.... నేను ..ఏ పాపం ఎరుగను వదినా।" అంది తను కన్నీళ్ళతో.

"ఆ సంగతి నిప్పుమీద ఉప్పులా ఎగిరిపడ్తోన్న మీ అన్నగారికి చెప్పమ్మా। బయటకెళ్తే నల్గురూ అనేమాటలు విన లేక అవమానంతో బోనులో పులిలా గదిలో పచార్లుచేస్తున్నారు।" అంది వదిన గారు విష్ఫూరంగా.

"చెప్పు। ఈరోజు మీ యిద్దరి ప్రాణాలు తీసి నేను ఛస్తాను।వాడికీ.... నీకు.... ఎన్నాళ్ళనుండి సాగుతున్నందీ రంకు।" అంటూ అన్నగారు బయటకు వచ్చేసరికి నిలువెల్లా వణికిపోయింది తను.

"అన్నయ్యా।" అంటూ బావురు మంది తను.

"ఈ సంగనాచి ఏడుపుకేంలే। నా పరువు గంగలో కలిపేవు। బయట నన్ను తలెత్తుకోకుండా చేసేవు।" అంటూ ఇంతెత్తు లేచేరు అన్నగారు.

"నేను.... నేను.... ఏ తప్పు చెయ్య లేదు। అతను.... అతను.... నా కిష్టమైతే నన్ను.... పెళ్ళి....చేసుకుంటానన్నాడు.

అంతే!" అంది తను దుఃఖాన్ని అణిమి పెడుతూ.

"హవ్వ!" అంటూ నోరు నొక్కుకుంది వదినగారు.

"వెధవముండకి పెళ్ళి!" అంటూ దీర్ఘం తీసించి ఆదిలక్ష్మి.

"మా అమ్మ మొగుడుపోతే వీధి ముఖం చూసి ఎరుగదు! అంతా పిదప కాలం!" అంటూ అరవయ్యేళ్ళకి ముండ మోసిన తల్లిని తలచుకొంటూ గర్వంగా చెప్పింది పర్వతవర్ధని.

వాళ్ళ మాటలకి రెచ్చిపోయిన అన్నగారు తనమీద చెయ్యి చేసుకోబోయేడు.

వదినగారు లేచి అడ్డుపడింది.

"చాల్లెండి. ఇప్పటికే నల్గురికి చులకనయిపోయేం. ఆ వెధవను పిలిపించి మళ్ళీ దీని జోలికి రావొద్దని గడ్డి పెట్టండి" అంటూ సలహా యిచ్చిందావిడ.

ఆ మర్నాడు తన అన్నగారి కబురందుకొని అతను యింటికొచ్చేడు.

బయట హాల్లో పంచాయితీకి అంతా సిద్ధపడ్డారు.

"నా చెల్లెలికీ నీకూ ఏంట్రా సంబంధం?" తన అన్న మోటుగా అడగటం తనకి వినిపిస్తూనే వున్నది.

అతడా ప్రశ్నకు తెల్లబోయేడేమో! అయిదు నిముషాల తర్వాత జవాబు చెప్పేడు "మానవతావాదం!" అని.

"కథల్లా కబుర్లు చెప్పకు. దాన్ని నువ్వు పెళ్ళి చేసుకుంటాననటం అబద్ధమా!"

"నిజమే! ఇప్పుడు మీ ముందుకూడ అదేమాట చెబుతున్నాను. మీ రంగీకరిస్తే నేను ఆమెని పెళ్ళిచేసుకోడానికి సిద్ధమే!" అన్నాడతను స్థిరంగా.

అతని జవాబుకి తన గుండె కరిగి కన్నీళ్ళయి ప్రవహించింది.

నీరసంగా లేచి కిటికీలోంచి చూసింది అతనివైపు.

"ఏంట్రా కూస్తున్నావు? దాన్ని లేవదీసుకుపోయి సరదా తీరేక వదిలేద్దామనా?" అంటూ కొట్టడానికి లేచిన అన్నగార్ని గబుక్కున పట్టుకున్నాడు హనుమాన్లు.

"నీ కీవూరు కొత్తనుకుంటానబ్బాయి! వాళ్ళకుటుంబం సంగతి తెలియక తొందర పడుతున్నావు! మారు మనువంటే మారణ హోమమే వాళ్ళ యిళ్ళల్లో!" అన్నాడు హనుమాన్లు.

అతని ముఖం అవమానంతో ఎర్రబడటం తను చూడగల్గింది.

"మీ రెందుకింతగా బాధ పడిపోతున్నారో నాకు అర్థంకావడం లేదు. నిజంగా ఆలోచిస్తే మీ కందరికీ హృదయాలు లేవు! ఉంటే మూడునెలల కాపురానికే నూరేళ్ళు ఆమెని ప్రోమోడులా బ్రతకమని శాపించేవారు కాదు! సహృద

యంతో ఆమె మెడలో తాళి కట్టాలను కున్న నన్ను ఇలా అవమానించేవారు కాదు!" అన్నాడు రోషంగా.

"ఏంట్రా మాకు హృదయాల్లేవని లెక్కల్లేస్తున్నావు! నా చెల్లెలితో పెళ్ళికాదు కాదా-దాన్ని చూడ్డానిక్కూడ వీల్లేదు! అలా చేస్తే.... నీకు భూమ్మీద నూకలు చెల్లి పోయినట్లే! మర్యాదగా పో!" అంటూ రంకెలేస్తున్న అన్నగార్ని చూసి అతను తొణకలేదు!

"ఆ మాట చెప్పడానికి మీ రెవరు? అన్నపూర్ణని చెప్పమనండి!" అన్నాడు ధీమాగా.

"నా చెల్లెలు చెప్పాలంట్రా! నీకు మాటలతో బుద్ధిరాదు!" అంటూ మళ్ళీ పైకిలేచేడు తన అన్నగారు.

మళ్ళీ పట్టుకున్నాడు హనుమాన్లు.

"పోనీ అమ్మాయితోనే ఆ మాట చెప్పించు! చెప్పుతో కొట్టినట్లుంటుంది!" అన్నాడు పార్థసారథి.

ఆ మాట విని తన గుండె గడగడ లాడింది.

తన అన్నగారు గుమ్మంలో నిలబడ్డ వదినవైపు చూసేడు.

ఆమె అర్థమైనట్లు తల పంకించి లోపలి కొచ్చింది.

"అతను విన్నేదో అడుగుతాడట రా!" అంటి తన చెయ్యి పట్టుకొని.

తను బలిపశువులా వదినగార్ని అనుసరించింది.

"అన్నపూర్ణా!" అన్నాడతను ఎంతో ఆత్మీయంగా.

తను తలెత్తి చూసిందతనివైపు.

అతని ముఖంలో తనపట్ల ఎంతో విశ్వాసం, ప్రేమ కనిపించేయి తనకి!

"నా మీద నమ్మకముంటే ఈ క్షణం బయటకి వచ్చేయి!" అన్నాడతను

తను అన్నగారివైపు చూసింది.

అతని కళ్ళలో భయం, కోపం, అస హాయత మిళితమైవున్నాయి!

తను మెల్లిగా రాజువేపు అడుగు లేసింది!

తను . తను . తన మనసుకి విరుద్ధంగా రాజుని చెంపమీద లాగి లెంప కాయ కొట్టి గిర్రున వెనుతిరిగి ఇంట్లోకి పరిగెత్తి మంచమ్మీద వాలి భోరున ఏడ్చింది.

"సెభాష్!" అంటూ మెచ్చుకున్నాడు హనుమాన్లు

"నోరు విప్పకుండా జవాబు చెప్పింది!" అన్నాడు పార్థసారథి.

"అది నా చెల్లెలు!" అన్నాడు అన్న గారు గర్వంగా.

"ఇక వెళ్ళిరా నాయినా! తెలిసిందిగా మా కుటుంబం అంటే ఏమిటో!" అంటూ వదినగారు వెటకారం చేసింది.

శైలజ తల్లి అందించిన కౌగిలాన్ని విసురుగా విసిరేసింది. అన్నపూర్ణమ్మ విభ్రాంతంగా నిలబడి చూసింది కూతురి వైపు.



అతను వెళ్ళిపోతున్నట్లుగా అడుగుల చప్పుడు!

తన కళ్ళనుండి అశ్రుధార ముత్యాల సరాల్లా జారిపోయింది!

ఆ రోజునుండి ఈ రోజువరకు తనకి ఏడుపే మిగిలింది!

రాజుని పోగొట్టుకున్నందుకు తను కుమిలిపోని క్షణం లేదు!

తిరిగి తన దీనస్థితే తన కన్నకూతురికి కూడ పట్టింది!

— అన్నపూర్ణ ఆలోచనలనుండి బయటపడి వీళ్ళింటికెళ్ళేటో ఇంటివేపు అడుగులేసింది.

• • •

"అమ్మా!" అంటూ బావురుమని ఏడ్చింది శైలజ.

అన్నపూర్ణమ్మ కూతురి తలపైన చేత్తో మృదువుగా నిమిరింది.

"ఈ కౌగిలాల మీద సంతకం పెట్టేకన్న యిద్దరం కలిసి ఇంత విషం మింగి చచ్చిపోదాం. మావయ్యకి అంతా అప్పజెప్పి మనసు చంపుకుని ఈ కొంపలో ఊడిగం చేసేకన్నా అదే నయం!" అంది శైలజ ఆవేశంగా.

"అనిరుద్ధ మీద నమ్మకముందా నీకు!" అన్నపూర్ణ కూతురి కళ్ళలోకి నిశితంగా చూస్తూ అడిగింది.

"నా పెళ్ళి జరిగి మూడేళ్ళయినా

అతను పెళ్ళి చేసుకోకుండా వుండిపోవడంలో అతనికి నా పట్ల వున్న ప్రేమ అర్థంకావడంలేదా అమ్మా! ఆ రోజు భస్తే బావని పెళ్ళిచేసుకోలేనని ఏడ్చినా నా మాట వినకుండా మామయ్య భంపేస్తాడని మెడలు వంచి నాకీ పెళ్ళి చేసేవ్! అనిరుద్ధ మరో కులంవాడని భయపడ్డావ్! సమాజానికి, మామయ్యకి వణికిపోతూ ఆస్తంతా అతని చేతిలో పెట్టి కిక్కురుమనకుండా అతను పెట్టిన బాధలన్నిటినీ భరించేవు! మామయ్య నన్ను నా మీద ప్రేమతో తన కోడల్ని చేసుకోలేదన్న సంగతి నీకూ తెలుసు! విమానాలు నడిపే అతని జీవితం ఏ క్షణం అంతమవుతుందోనన్న భయంతో ఎవరూ అతనికి పిల్లనివ్వకపోతే నా మీద కన్ను వేసేడు! ఈ దెబ్బతో మన పొలం కూడ పర్మినెంటుగా వాళ్ళ చేతికి చిక్కిపోతుందని తెలుసు! ఈ రోజు ఇంత జరిగినా అనిరుద్ధ నా మీద మునుపటి ప్రేమతోనే వున్నాడు నన్ను తప్ప మరో వ్యక్తిని జీవితంలోకి ఆహ్వానించననే మొండిపట్టుతో వున్నాడు." అంటూ ఆగింది శైలజ.

"ఈ విషయాలన్నీ నాకు తెలుసమ్మా!" అంది అన్నపూర్ణ చాల నిదానంగా.

శైలజ తల్లివైపు ఆశ్చర్యంగా చూసింది.

"తెలిసికూడ నన్ను ఆ ఉరికంబం ఎక్కించడానికే సిద్ధపడుతున్నారు?" అంది బాధగా.

"నీకు తెలీదు- మీ మామయ్య నక్క కన్న హీనం. తను అనుకున్నది జరగకపోతే నీ బ్రతుకునే బలిచేస్తాడు! అది నేను కన్నతల్లిగా భరించలేను!" అంది అన్నపూర్ణ బాధగా.

శైలజ తలదించుకొని ఏడ్చింది చాలాసేపు.

"సరే నీ యిష్టం! కానీ నీకు తెలీనిది ఒకటుందమ్మా! సిగ్గు విడిచి చెబుతున్నందుకు క్షమించు! బావతో పెళ్ళయి మూడు సంవత్సరాలయినా నేను అతనితో కలిసి కాపురం చేసింది కొన్ని రోజులు మాత్రమే! అదీ యిష్టంలేని కాపురం! 'ఆ జీవితమే నీకు చాలు' అని కన్న తల్లిగా నువ్వు కాసిస్తే కాదనేదేముంది?"

శైలజ వేసిన ఆఖరు అస్త్రానికి విలవిలలాడింది అన్నపూర్ణ తల్లి హృదయం.

శైలజ ఆవేశంగా సంతకాలు పెట్టబోతున్న ఆ కాగితాన్ని లాక్కొని కూతురి కళ్ళు తుడిచింది అన్నపూర్ణ.

తల్లి చర్యకి ఆశ్చర్యపడి చూసింది శైలజ.

అన్నపూర్ణ ఆ కాగితాన్ని గబగబ పరుపుక్రింద పెట్టి వంటగదిలో కెళ్ళి

మంచినీళ్ళ బిందె తీసుకుని చెరువు వేపు వెళ్తోంటే "ఈ వేళప్పుడు నీళ్ళేవిటి? ప్రొద్దుటే తెచ్చావుగా!" అంది కనకమ్మ సాగదీస్తూ

"ఏదో పురుగు పడింది వదినా!" అంటూ అన్నపూర్ణ చకచకా బయటకి నడిచింది.

* * *

సూర్యోదయం కాకముందే హనుమాన్లు, పార్థసారధి వచ్చి హాల్లో బెంచీమీద కూర్చున్నారు.

"ఏం జరిగింది!" అడిగేడు పార్థసారధి ఆత్రుతగా.

"ఏదీ యింకా, మీ రందరూ వచ్చేక అడుగుదామని ఊరుకున్నాను!" అన్నాడు రాఘవరావు వాలుకుర్చీలో నడుం వాలుస్తూ.

"త్వరగా తేల్చు మరి! సంతకాలు పెట్టడానికి ఎన్నాళ్ళు కావాలి!" అంటూ తొందరపెట్టేడు హనుమాన్లు

"అన్నా!" అంటూ కేక పెట్టాడు రాఘవరావు లోపలికి తొంగిచూస్తూ.

వంటగది గుమ్మంలో కూర్చుని వంకాయలు తరుగుతూన్న అన్నపూర్ణ తల తిప్పలేదు.

అన్నగారి పిలుపు వినికూడ తొణక్కుండా కూర్చున్న ఆడపడుచుని చూస్తే ఆశ్చర్యమేసింది కనకమ్మకి.

"విన్నే, మీ అన్నయ్య పిలుస్తున్నారు! వినబళ్ళేదా!" అంది నవ్వడానికి ప్రయత్నిస్తూ.

ఎలాగోలా తమ పని జరిపించుకోవడమే ఆమె ధ్యేయం.

"వినబడింది!" అంది తల యెత్తకుండానే మరో వంకాయ తరిగి నీళ్ళలో వేస్తూ.

కనకమ్మకి లాగి లెంపకాయ కొట్టా లనిపించింది.

"వెళ్ళు మరి, అవతల పెద్దమనుషులు నీ కోసం నిలబడి వున్నారు!" అంది గొంతులోకి ఎక్కడలేని మార్దవాన్ని అరువు తెచ్చుకుంటూ.

అన్నపూర్ణ తలతిప్పి వదినగారి వైపొకసారి చూసి చేతిలోని వంకాయని నీళ్ళలో పడేసి కొంగుకి చేతులు తుడుచుకుంటూ వసారాలో కొచ్చింది.

చెల్లెలి వైఖరి చూస్తే రాఘవరావుకి అదోలా అనిపించింది.

అయినా దాన్ని పడనీయకుండా "పనిలో వున్నావేంటమ్మా" అంటూ ప్రేమగా పలుకరించేడు.

హేళనతో కూడిన చిరునవ్వొకటి అన్నపూర్ణ పెదవులపైకొచ్చి లీలగా తేలిపోయింది.

"ఏంటి!" అంది పొడిగా.

విషయమంతా తెలిసి అలా అడుగు

తోన్న చెల్లెల్ని ఆశ్చర్యపోయి చూడటం అతని వంతయింది.

"అదే.... శైలు ఆ కాగితాల మీద సంతకాలు పెట్టిందా?" అన్నాడు ఎలాగో.

"పెట్టింది!"

అన్నపూర్ణ జవాబుకి ఎగిరిపంత పని చేసేడు రాఘవరావు.

"మరి యింత చల్లటి కబురు ఇంత నిదానంగా చెబుతా వేంటమ్మా!" అన్నాడు పార్థసారధి ఎంతగానో పరదాపడిపోతూ.

"అన్నపూర్ణమ్మ నిండుకుండ!" అంటూ మెచ్చుకున్నాడు హనుమాన్లు. ఈ సందడి విని గుమ్మందాకా వచ్చేసి నిలబడింది కనకమ్మ సంతోషంగా.

"అది నా చెల్లెలు! దబదబలాడకుండా పని చెయ్యటం దానికి తెలుసు! ఇంటి పరువుకోసం ప్రాణం యివ్వడం దాని కిప్పుడు కొత్తకాదు!" అన్నాడు రాఘవరావు గర్వంగా.

అన్నపూర్ణ తలెత్తి అన్నగారివైపు చూసి నవ్వింది.

ఆ నవ్వుతో కొండంత బలం వచ్చేసింది రాఘవరావుకి.

"తొందరగా ఆ కాగితాలు పట్టుకురా! వాటిని మళ్ళీ పైకి పంపాలి!"

"ఆ పని నిన్ననే చేసేను!" అంది అన్నపూర్ణ శాపీగా.

"ఆ(!" అంటూ అదిరిపోయేడు రాఘవరావు.

అన్నపూర్ణ ఏమాత్రం తొణకలేదు.

"అవును! శైలజకి నీ కొడుకు భార్యగా వైధవ్యం ధరించటంతోపాటు అతనికి సంబంధించిన మిగతా హక్కులు కూడ సంక్రమించేయి! అతనికి రావల్సిన పన్నీ గవర్నమెంటు ఆమెకే అప్పజెబుతుంది! మధ్యలో మనమెందుకు! అందుచే వాటిని నిన్న నేనే పోస్టు చేసేమ్మా" అంది.

రాఘవరావు అదిరిపోయేడు.

"నీ కెంత ధైర్యమొచ్చిందే!" అన్నాడు కోపంతో వణికిపోతూ.

అన్నపూర్ణ పేలవంగా నవ్వింది.

"ఈ ధైర్యమే పాతికేళ్ళనాడు నాకు వచ్చివుంటే నా జీవితం మరొకలా వుండి వుండేది! నా పాలం - నా భర్త పొలం నీ చేతిలో చిక్కేది కాదు! నేను బ్రతుకంతా నీ కొంపలో ఊడిగం చేసి వుండేదాన్ని కాదు! నా కూతురికి ఇష్టం లేని పెళ్ళి- ఈ వైధవ్యం తప్పిపోయి వుండేయి!" అంది ఛీత్కారంగా అన్నగారి వైపు చూస్తూ.

చెల్లెలి మాటతో రెచ్చిపోయేడు రాఘవరావు.

అతని ముఖం కోపంతో చెక్కేసిన కందదుంపలా ఎర్రబడిపోయింది.

"ఓహో! చాల దూరం వచ్చిందన్న




మాట సంగతి? ఇల్లలగ్గానే పండగకాదు! అసలు తల్లీకూతుళ్ళు ఈ గడప ఎలా దాటతారో అది నేను చూస్తాను!" అంటూ రెచ్చిపోయేడు.

అన్నపూర్ణ నిరసనగా నవ్వింది.

"అవన్నీ సిద్ధంచేసుకునే వున్నా నన్నయ్యా! కాస్సేపట్లో అనిరుద్ధ వస్తాడు శైలజ పెళ్ళి అతనితో జరిగి తీరుతుంది. కానీ ఇప్పుడు కాదు! గి కొడుకు చేత తాళికట్టించుకుని విధవయి నందుకు రావల్సినవన్నీ రాబట్టు కున్నాకనే!" అంది.

రాఘవరావు కళ్ళు బయటకొచ్చేపేట్లు కళ్ళురిమేడు.

"నంగనాచిలా వుండే నువ్వు ఎంతకి తెగించావే! దానికి మళ్ళీ పెళ్ళిచేసి ఇంటి గౌరవం తీసావా!"

"గౌరవం! పరువు! జీవితమంతా అడవికాచిన వెన్నెల చేస్తే - బ్రతుకంతా కన్నీటిమయం చేస్తే చివరికెప్పుడో దెప్పిపొడుపుల మధ్య మిగిల్చే బిరుదు కోసం నా కూతురు ఎదురుచూసే స్థితిలో లేదన్నయ్యా! ఆ రోజు సరిగ్గా పాతికేళ్ళ క్రితం నేను సమాజాన్ని చూసి రుడిసో, మంచి పేరు సంపాదించుకోవాలన్న తపనతో దేవుడిలా నన్ను కోరిన వ్యక్తిని త్రోసిపుచ్చి నీ కొంపలో ఊడిగం చేస్తూ ఒంటరి బ్రతుకు గడిపేను! బాధ కలిగినప్పుడు ఓరడించే తోడులేక నేనేం పోగొట్టుకున్నానో అర్థమయి మూగగా రోదించడం మినహా మరేమీ చేయలేక పోయేను! కేవలం మూడు నెలల కాపురంతోనే నన్ను సరిపెట్టుకోమని ఈ రోజువరకు ప్రత్యేకమైన పడకగదిలో

మీరు సరాగాలాడుతూ ఈ రోజున నా కూతుర్ని కూడ నాలాగే మ్రగ్గిపొమ్మని శాసిస్తున్నారు! కాని అప్పుడు జరగదు! అది నా కూతురు! దాన్ని శాసించడానికి మీ కెలాంటి అధికారం కాని హక్కు కాని లేదు!" అంటూ ఆవేశంతో అరిచింది అన్నపూర్ణ.

"హవ్వ! ఎంతకు తెగించింది!" అంటూ నోటికి గుడ్డ అడ్డంపెట్టుకుంది కనకమ్మ.

"నిజమే! కొడుకు పోయినందుకు బాధపడటం మానేసి—శవం మీద డబ్బులు ఏరుకునే మీకు నాది తెగింపు గానే వుంటుంది! అమ్మా, శైలా, నువ్వికా బయటికి రా!" అంటూ పిలిచింది అన్నపూర్ణ.

ఒక చిన్న సూట్ కేస్ తీసుకొని బయటకొచ్చింది శైలజ.

రాఘవరావు ఉగ్రుడై నిలబడి పోయేడు.

"మీ రెలా గడప దాటుతారో చూస్తాను!" అన్నాడు ఆవేశంగా.

అతనితోపాటు హనుమాన్లు, పార్థ సారధి కూడ లేచి నిలబడ్డారు.

సరిగ్గా అప్పుడే లోపలికొచ్చేడు అనిరుద్ధ.

"మీ రనవసరంగా ఆవేశపడిపోకండి. దానివలన జైలుకి పోవడం తప్ప ప్రయోజనం వుండదు!" అంటూ శైలజ చేతిలోని సూట్ కేస్ అందిపుచ్చు కొన్నాడు అనిరుద్ధ.

"ఏం బెదిరిస్తున్నావా!" అంటూ అతనీ మెడమీద చేయ్యేసేడు రాఘవ రావు.

"అన్నయ్యా, ఆ చెయ్యి దించు! ఇలాంటిది జరుగుతుందని తెలిసే నేను ముందు జాగ్రత్తగా నిన్ననే పోలీస్ రిపోర్టు యిచ్చి వచ్చేను! వాళ్ళు బయట నిలబడి వున్నారు!" అంది అన్నపూర్ణ కటువుగా.

రాఘవరావు చెయ్యి క్రిందకి వాలి పోయింది!

వంద జలగలు ఒక్కసారే అతని ముఖంమీద పడి రక్తం పీల్చేసినట్లుగా పాలిపోయింది అతని ముఖం!

అన్నపూర్ణ ధీమాగా నడుస్తోంది కూతురి ప్రక్కగా— కాబోయే అల్లుడి వెనుకగా!

ఆ ముఖంలో చెప్పలేని కాంతి!

కడుపుతీపి ఎంత ధైర్యాన్నిస్తుందో ఆ క్షణంలోనే అర్ధమయిందామెకి.

ఇంతకాలం చీకటిలో మగ్గిపోయి, చీకటిలోనే తను బ్రతికినా తన బిడ్డ భవిష్యత్తు చీకటిలో మగ్గిపోకూడదని— ఆ తల్లి తీసుకొన్న నిర్ణయం ఆ బిడ్డకి వెలుగునివ్వబోతోంది!

అప్పుడే తూర్పున సూర్యోదయం అయ్యింది.

—X—

# ఈ బ్రతుకు నీకోసం

వీరరాజు



"మీరు వెళ్ళక తప్పదా?"

నా కాళ్ళవైపు కూర్చుని కాళ్ళను నెమ్మదిగా నొక్కుతూ అంది సుశీల.

సుశీల గొంతులో వినిపించిన దిగులు ఓ క్షణం నా మనస్సు చివుక్కుమంది.

కొన్ని క్షణాల మౌనం తర్వాత అన్నాను. "లేదు సుశీలా! నేను వెళ్ళాలి. ఇప్పుడు వెళ్ళకపోతే జీవితంలో మిగిలిపోయిన ఈ అసంతృప్తితోనే చచ్చిపోతాను. అయినా నెలరోజులు ఎంతలో గడుస్తాయి? లేనిపోని ఆలోచనలతో మనస్సు పాడుచేసుకోకు. నాకు తెలీకుండానే నా గొంతులో ఏదో జీర పలికింది.

పదిగంటల ఆ చీకటిరాత్రిలో సుశీల మనస్సులోనూ, నా మనస్సులోనూ చీకటి దట్టంగా అలుముకుంది.

కొన్ని నిమిషాల మౌనం తర్వాత సుశీల నా రెండుపాదాలమీద తల అన్చి నెమ్మదిగా ఏడుస్తూ అంది. 'ఇంతకా మిమ్మల్ని విడిచి వారంరోజుల కం ఎక్కువ ఎప్పుడూ గడపలేదు. నన్ను మీతోపాటు తీసుకెళ్ళండి. నా భయంగా వుంది."

సుశీల మాటలకు అప్పటివరకు బిట్టుకున్న ధైర్యం నాలో ఒక్కసా వదలిపోయింది. నా గొంతును ఎవ్వరొ నొక్కిపట్టినట్టు మాటలు పెదవులదా బైటికి రాలేదు.

కొన్నిక్షణాల్లో నన్ను నేను తమాయించుకుని బలవంతంగా గొంతు పెగల్చుకుని, "సుశీలా! నువ్వనవసరంగా భయపడుతున్నావ్. నాతోపాటు నిన్నూ తీసుకెళ్ళేవాడినే, కానీ నేను వెళ్ళేప్రాంతాల్లో చలి ఎక్కువగా వుంటుంది. అసలే ఆరోగ్యం అంత మంచిది కాదు. యిటువంటి సమయంలో నువ్వొచ్చినా ఇబ్బంది పడాల్సివస్తుంది. ఆ యి

రిటైరైపోయిన మనిషిని నాకు యింట్లో మాత్రం ఏం కోస్తుంది చెప్పు!" అనునయంగా అన్నాను సుశీలను దగ్గరకు తీసుకుని ఆమె చెక్కిళ్ళపై చారలుకట్టిన కన్నీళ్ళను తుడుస్తూ.

కొన్ని నిమిషాల మౌనం తర్వాత సుశీల అంది. "మీరు రేపు ఉదయం వెళ్తున్న సంగతి పెద్దాడికి కోడలికి చెప్పారా!" అని.

"మధ్యాహ్నం భోజనం చేస్తున్నప్పుడే చెప్పాను" ముక్తసరిగా అన్నాను.

ఇంతలో పక్కగదిలోంచి చిన్నగా దగ్గు వినపడింది. ఆ వెంటనే గుసగుసలు. ఎంత వినకూడదని ప్రయత్నించినా నా చెవి పరిధిని దాటిపోలేదు.

"ముసలాయన పొద్దున్న బండిలోనే వెళ్ళిపోతాడట. ఎలాగూ వెళ్లేది తీర్థయాత్రలకేగా పెళ్ళాన్ని కూడ తీసికెళితే చక్కగా ముసలివయసులో 'హనీమూన్' జరుపుకున్నట్టుంటుంది" అది కోడలి గొంతు.

"ఆయన లేదు లేదు అంటాడు గానీ ఎక్కడో డబ్బు దాచిపెట్టే వుంటాడు. పైసా విదల్చడు. పోయేటప్పుడు ఏం పట్టుకుపోతాడో" అది తన రక్తం పంచుకుపుట్టిన ప్రథమ పుత్రరత్నం గొంతు.

నా గుండెలో ఏదో కలుక్కుమంది. చటుక్కున మొహంతిప్పి సుశీలవైపు చూశాను. ఆ మాటలు విన్నదేమోనని.

ఆమె అదృష్టమో ఏమోగానీ ఆ మాటలు ఆమె చెవిని సోకలేదు. అప్పటికే ఆ మొహానికి పాట్లుపడుతోంది.

నాకు నిద్రపట్టలేదు.

నా మనస్సు ఆందోళనతో నిండిపోయింది.

నేను చేసుకున్న పాపమేమిటోగానీ నాకూహ తెలిసినప్పట్నుంచి నా జీవితం సజావుగా సాగలేదు. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా పనిచేసి యిటీవలే పదవీవిరమణ చేసిన నేను వృత్తిలో ముక్కుసూటిగా పోయి నాకంటూ ఏమీ నిల్వచేసుకోలేకపోయాను. అయినా నాకొచ్చే జీతం రాళ్ళ మీద నా యిద్దరికొడుకులకి పెద్దచదువులే చెప్పిద్దామని ప్రయత్నించాను గానీ చిన్నతనంలోనే చెడు అలవాట్లకు లోనైన నా కొడుకులిద్దరూ తక్కువ చదువుతోనే చదువాపేసి చిన్న ఉద్యోగాల్లో స్థిరపడిపోయారు. యిక మిగిలిన ఒక్క కూతుర్ని నా శాహతుకు మించి అప్పు చేసి మంచి సంబంధమే చేశాను. నా దురదృష్టమేమో తెలీదుగానీ అల్లుడుకన్నా, కూతురే తను కోరుకున్న గొంతెమ్మ కోర్కెలు తీర్చలేకపోయామని పుట్టింటితో సంబంధం తెంచేసుకుంది.

నేను ఏదో సంపాదించి ఎవ్వరికీ తెలీకుండా ఎక్కడో బ్యాంకులో దాచు కున్నానని, నా తదనంతరం అది నా కూతు రికి చెందేట్టు రాశాననీ నా కొడుకులిద్దరికీ నామీద అనుమానం. కానీ నిజం నేనెంత చెప్పినా వాళ్ళు నమ్మరు. నాకు వచ్చే పెన్షన్ కొంత అమ్మేసి నా కూతురు పెళ్ళికి చేసిన అప్పు తీర్చేశానని చెప్పినా వాళ్ళకు నమ్మకం కుదరదు.

నా బిడ్డలసంగతి బాగా తెల్సిన నేను రిటైరై పోయిన ఊళ్ళోనే ఏదో ఒక అద్దె కొంపలో నా కొచ్చే పెన్షన్ డబ్బుల్తో గడుపుదామంటే నా భార్య వినలేదు. "ముసలి వయసులో యిక్కడెందుకు? కలో గంజో పిల్లలతోనే కలిసి తాగుదా మని" పోరుపెట్టి లాక్కొచ్చింది.

నా పిల్లల స్వభావం సుశీలకు తెల్సినా మాతృప్రేమను తొందరగా చంపుకో లేదు. ఎంతయినా ఆమె ఈ గడ్డమీద పుట్టిన మామూలు స్త్రీ.

పెద్దకొడుకు కోడళ్ళ నిర్లక్ష్యం, నిరా దరణ నన్నీమధ్య బాగా కృంగదీశాయి.

ముప్పైఏళ్ళకు పైగా యింజనీరింగ్ సర్వీసులో క్షణం తీరికలేని జీవితం గడి పిన నాకు యింట్లో ఖాళీగా కూర్చోవా లంటే బోర్‌గా వుంది. నా కొచ్చే పెన్షన్ డబ్బుల్లో చాలమట్టుకు పెద్దాడికి నెలనెలా ముట్టజెప్పుతున్నా నేను నా భార్య వాళ్ళింట్లో వూరికినే కూర్చుని తింటున్నా మన్న భావన వాళ్ళలో బాగా నాటుకు పోయింది. సాధ్యమైనంతవరకు నా కోడలు సూటిపోటిమాటలు వినబడనట్టే నటించడం నేర్చుకున్నా నీ మధ్య సుశీల మాత్రం ఒంట్లో ఓపికలేకపోయినా ఎప్పుడూ ఏదో ఒక పనిలో లీనమైనట్టే కనపడుతుంటుంది.

పక్కగదిలోంచి మనవడి ఏడుపు గట్టిగా వినపడడంతో నా ఆలోచనల్లోంచి తేరుకున్నాను.

మళ్ళీ పక్కగదిలోంచి మాటలు ఎంత వద్దనుకున్నా నా చెవినిపడ్డాయ్.

"వూరుకోరా, వూరుకో! అర్ధరాత్రి అపరాత్రి లేకుండా ఏమిటా ఏడుపు? అయినా యింట్లో ముసలాళ్ళు వున్నారన్న మాటేగానీ పిల్లల్ని కూడ పట్టించుకోరు. వెధవ నంత భరించలేకపోతున్నాను" కోడలి గొణుగుడు. కోడలిమీద నాకు విపరీతమైన కోపంవచ్చింది. ఎంత వంగ నాచిలా మాట్లాడుతోంది.

పిల్లాడ్ని తను ఎంతో దగ్గరకు తీయా లని ప్రయత్నించాడు. పిల్లాడు నాకెక్కడ చేరువై పోతాడోనన్న భయంతో - వాడ్ని నా ఛాయలకే రాకుండా జాగ్రత్తపడింది. ఇప్పుడు వాడు నన్ను చూస్తేనే జడుసు కుని పారిపోతుంటాడు.

అందుకే నాకు ఈ జీవితంమీద విసుగెత్తింది. కొన్నాళ్ళపాటు బద్రీనాద్-హృషికేష్ మొదలైన తీర్థయాత్రలు పూర్తిచేసుకురావాలని అకస్మాత్తుగా ప్రయాణం పెట్టుకున్నాను. నిజానికి నాకు చిన్నప్పట్నుంచీ సాహిత్యమంటే మక్కువ ఎక్కువ. కాలేజీ రోజుల్లోనూ ఉద్యోగంలో చేరిన కొత్తలోనూ అడపాదడపా కథలు రాసి పత్రికలకు పంపించేవాడ్ని. కొన్ని కథ లచ్చయ్యేవి. మరి కొన్ని తిరిగొచ్చేవి. తర్వాత ఉద్యోగంలో 'బిజీ' అయిపోయి పుస్తకాలు చదవడం రాయడం మానుకున్నాను - కానీ నాకు చిన్నతనంనుంచీ ఓ కోరిక మనసులో మిగిలిపోయింది. అదేవిటంటే దేశాటన చేసి, వివిధ రకాలైన జీవితాలను సునిశితంగా గమనించి 'జీవితం' మీద ఓ మంచి నవల రాయాలని. ఆ కోరిక యింతకాలానికి ఈ రూపేణా నెరవేరబోతోంది.

బయట చర్చి గంటలు మూడు కొట్టాయి.

నాకు యింక నిద్రపట్టలేదు. నెమ్మదిగా లేచి పెరటి తలుపులు తీశాను, చల్లటిగాలి రివ్వున మొహంమీది కొచ్చింది తలుపు చప్పుడుకు గబుక్కున లేచి కూర్చుంది సుశీల.

"టైమెంతయింది? అప్పుడే లేచిపోయారేం?" ఆవలిస్తూ అంది.

"యింకా ట్రైనుకు చాలా టైముంది గానీ నువ్వు పడుకో. వెళ్ళేముందు లేపుతాలే!" అన్నాను.

"ఇంకేం పడుకుంటాన్లెండి, మీకు మొహం కడుక్కోడానికి వేన్నీళ్ళు పెడతానుండండి" అంటూ లేచివెళ్ళి పెరటి వరండాలోనున్న స్టవ్ వెలిగించింది.

కాలకృత్యాలన్నీ ముగించుకునేటప్పటికి గంటపైగా పట్టింది.

నా సూట్‌కేస్ తీసుకుని బయలుదేరాను.

గుమ్మంవరకు వచ్చిన సుశీల అంది, "పెద్దాడిని లేపమంటారా?"

"వద్దు మంచి నిద్రలో ఉన్నట్టున్నాడు పడుకోనియ్" అన్నాను.

"మీ ఆరోగ్యం జాగ్రత్త. వేళకి తినడం మర్చిపోకండి. రెండు రోజులకో ఉత్తరం రాయండి" గుమ్మందాటి నాతో పాటు నడుస్తూ అంది.

"అలాగే కానీ, నువ్వారోగ్యం జాగ్రత్తగా చూసుకో. ఒంట్లో ఏమాత్రం బాగోలేకపోయినా పెద్దాడితో మందులు తెప్పించుకో. అలక్ష్యం చేయకు. నేను త్వరగా వచ్చేస్తానులే. దిగులుపడకు...." ఆఖరిమాట అంటున్నప్పుడు నా గొంతు ఎందుకో వణికింది.

"అలాగే" కన్నీళ్ళతో అంది.

భారంగా అడుగులేసుకుంటూ రిక్షా



స్టాండువైపు కదిలాము.

* * *

రైలు వేగంగా దూసుకుపోతోంది.

చీకటి తెరలను చీల్చుకుని వెలుగు కిరణాలు దూసుకొస్తున్నాయి. తూరుపు ఎర్రబడుతోంది. తూరుపునుంచి వచ్చే చల్లటిగాలి కిటికీలోంచి రివ్వున దూసుకొచ్చి చెవుల్లో గిలిగింతలు పెట్టింది.

సూట్‌కేసులో వున్న మఫ్లర్ తీసుకుని చెవులమీంచి చుట్టుకున్నాను.

బెర్తులమీద జనం యింకా నిద్రపోతున్నారు.

నా మనస్సు ఎంత వద్దనుకున్నా వెనక్కి పోతోంది. నిజంగా నా మన

స్వంత సున్నితమని నాకు యింతవరకు తెలీదు.

"నేను యిల్లో అలిగి వెళ్ళిపోతు న్నానా?" అన్న నేను ప్రశ్నించుకున్నాను.

జీవాలు ఏమైనప్పటికీ రెండు మూడేండ్ల తర్వాత వేసుకోవాల్సిన ప్రయాణం యిప్పుడే 'పదన్' గా వేసుకోవాల్సి వచ్చింది.

ఏదో స్టేషన్‌వస్తే రైలు కొద్ది నిము షాలు ఆగి మళ్ళీ బయలుదేరింది— అయితే రైలుకున్న ఈ కొద్ది నిమిషాల విరామం కూడ నా ఆలోచనలకు లేకుండా పోతోంది.

వ్యక్తులకు స్వంత ఆస్తిపాస్తులు లేకుండా వృద్ధులు, తల్లిదండ్రులు యువ తరంమీద ఆధారపడకుండా 'రష్యా' లోలా అన్నీ ప్రభుత్వమే చూసుకుంటే ఎంత బావుంటుంది? అనిపించింది. అయినా నా పిచ్చిగానీ ఈ దేశంలో కర్మ సిద్ధాంతంమీద నమ్మకం, సెంటిమెంట్స్ పోనంతకాలం ఈ బంధాలమీద ఏమాత్రం నమ్మకం లేకపోయినా తల్లిదండ్రులమీద పిల్లలు పిల్లలమీద పెద్దలు ఆధారపడక తప్పదు. అయినా లోకంలో నా బిడ్డలు లాంటి బిడ్డలే వుంటారా? అందరూ?

"నా బిడ్డల్ని నేను సరిగ్గా క్రమశిక్షణలో పెంచలేదేమో?" ముప్పైఏళ్ళ తర్వాత నా కటువంటి ఆలోచన వచ్చి నందుకు నాకే సిగ్గనిపించింది. నిజమే నా వృత్తిధర్మాన్ని నిర్వర్తించడానికే నాకున్న టైమ్ సరిపోలేదు.

నాకు వెంటనే నాన్న గుర్తుకొచ్చారు. నా కళ్ళంట నీళ్ళు తిరిగాయి.

నన్ను పెంచి పెద్దచేయడానికి నాన్న ఎంత కష్టపడ్డారో తల్చుకుంటే యిప్పటికీ నా కళ్ళు నీళ్ళతో నిండిపోతాయి. ఒక రోజు జరిగిన సంఘటన తను ఈ జన్మలో మర్చిపోలేదు.

ఆ రోజు యింజనీరింగు కాలేజీలో తనకు సీటు వచ్చిన రోజు. తనకొచ్చిన మంచి మార్కులు చూసి తనకంటే నాన్నే ఎక్కువ సంతోషించారు. ఏదో ప్రైవేటు కంపెనీలో నెలకి నూటఇరవై రూపాయల జీతంతో సంసారాన్ని ఈదు తున్న నాన్న ఈ బరువు మోయలేరేమో నని అమ్మ నన్ను కాలేజీలో చేర్పించ డానికి సుతారమూ యిష్టపడలేదు

"బాబూ! యింతకాలం మీ నాన్న ఒక్కరే ఎంత కష్టపడ్డారో మీకు తెలీంది కాదు. అక్క పెళ్ళికోసం చేసిన అప్పు యింకా తీర్చలేదు. ఏదైనా ఉద్యోగంలో చేరి మీ నాన్నకు సాయపడరా!" అంది అమ్మ.

తను ఏమీ చెప్పలేక మౌనంగావుంటే నాన్నకి ఎంత కోపం వచ్చిందని?

"నా బిడ్డ కష్టపడి చదివి మార్కులు

తెచ్చుకున్నందుకే కదే వాళ్ళు పీటిచ్చింది. ఇటువంటి అవకాశం ఇన్నాలో మళ్ళీ వాడి కొస్తుందా? ఎంత కష్టమైనా సరే నేను వాడిని చదివిస్తాను. ఈ విషయంలో నువ్వేంకేమీ మాట్లాడకు" అని అమ్మని కసురుకుని, "ఇంట్లో ఈ గొడవలెప్పుడూ వుండేయేగాని నువ్వెళ్ళి కాలేజీలో చేరే ఏర్పాట్లు చేసుకో బాబూ!" అన్నాడు.

నాన్న ఆశయంప్రకారం తను ఐదేళ్లు కష్టపడి చదివి డిగ్రీ సంపాదించు కున్నాడు. ఆ మరునటి సంవత్సరమే ఉద్యోగం వచ్చింది. నాన్న తీర్చలేక పోయిన అప్పు తనే తీర్చేశాడు. కానీ తన సంపాదన ఓ సంవత్సరమైనా అనుభ వించకుండానే అమ్మ - నాన్న ఓ రోజు అక్కయ్యని చూడ్డానికి వెళ్ళొస్తూ బస్సు ప్రమాదంలో అకస్మాత్తుగా మరణించారు.

ఆ 'షాక్'ని తట్టుకోడానికి తనకు- చాల సంవత్సరాలు పట్టింది.

రైలు ఏదో స్టేషన్‌లో ఆగింది.

పూర్తిగా తెల్లవారడంతో ఒక్కొ క్కరే లేచి కాలకృత్యాలు తీర్చుకోడం మొదలుపెట్టారు.

నేను ఆలోచనల్లోంచి పూర్తిగా తేరు కుని నా వెంట తెచ్చుకున్న పుస్తకం చదవడంలో లీనమయ్యాను.

*　　*　　*

నేను యింటినుంచి బయలుదేరివచ్చి నలభై రోజులకు పైగా అయింది. ఒక రోజు గంగానది ఒడ్డున కూర్చుని అస్త మిస్తున్న ప్రభాకరుని అరుణకిరణాలకు ఆలవాలకగా పులకిస్తున్న గంగమ్మతల్లిని చూస్తూ పరవశిస్తున్నాను.

ఇంతలో నా పక్కనుంచి ఓ జంట గట్టిగా నవ్వుకుంటూ వెళ్ళి పక్కనే వున్న బెంచీమీద కూర్చోడంతో నా ఏకాం తానికి భంగంకలిగి వాళ్ళవైపు చూశాను.

యిద్దరూ - వృద్ధదంపతుల్లా వున్నారు. వేరుశెనగకాయలు సిమెంటు బెంచీమీద పగలగొట్టుకుని తింటూ పడుచుజంట కంటె మిన్నగా కబుర్లాడుకుంటున్నారు.

నాకు వెంటనే సుశీల గుర్తుకొచ్చింది. నేను యింటినుంచి వచ్చి యిన్ని దినా లైనా తనకు రెండుమూడు ఉత్తరాలకంటె ఎక్కువ రాయలేకపోయాను. నా యాత్రలో ప్రతి రాత్రి నేను చూసిన విశేషాలు విపులంగా రాసుకోడానికే నాకు టైం సరిపోలేదు.

పాపం సుశీల ఎలా వుందో? తను లోకం తెలీని అమాయకురాలు. యింట్లో పనిచేసేవాళ్ళను కూడా తను విసుక్కోడం ఎప్పుడూ చూడలేదు. తన జీవితమంతా నాకు సేవచేయడంతోనే సరిపోయింది. యిప్పుడు పిల్లలకి చేస్తోంది. సుశీలే గాని నా జీవిత భాగస్వామిగా రాకుంటే

దిహాళా తను ఎప్పుడో నవ్వసించే వాడేమో?

పాపం యిప్పుడు తన ఆరోగ్యం ఎలా వుందో? ఆమెకు చలిగాలి అస్సలు పడదు. శీతాకాలంలో తనను చాల జాగ్రత్తగా చూడాలి. పెద్దాడు మందులు సరిగ్గా యిస్తున్నాడో లేదో?

సుశీలగురించి ఆలోచనలతో నా మనస్సు స్థిమితం కోల్పోయింది. "వెంటనే వెళ్ళి సుశీలను చూస్తేనేగాని నా మనసు కుదుట పడదు. ఈ రోజే బయలుదేరి వెళ్ళాలి" మనసులో అనుకుని లేచి బయలుదేరాను.

* * *

రిక్షా దిగి, గేటు తీయబోయిన నా చేతులు యింటి వరండాలో చూసిన దృశ్యానికి గేటుమీదే బిగుసుకుపోయాయి. పరుగులాంటి నడకతో అక్కడికి చేరుకున్నాను.

వసారా అరుగుపై చాపమీద సుశీల శవం.

ఒళ్ళంతా తెల్లటిగుడ్డ కప్పబడివుంది. వెనుక చిన్న దీపం, అగరొత్తులు దీనంగా వెలుగుతున్నాయి. చిన్నపిల్లలు దూరంగా నున్న వేపచెట్టుక్రింద ఆడుకుంటున్నారు చిత్రమేమిటంటే పెద్దవాళ్ళు ఎవ్వరూ శవందగ్గర లేరు.

నా హృదయం బ్రద్దలయిపోతోంది దీ హఠాత్పరిణామానికి ఒక్కసారి నన్ను నీరసం ఆవరించింది. నెమ్మదిగా వెళ్ళి సుశీల తలవైపు నేలమీద చతికిలబడ్డాను. సుశీల మొహంలోకి చూశాను. ప్రశాంతంగా నిద్రపోతున్నట్టుగా వుంది.

"సుశీలా! ఎంత అన్యాయంచేసి వెళ్ళిపోయా ఈ వయసులో? నేను వేసుకున్న ప్రయాణమే సుశీల మరణానికి దారి తీసిందా?" మనసు ఆక్రోశించింది. గది లోంచి వరండాలోకొచ్చిన కోడలు ఒక్కసారి ఆశ్చర్యపోయినట్టు నన్ను చూసి "మీ రెప్పుడొచ్చారు మామయ్యా?" అని "ఏమండీ మీ నాన్నగారొచ్చారు" అంటూ లోపలికి ఓ కేకేసి, "చూశారా మావయ్యా అత్తయ్య ఎంత అన్యాయంచేసి వెళ్ళిపోయారో" అంటూ చిన్నగా ఏడుపు లంకించుకుంది ఒక్క నిమిషం గడవకుండానే పరుగులాంటి నడకతో యింట్లోంచి నా యిద్దరు కొడుకులు, కూతురూ వచ్చి నన్ను చూసి బావురుమన్నారు. కొద్దిసేపయిన తర్వాత నా పెద్ద కొడుకు అన్నాడు. రెండు రోజులక్రితం అమ్మకి గుండెనొప్పి వచ్చింది. డాక్టర్ని తీసుకొచ్చి మందులిప్పించాను. మీకు టెలిగ్రాం యిద్దామంటే మీ రెక్కడుంటారో సరిగ్గా తెలీదు - రాత్రే అమ్మ పోయింది."

నా కొడుకు మాటల్లో సంజాయిషీ కనపడింది.

నేను తలెత్తి ఎవ్వరి మొహంలోకి చూడలేదు- అప్పలు చూడాలనిపించలేదు. నేను ఏం మాట్లాడకపోయేటప్పటికి ఒక్కొక్కరే మెల్లగా అక్కడ్నుంచి జారుకున్నారు.

మళ్ళీ వరండామీద సుశీల - నేను వంటరిగా.

నిర్జీవంగా సుశీల - జీవం వుండి లేనట్టు నేను.

సుశీల చనిపోయేముందు నాకేమైనా చెప్పాలనుకుందా? లేక ఎవ్వరికైనా ఏమైనా చెప్పిందా? ఎవరినైనా పిలిచి అడగాలనుకున్నాను. కానీ నా గొంతు మూగబోయినట్టయి ఆ ప్రయత్నం విర మించుకున్నాను నెమ్మదిగా లేచి. నేను సుశీల ఎప్పుడూ వుండే గదిలోకి వెళ్ళి తలుపులు జారవేసి సుశీల ట్రంకుపెట్టె తెరిచాను. బట్టలపైనే ఓ కాగితంముక్క నా కంటబడింది.

తీసి గబగబ చదివాను.

అయన వెళ్ళి చాలరోజులైంది. ఈ మధ్యన వుత్తరాలు రావటంలేదు. ఎలా వున్నారో. నాకీ మధ్యన విపరీతంగా ఆయాసం వస్తోంది. పెద్దాడికి ఎన్నిసార్లు చెప్పినా పట్టించుకోవటంలేదు. నాకెందుకో చాల బెంగగా వుంటోంది. బహుశా ఆయన రాకుండానే పోతానేమో? నేను గానీ పోతే నా మెడలోవున్న నాల్గుపేటల గొలుసు సగం నా కూతురికి, సగం నా పెద్దకోడలికి యివ్వండి

ఎవ్వర్నీ సంబోధించకుండా డైరీ రాసుకున్నట్టు సుశీల ఓ కాగితం ముక్క మీద పెన్సిలుతో రాసుకుంది.

ఒక్కసారిగా నాలో నీరసం ఆవ హించి వళ్ళంతా చెమటలు పట్టేశాయి. తూలుతున్న శరీరాన్ని అక్కడే వున్న కుర్చీలో చేరవేశాను.

కొన్ని నిమిషాలు గడిచాయి. లేవ డానికి ప్రయత్నించాను. కానీ నా శరీరం నా అధీనంలో లేనట్టనిపించింది.

అప్పుడే అకస్మాత్తుగా నా కళ్ళు గోడ మూలనున్న చేతి కర్ర మీద కు మళ్ళాయి.

ఆ చేతికర్రను చూడగానే నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. చాలకాలం క్రిందట జరి గిన సంఘటన గుర్తుకొచ్చింది.

* * *

ఓసారి నేను, సుశీల మహాబలిపురం వెళ్లాం. అప్పటికి పిల్లలు యింకా కాలే జీల్లో చదువుతున్నారు. ఓ షాపుదగ్గర నగిషీతో చెక్కబడిన అందమైన చేతి కర్రను చూసి ముచ్చటపడి బేరమాడ కుండానే కొనేసింది సుశీల.

"అరె, అదేమిటి? చేతికర్ర కొన్నా వెందుకు?" ఆశ్చర్యంగా అడిగాను.

"మీ కోసమే" అంది ముసిముసిగా

నవ్వుతూ సుశీల.

"నాకా? అప్పుడే చేతికి కర్ర యిచ్చేద్దామనుకుంటున్నావా?" వేళాకోళంగా నవ్వుతూ అన్నాను.

"మీరింకా వయస్సులోనే వున్నారనుకుంటున్నారేమిటి? మీకింకా సర్వీసు ఏడేళ్లే వుంది. తెలుసా?" నవ్వుతూ అంది సుశీల.

"నా సర్వీసు నాకంటె నీకే బాగా గుర్తుందోయ్. అయినా సుశీ, నిజం చెప్పాలంటే నేనెంత దృఢంగా వున్నానో చూడు. ఏడేళ్ల తర్వాతనయినా నా శరీరంలో యింతకన్నా పెద్ద మార్పుండక పోవచ్చు" అన్నాన్నేను.

"అబ్బ వూరికే కంగారుపడకండి. మీరు బాగా ముసలివారై పోయిన తర్వాత చేతికర్ర సహాయంతో నడుస్తూంటే ఎలా వుంటారో చూడాలని నా కోరిక. అందుకే యిది కొన్నాను" పగలబడి నవ్వుతూ అంది.

"ఆ అవసరం నాకు రాదు" సీరియస్‌గా అన్నాను.

"ఎందుకని?" ఆశ్చర్యంగా అడిగింది సుశీల.

"ఆ మాత్రం తెలీదా? పిచ్చిదానా, నాలో సగభాగం నువ్వు. నేను నడవలేని స్థితిలో నీ భుజంమీద చేయివేసి నడుస్తాను గానీ ఇటువంటి కర్ర సహాయంతో కాదు" అన్నాను తేలిగ్గా నవ్వేస్తూ.

"నేనుగానీ మీకంటే ముందు పోతే?" సుశీల.

"సుశీ, నీ కీరోజు పిచ్చిగానీ పట్టిందా? ఏమిటీ వితండవాదం? అయినా నేను నీకంటే దాదాపు పదేళ్ళు పెద్ద - అది మర్చిపోయావా? పద పైపైపోతోంది బస్సుకి" చిరుకోపంగా అన్నాను.

* * *

ఇప్పుడు ఒక్కసారిగా పదేళ్ళవయసు మీదపడినట్టనిపించింది. కుర్చీలోంచి నీర్సంగా లేచి మూలనున్న చేతికర్ర నందుకుని తలుపులు తీశాను.

"నాన్నా! మీ రిక్కడున్నారా? మీ కోసమే వెదుకుతున్నాం పదండి" అంటూ నా పెద్దకొడుకు వరండాలోకి దారితీశాడు.

పదిహేను నిమిషాలు గడవకముందే పాడె పైకిలేచింది. యింట్లో శ్లోకాలు తీవ్రస్థాయి నందుకున్నాయి.

పాడె ముందు పెద్దకొడుకు నడుస్తున్నాడు.

ఓ కొమ్ము నే నందుకున్నాను.

నేను కొమ్ము కాయడం చూసి-"అబ్బే మీ రెందుకు? నేను పడతానుండండి" అంటూ ఓ దూరపు బంధువు నా దగ్గర్నుంచి లాక్కోబోయాడు. కానీ నా తీవ్రమైన చూపులకు తట్టుకోలేక ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

"యిన్నేళ్ళుగా నా సేవకు అంకితమై పోయిన సుశీలకు ఈ మాత్రం కూడ చేయలేకపోతే యిప్పటివరకు బ్రతికిన నా బ్రతుకుకు అర్థం గోచరించదు" అనిపించింది.

పాడె స్మశానం చేరుకుంది.

బ్రతికుండగా తల్లి హృదయానికి మంటపెట్టినా, యిప్పుడామె చితి ముట్టించినందుకు నా పెద్దకొడుకును చూసి సుశీల ఆత్మ ఏమనుకుందో ఏమోగానీ, చితి ముట్టించి- కన్నతల్లి ఋణం తీర్చుకున్నానన్న తృప్తితో కామోసు నా పెద్దకొడుకు దీర్ఘంగా నిట్టూరుస్తూ వచ్చి నా పక్కన నిలబడ్డాడు.

క్షణాల్లో చితిమంటలు పైకి లేచాయి.

ఒక్కొక్కరే నెమ్మదిగా యింటి మొహం పట్టారు.

నా రెండోకొడుకు ఎప్పుడు జారుకున్నాడో తెలీదు..

చితి పూర్తిగా కాలి బూడిదయ్యేటప్పటికి నేను - నా పెద్దకొడుకు మాత్రం అక్కడ మిగిలాం.

అక్కడేవున్న తుమ్మచెట్టుకింద కూర్చున్న నా దగ్గరకొచ్చి, "నాన్నా యింటికివెళదాం పదండి" అన్నాడు.

నేను లేచి నిలబడ్డాను.

నా చొక్కాజేబులో చేయిపెట్టి సుశీల రాసిన వుత్తరం, ఆమె గొలుసు, ఏడు వందల రూపాయలున్న నా బ్యాంకు సేవింగుబుక్కు తీసి వాడిచేతిలో పెట్టాను.

"యిప్పుడివన్నీ నా కెందుకు నాన్నా! మీరు యింటికి పదండి ముందు" అన్నాడు.

"నువ్వెళ్ళు నేను కొంచెం సేపాగి వస్తాను" ఎక్కడ్నో నూతిలోంచి వచ్చినట్టనిపించింది నా మాట.

"నాన్నా! మీరు...." ఏదో చెప్పాలనుకుని నా మొహంలోకి చూసి ఆ ప్రయత్నం విరమించుకుని గబగబ నడిచి వెళ్ళిపోయాడు.

అప్పటివరకు నిగ్రహించుకున్న దుఃఖం కట్టలు తెంచుకుంది.

"సుశీలా! నిన్ను నేనే చంపుకున్నాను. నీ కోరిక ప్రకారం నీదగ్గరే వుంటే నువ్వు తప్పక బ్రతికుండేదానివి. కట్టుకున్న భర్త దగ్గరలేక, కన్నపిల్లల ఆదరణకు నోచుకోలేక ఆఖరిక్షణాల్లో నువ్వెంత నరక మనుభవించవుంటావో నే నూహించుకోగలను" చితిమీద పడి వెక్కివెక్కి ఏడుస్తున్న నాకు అకస్మాత్తుగా జ్ఞానోదయం కలిగినట్టయింది. నాలో వున్న నిర్వం ఏమైపోయిందో తెలీదుగానీ ఆవేశంతో ఒక్కసారి పైకిలేచి చితిమంట గుప్పెడు బూడిద తీసి నా జేబులో వేసుకున్నాను. దూరంగా వున్న సముద్రఘోష నా చెవుల్ని బ్రద్దలుకొడుతోంది. సరుగుడు చెట్ల పక్కనుంచి సముద్రంలోకి దారితీస్తున్న కాలిబాటమీద నేను పిచ్చిగా పరుగెడుతున్నాను.

—oxo—



నెలలో చివరి రోజు
కోడి కూసింది.
సూర్యుడు, ఎర్రటి కళ్లతో నిద్రలేచాడు
పక్షులు కిలకిల అంటున్నాయి.

**మహారాజు—కథ**

సుబ్బారావుకు మెళకువ వచ్చింది. కానీ కళ్లు తెరవలేదు.

పక్కమీదనుంచి లేవనూలేదు. కానీ గిన్నెలచప్పుడు, పెళ్ళాం, సుందరి సాధింపులూ, గొణుగుడు, వినుక్కోవటం వినపడుతూనే వున్నాయి. అలాంటి సమయంలో నిద్రలేస్తే, ఏం జరుగుతుందో సుబ్బారావుకు అనుభవైక

# యువ మహారాజు

## తారకరామారావు



వేద్యమే!

"ముండా సంసారం! వద్దు మొర్రో అంటే, చదువుకోనీయకుండా ఈ పెళ్ళిచేసి, రొంపలో తోశారు. తెల్లారి లేచిందగ్గర్నుంచీ వెధవపనితో ప్రాణం దాలొస్తున్నది!... హాయిగా మా అక్కలాగా చదువుకుని వుద్యోగంచేస్తే సుఖమన్నా దక్కేది—

"ఓసెవ్! మొద్దుముండా! లే!.... ఏరా కుంకా ఇంకా మొహంకడగటం కాలేదూ! ఉన్న పళ్ళపొడంతా తింటే రోగమొచ్చి చస్తావురా!.... అరేయ్ పెద్దోడా! స్నానం చెయ్యకుండా ఏం ఆటలురా! ఆ నీళ్ళన్నీ కారిపోతున్నాయ్—

వెధవ బొక్కైన. కొని రెండు నెలలు కాలేదు. అప్పుడే కారి వస్తున్నది."

ఇలా సుందరి పనస చదువుతుంది. సుబ్బారావుకు అప్పుడప్పుడు అనుమాన మొస్తుంది. నిజంగా సుందరికి సంసారం మీద విసుగూ జీవితంమీద విరక్తి, తనతో కాపురం అసహ్యమూ కలుగ చేశాయా? అని!

పెళ్ళయి, మొదటికాన్పు అయ్యేదాకా సుందరి చాలా ప్రేమగా, ఆశగా సుబ్బారావును కౌగలించుకునేది. అడపాదడపా మరీ మోహం కలిగితే. నిద్రనటించే భర్తను ముద్దుపెట్టుకునేది తియ్యగా! వేడిగా!

పిల్లలు వరుసగా పుట్టడం, మధ్యలో రెండుసార్లు గర్భస్రావం అవడంతో, సుందరం చీకేసిన మామిడితొక్కలా అయింది. జుత్తు బాగా వూడిపోయింది ఉన్న కాస్తంతా, సగం తెలుపు, సగం నలుపు. కళ్ళక్రింద నల్లగా చారలు. పొట్ట వచ్చింది. చీరకట్టు బిగించేచోట తెల్లగా అర. ఆ అస్థిపంజరానికి యింకో పొట్ట. కాన్పు వస్తే పిరికిపోస్తే ఎలా వుంటుంది? అలా అయింది సుందరి.

ఖర్చులు పెరగటం, దాంతో సమంగా ఆదాయం పెరక్కపోవడంవల్ల, మజ్జిగ పలుచన, ఇల్లు ఇరకాటం, కాఫీలో డికాషన్‌కంటె నీళ్ళు ఎక్కువపాలుం డటం, గుడ్డలు మరకలుపట్టడం, పగిలిన అద్దం, బల్బులేని గది, చెడిపోయిన ఫాను, ఇలా ఇంట్లో పరిస్థితి తయారైంది.

సుబ్బారావుకు ఓ వదినగారుంది. ఆవిడ చదువుకుని ఉద్యోగం చేసుకుంటు న్నది. ఆవిడకు పిల్లా పీచూ లేరు. ఎందు కంటే ఆవిడకన్నలు పెళ్ళే కాలేదు. ఆవిడ వివాహానికి వ్యతిరేకి గాదు. కానీ పెళ్ళి కాలేదు. అప్పుడప్పుడు వైరాగ్యశతకం వల్లిస్తుంది.

"వెధవపెళ్ళి లేకపోతేనే సుఖం, ఉద్యోగం చేసివచ్చి, ఏ అర్ధరాత్రి మొగు డన్నవాడు చేరదిస్తే, అహా ఇదే నా భాగ్యము అని మురిసిపోయి, పిల్లల్ని కని, ఇంటిల్లిపాదికీ ఊడిగంచేసి. ఛీ! నా కొద్దుబాబోయ్!" అంటుంటుంది.

... కానీ సుబ్బారావు ఆమె మాటలు కొన్నాళ్ళు నమ్మాడు. ఆవిడకు నిజంగా నే పెళ్ళి ఇష్టంలేదనీ భావించాడు. బావమరిది పెళ్ళికెళ్ళినప్పుడు, కూచునేందుకూ నడుం వాల్చినా పడుకునేందుకూ చోటు లేక, వీలుగా వుంటుందని, ఓ మూలగా వున్న సరుకులగదిలో, బియ్యంబస్తాని ఆనుకు నిద్రపోతున్న సుబ్బారావుకి, మెళకువవచ్చి చూస్తే....

సుందరి అక్క, ఆ గదిలో కొచ్చి, ముసుగుపెట్టి బస్తాకు ఆనుకునివున్న సుబ్బారావుని ఏ మూటో, వస్తువో అను కుని, తాపీగా జాకెట్, ఆ తర్వాత బ్రా, ఆ తర్వాత చీర తొలగిస్తుండగా,

సుబ్బారావుకు మెలకువ వచ్చింది. అంతేగాదు, తుమ్మను కూడ తుమ్మాడు. అప్పుడు, ఆ వదినగారు చెక్కుచెదరక, తొణకక, సుబ్బారావువేపు చిలిపిగా చూసి నవ్వింది. సుబ్బారావుకు వళ్ళు గగుర్పొడిచింది. ఆమె మాత్రం కాపీగా చీర మార్చుకుని, బ్రా వేసుకుని, "అలా చూస్తారేం? వచ్చి సాయంచేస్తే మీ పాతివ్రత్యానికేమన్నా భంగమా?" అంది. సుబ్బారావుకు హుషారొచ్చి, బ్రా హుక్ పెట్టి, అంతటితో వూరుకోక ఆమె బుగ్గన ఓ వేడిముద్దు పెట్టుకున్నాడు! అప్పటికీ ఆమె తొణక్కుండా, "ఏమో? అనుకున్నాను! మీరూ సరసులే!" అని గట్టిగా మీద పడి కౌగిలించుకో ప్రయత్నం చేస్తుండగా .... తలుపు చప్పుడైంది. లేకపోతే?....

సుబ్బారావుకు ఆ సమయంలో పాత మధురస్మృతులు గుర్తుకొచ్చాయి. హుషారుగా మంచంమీదనుంచి లేచాడు.

"ఇదిగో! ఇలా పట్టినీళ్ళు పోస్తే రేపట్నుంచీ వాడుక మానెయ్యి. బూత్ పాలు చౌక అవి తెచ్చుకుంటాం! డబ్బాపోయి, కవిపట్టుకున్నట్లయింది" అని సుందరి పాలవాణ్ణి గదమాయిస్తోంది.

"త్వరగా రండి! కాఫీ కలుపుతున్నా."

సుబ్బారావుకు ఖాళీ పళ్ళపొడి డబ్బా ప్రత్యక్షమైంది. పేస్ట్ క్రితం నెలలో తేలేదు! ప్రక్కింటి పొయ్యిదగ్గర ఇంత బూడిద తీసుకుని, పళ్లు తోమేసి, టాటాకుతో నాలుక గీసేసుకుని, కాఫీ పుచ్చుకున్నాడు.

ఇద్దరు పిల్లలూ, బడికి బయలుదేరుతూ సుబ్బారావు దగ్గరకొచ్చారు. 'మామూలు' కోసం! జేబులు వెతికితే ఓ అర్ధరూపాయి బిళ్ళ దొరికింది. అదిస్తే బస్సులో టిక్కెట్‌కు వుంటవు

"ఒరేయ్! సాయంత్రం స్వీట్సు తెస్తా! వెళ్ళండి" అన్నాడు.

"ఎప్పుడూ తెస్తానంటావ్! తేవు!"

ఆడపిల్ల అన్నది. సుందరి ఆ మాట దొరకపుచ్చుకుని, "అంతేనమ్మా! మీ నాన్న ఏదీ కాదు, తేమ అనరు మాటల్లో! చేతలు మటుకు శూన్యం!" అనంది.

పిల్లలు బడికెళ్ళారు.

సుబ్బారావు వెళ్ళి, సుందరి వంట చేస్తుంటే అక్కడ కూర్చున్నాడు.

"ఏం? ఇలా తగలబడ్డారు! తీరిగ్గా."

"నా బ్రతుక్కి అదొక్కటే తక్కువ!"

"ఏం ఇప్పుడు మీకేం తక్కువైంది! మహారాజులాంటి భర్త, ఆణిముత్యాల్లాంటి బిడ్డలు!" అని బుగ్గమీద సుతారంగా చిటికేశాడు.

సుందరి, సుబ్బారావు చెయ్యిని సాధ్యమైనంత కోపంగా విసరికొట్టింది. ఆమె

కళ్ళల్లో నీళ్లు సుళ్లుతిరిగాయి: "అవును ఏం తక్కువ: చీరలు, నగలు, స్వంత ఇల్లు, పనివాళ్లు: అబ్బో! మీరు తెచ్చే లక్షలు: వంటకు, ఇంటిపనికి నేనున్నా. చాలు!" ఆమె గొంతులోంచి చివరి మాటలు తడిసి ముద్దగా వచ్చాయి.

సుబ్బారావుకు క్షణం ఏంచెయ్యాలో, ఎలా ఆమెను సముదాయించాలో తెలియ లేదు: ఆమె మాటలు గుండె లోతు ల్లోంచి వచ్చాయని మాత్రం సుబ్బారావు గ్రహించాడు. గొంగళిపురుగులా ఆ భావ నతో ముడుచుకుపోయ్యాడు క్షణకాలం:

"నాలాంటి అసమర్థుడిని కట్టుకున్నం దుకు శిక్ష: అవునా?" ఆ గొంతులో నిస్స హాయత, జాలితనమూ వున్నాయి.

"నా ఖర్మకు ఎవరు బాధ్యులు లేండి!" సుందరి లేచి వెళ్ళిపోయింది అక్క ణ్ణుంచి.

సుబ్బారావుకు సుందరి మనసు తెలుసు. ఉన్నదాంట్లో పొదుపుగానే సుందరి సంసారం ఛిద్రమవకుండా చేస్తు న్నది. అయినా నిత్యావసరాలు పెరుగు తూనే వున్నాయి. ఎలా?

ఇందుకు సుబ్బారావుకు ఓ పథకం వుంది: దాన్ని అమలుపరిస్తే ఆర్థిక ఇబ్బం దులు తొలుగుతాయని సుబ్బారావు నమ్మకం. ఆ పథకంలోని వివరాలు చెప్పకుండా సుందరికి ఓ ముక్క చెప్పాడు ఇదివరలో. అదేమిటంటే?

"మీ అక్క ఈ వూరు బదిలీ చేయించుకుంటే, అందరం కల్సే వుండొచ్చు!"

"ఏం? దాని బ్రతుకూ పాడుచేద్దామనా మీ ఉద్దేశ్యం!" అనంది.

సుబ్బారావు రెట్టించి తన ఉద్దేశ్యం వివరణపూర్వకంగా చెబుదామని అను కున్నా సుందరి పడనీయలేదు. "మీ ఆలో చన నాకు తెల్సు. నా బొందిలో ప్రాణ ముండగా అది ఇక్కడకు బదిలీచేయించు కుని వచ్చి నా యింట్లో వుండేందుకు వీల్లేదు!"

"నా మీద నమ్మకం లేదా?"

"అవన్నీ నా కనవసరం: నా సంసా రంలో చిచ్చుపెట్టుకునేంత అమాయకు రాల్నేం గాదు. అయినా దానిజోలి మీ కెందుకు: దాని తిప్పలు అది పడుతున్నది మనింటికొచ్చి మనల్నేం ప్రాధేయ పడనూలేదు!"

"అహ! అదికాదు: కొంచెం డబ్బు అడిగి తీసుకుంటె-అప్పుక్రింద అనుకో!"

"అంత మీకు వూళ్ళో పరపతి లే పోతే, ఇవిగో, గాజులు తీసుకెళ్ళి అమ్మేసి, మీ అవసరాలు తీర్చుకోండి అంతేగానీ, నా పరువు తీసుకెళ్ళి దా దగ్గర తాకట్టు పెట్టకండి!"

సుబ్బారావు పథకంప్రకారం సుంద

అక్కకు వంభయ్యేళ్లొచ్చాయి కనుక పెళ్ళికాదు. తను అందగాడు కాకపోయినా, కాస్త రుచిగా తిని, మంచి గుడ్డ లేసుకుంటే కంటికి నదరుగానే కనపడతాడు. సుందరి వంటకూ, ఇంటిపనికీ తప్ప, శృంగారానికి పనికిరాదు. ఇద్దరూ అక్కచెల్లెళ్లే కనుక పెద్దగా రాద్ధాంతం వుండదని అనుకున్నాడు.

"ఇంకా అలాగే కూర్చున్నారేం? స్నానం చెయ్యండి. పంపు ఆగిపోతుంది"

సుబ్బారావు లేచి స్నానాలదొడ్లోకి వెడుతుంటే, మేడమీద గదితలుపు తీసి వుంది. గదిలో వుండే రాజారావును పలకరిద్దామని మేడమీదకెళ్ళాడు.

రాజారావు నిద్ర లేవలేదు. పరుపు మాసివుంది ఓ ప్రక్కగా. రాజారావు మరో ప్రక్కన పడి నిద్రపోతున్నాడు. సిగరెట్ పీకలు, అగ్గిపుల్లలు గదినిండా పడివున్నాయి. అలమార్లో ఖాళీ బీరు సీసాలు, నగం వదిలేసిన తినుబండారాలు వున్నాయి. గోడలకు అంటించిన అర్ధనగ్న సుందరీమణుల బొమ్మలు ఒక మూల కుప్పగా దుమ్ము, అరటి తొక్కలు!

"రాజారావుకేం? యువరాజు" అనుకున్నాడు సుబ్బారావు.

"మాష్టారూ టైమెంత?"

"నువ్వు మేలుకునే వున్నావుటోయ్!.. టైము ఎనిమిది దాటివుంటుంది!"

"మీ రెళ్ళేప్పుడు తలుపు దగ్గరకేసి వెళ్ళండి!" రాజారావు లుంగీ సరిచేసుకుని, దుప్పటి కప్పుకున్నాడు.

అలమారలోంచి పాత వారపత్రిక తీసుకున్నాడు, సుందరికి కాలక్షేపం అవుతుందని. పత్రిక తీస్తుంటే దానిక్రింద ఐదురూపాయలనోటు వుంది. సుబ్బారావు తీసుకున్నాడు. తిరిగి వస్తూ, రాజారావు ప్రక్కనవున్న సిగరెట్ పెట్టెలోంచి ఓ సిగరెట్ తీసి వెలిగించుకుని తలుపు దగ్గరేసి, క్రిందకు వెళ్ళిపోయాడు

**యువరాజు కథ**

రాజారావుకు, కళ్ళమీద, కిటికీలోంచి ఎండపడి చురుక్కుమనేసరికి మెళకువ వచ్చింది. ప్రక్కనేవున్న గడియారం తీసి చూశాడు టైము. గడియారం ఆగిపోయింది గది బయటకొచ్చి చూశాడు! క్రింద వాటాల్లోవున్న పురుషులెవరూ కనబడలేదు. ఎదురింటి మేడమీది నర్సు, ఆస్పత్రికి బయలుదేరుతున్నది. ఎవరింటి రేడియోలోనూ పాటలు రావడంలేదు.

రాజారావు త్వరత్వరగా బ్రష్ తీసుకుని పళ్లు తోమేశాడు. బక్కెట్లో కాసిని నీళ్ళుంటే ముహంకడిగేసుకుని, స్నానం సాయంత్రం అని తీర్మానించుకుని. ముహానికీ, చంకల్లోనూ పౌడరు దట్టించేసి, లాగు, చొక్కా తగిలించేసుకుని




గదికి తాళంవేసి రోడ్డునపడ్డాడు.

రాత్రి పుచ్చుకున్న మందు తాలూకు, తలదిమ్ము తగ్గలేదు. పైగా ఆకలిగావుంది. కనబడ్డ ఆటో ఎక్కేసి 'పో సీ య్' అన్నాడు.

రాజారావు ఈ నెలలో ఇప్పటికే మూడుసార్లు ఆఫీసుకు ఆలశ్యంగా వెళ్ళాడు. మరోసారి ఆలశ్యమైతే ఓ రోజు సాధారణ శలవు, హాఫ్ కాకి అవుతుంది.

దారిలో ఆటోడ్రైవరును అడిగాడు "టైమెంతా" అని - చెప్పాడు ఐదు నిముషాలు! అంతే! అసహనంగా కూర్చున్నాడు ఆటోలో. సరిగ్గా యింకో వంద గజాల్లో ఆఫీసుందనగా ట్రాఫిక్ ఆగిపోయింది.

కేకలు.

నినాదాలు.

పోలీసు వ్యాన్లు.

జనం!

"ఏమైంది!" రాజారావు ఆటోలోంచి తల బయటకు పెట్టి చూశాడు.

ఏవేవో నినాదాలు - కాలేజీ కుర్రాళ్ళు రోడ్డుమీద బైఠాయింపు సమ్మె చేస్తున్నారు.

రాజారావుకు తొందరెక్కువైంది. పోనీ దిగి నడిచివెడితే.

"పదికి చిల్లరుందా!"

"రూపాయి తక్కువుంది!"

పది ఇచ్చేసి, చిల్లర పుచ్చుకోని రోడ్డు కడ్డంగా పడి, జనం మధ్యలోంచి, పరుగులా ఆఫీసులోకెళ్ళాడు. రిజిష్టరువుంది. హమ్మయ్య లేచిన వేళావిశేషం బావుంది అనుకుని హాజరైనట్లు సంతకం పెట్టేశాడు. అప్పటికి మనసు కుదుటపడ్డది.

తిన్నగా పనిచేసే సెక్షను కెళ్ళాడు.

సుజాత తప్ప అందరూ తమతమ కుర్చీల్లో వున్నారు. సూపర్నెంట్ దగ్గరకెళ్ళి నమస్కారం చేసి నవ్వాడు.

"ఏం? పర్మిషనా?"

"టిఫిన్ తినేసివస్తా! ఇన్‌స్టెడ్ ఆఫ్ ఎవర్!"

"వెళ్ళు నాయినా! నీకేం యువరాజువి! టిఫిన్‌కని వెళ్ళి అలాగే వెళ్ళకు ఇవ్వాళ జీతాలిచ్చేరోజు."

"అలాగే సార్!"

వరండాలో సుజాత కనుపించింది. "వస్తారా! కాఫీ తాగుదాం!" అన్నాడు.

"హెడ్ ఏమంటాడో!"

"నే చెబుతాలే రాండి!" రాజారావు చొరవగా చెయ్యిపుచ్చుకున్నాడు.

ఇద్దరూ వెళ్ళి ఫ్యామిలీరూంలో కూర్చున్నారు. సుబ్బారావు ఏకంగా బాదగిలబడ్డాడు సిగరెట్ త్రాగుతూ!

"ఏం! రాత్రి కిక్ తగ్గలేదా?"

రాజారావు నవ్వాడు.

"ఇలా రోజూ త్రాగితే లివర్ పాడవదూ! అయినా మీ రెందుకు పెళ్ళిచేసుకోరూ?"

"నిజం చెప్పనా?"

"ఊ!"

రాజారావు లేచి కూర్చుని, ముందుకు వంగి, సుజాత బుగ్గ గిల్లి, "నువ్వు 'ఊ' అనందే!" అన్నాడు.

సుజాత తల వంచుకుని, "మీరు చెప్పింది నిజమా! అబద్ధమా!" అనంది.

"నిజమే. సుజీ!"

సుజాత రాజారావు కళ్ళల్లోకి సూటిగా చూసింది! రాజారావు కన్నుకొట్టాడు చిలిపిగా!

"మిమ్మల్ని నమ్మొచ్చా!"

"అంటే"

"మీ రిలా ఎంతమందితో అన్నారో!"

బేరర్ వస్తే, "రెండు మసాలా దోసె" అని చెప్పాడు రాజారావు

"నాకొద్దు!"

"ఏం!"

"అన్నం తినొచ్చాను!"

"రెండు వక్రటావోయ్!"

బేరర్ వెళ్ళాక, రాజారావు మరో సిగరెట్ ముట్టించి, "చూడు అమ్మలూ! నువ్వు వచ్చావు! ఓకే అంటే చెప్పు! మ్యారేజీ చేసుకుందాం!" అన్నాడు.

సుజాత ఏం సమాధానం చెప్పాలో తెలియక ఉండిపోయింది. రాజారావు క్రొత్తగా ఉద్యోగంలో చేరాడు. డబ్బు ఖర్చుచెయ్యడం, అప్పులివ్వడంవల్ల పని చెయ్యకపోయినా ఆఫీసులో ఎవ్వరూ ఏమీ అనరు. అందరూ అనుకోవడం ఆతనికి భూములూ, రైసుమిల్లులూ వున్నాయని! నిజానిజాలు తెలియవు అలాంటి మనిషితో వివాహం జరిగితే?

"డియర్ సుజీ! నన్ను నమ్మవా?" రాజారావు వెళ్ళి, సుజాత ప్రక్కన కూర్చుని, ఆమెమీద చెయ్యివేసి, చిన్నగా నొక్కాడు భుజాన్ని.

"నాకిలాంటివి ఇష్టంలేదు!" ప్రక్కకు జరుగుతూ అంది సుజాత.

"పోనీ ఆలోచించి చెప్పు!"

ఇద్దరూ టిఫిన్ తిని ఆఫీసు కెళ్లారు.

సుజాత రాజారావు చెప్పిన మాటల మత్తులో ఆఫీసుకెళ్ళింది. రాజారావు మధ్యాహ్నందాకా ప్రతి గదిలోకి వెళ్ళి మిత్రులను పలకరించి, రెండుగంటలకు జీతంతీసుకుని హెడ్ గారికి నమస్కారం కొట్టేశాడు.

"వెళ్లు నాయినా! మా కెలాగూ ఈ బదవా చాకిరీ తప్పదు! వెళ్ళు!"

రాజారావు సుజాతదగ్గరకెళ్ళి "సినిమా కెళ్దామా?" అనడిగాడు రహస్యంగా.

"నాకు పెళ్ళికిముందు ఇలా తిరగటం ఇష్టంలేదు!"

రాజారావు భుజాలెగరేసి, తిన్నగా మిత్రుడు యాదగిరిదగ్గర కెళ్ళాడు.

"పద పోదాం!"

"ఎక్కడికి?"

"ముందు లే! తర్వాత ఎక్కడికో చెబుతాను!"

యాదగిరి లేవక తప్పలేదు. ఆఫీసు ఫైళ్ళు కట్టగట్టేసి, పర్మిషన్ తీసుకు వచ్చాడు.

రాజారావు, యాదగిరి ఆటో తీసుకుని సెంటర్ కెళ్ళి బార్ లోకి వెళ్ళారు.

"ఇందాక సుజాతతో తిరుగుతున్నావ్? ఏమిటి సంగతి?"

"నువ్వెప్పుడు చూశావ్?"

"ఎప్పుడు చూస్తే ఏం? కెందుకుగానీ, సంగతి చెప్పు! ఏమంటున్నది?"

యాదగిరికి రాజారావు దినచర్య తెలుసు.

"బెదురుగొడ్డురా! ముట్టుకుంటె ముడుచుకుపోతున్నది!"

"పెళ్ళిచేసుకుంటా నవలేదూ!"

"అన్నా! పెళ్ళయితేగాని లాభం వుండేలా లేదు!"

"చేసుకో!"

"దాన్నా!" రాజారావు నవ్వాడు.

ఇద్దరూ మందు పుచ్చుకోవటం మొదలెట్టారు. ఒక్కొక్క పెగ్గూ లోపలకు పొయ్యేకొద్దీ రాజారావులోని మనిషి బయటకు రాసాగాడు.

"అరేయ్! యాదగిరీ! ఇక్కడ కనబడే ఆడాళ్ళంతా ప్లాస్టిక్ పువ్వులురా! అంతే! తిండికోసం మొగుడుంటే చాలు. భయంలేదని నమ్మేవాళ్ళే. వీళ్ళతో పెళ్లేమిటిరా! మా వూళ్ళల్లో ముద్దమందారంలా వుండే పిల్లలున్నారు. అసలు మా పైదున్న బోగంది వీళ్ళకన్నా వేయిరెట్లు

వయం! ఆయినా బ్రెదరూ— ఈ నైలాన్ చీరలో అందాలు, ఓ రాత్రికే సరి! అంతే పట్టుచీరల్లో బిగారంముద్దల్లాంటి పిల్లలు లక్షరూపాయల కట్నంతో మా యింటిముందు పడిగాపులు పడివున్నారు! తెల్సా!"

"మరి పెళ్ళిచేసుకోరాదూ!"

రాజారావు కళ్ళు ఎరుపెక్కాయి.

"మా యింటిక్రింద సుబ్బారావని ఓ గుమాస్తాగాడున్నాడు! వాడికి ముగ్గురు పిల్లలు! పెళ్ళాం అది పెళ్ళాంగాదు పీనుగ! వీడు సుబ్బారావు దాంతో కాపురం హెల్! వాళ్ళను చూస్తే భార్యాభర్తల్లా వుండరు! కసిగా పోట్లాడకుంటూ యే బజారుకుక్కలో! అలా వుంటారు! అమ్మ బాబోయ్! పెళ్ళిచేసుకుంటే, నేనూ ఆ సుబ్బారావులా అయితే!"

"ఇలా పైలాపచ్చీసుగా ఎన్నాళ్లురా!"

"సాగినన్నాళ్ళు! సుజాత అంతు చూస్తాలే! పెద్ద పతివ్రత కబుర్లు! మెహ రున్నిసా కేసు తెలుసుగా! పెళ్లో అని వెంటబడ్డది. దాని కడుపుకు నేను బాధ్యుడ నట! ఛీ! పోవె నీయమ్మ! మళ్ళీ కంట బడితే చంపేస్తానన్నా! అంతే! మళ్ళీ కనబడలా!..."

యాదగిరి సాయంత్రం వస్తానని వెళ్ళాడు! రాజారావు ఒంటరివాడైనాడు. ఏం చెయ్యాలి!

ఆటో ఎక్కి బ్లూఫిలిం చూసేందుకు వెళ్ళాడు రాజారావు ఎరుపెక్కిన కళ్ళతో!

మహారాజు కథ

సుబ్బారావు గుండెలమీద సుందరి పడుకొనుంది. ఆమె తలలో సంపెంగ పూలు గదినంతా సువాసనతో నింపాయి.

సుబ్బారావుకు చాలా సంతోషంగా వుందిప్పుడు. సుందరి చాలారోజుల తర్వాత ప్రేమగా సుబ్బారావును కౌగ లించుకుని పడుకొనుంది. ఆమె కళ్ళల్లో తృప్తి సుబ్బారావును యౌవ్వనపు రోజు ల్లోకి తీసుకెళ్ళింది.

.... ఆ రోజుల్లో సుబ్బారావు యువ రాజులా గడిపాడు. దిగులూ, చింతా లేని బ్రతుకు. తినడం, తిరగడం, పుస్త కాలు చదవడం. సాయంత్రం మిత్రు లతో ఏ గుడి ఆవరణలోనో, కాలవగట్టు ప్రక్కనో రాజకీయాలు, సాహిత్యం, నాటకాలు గురించి చర్చించుకోవడం!... ఆ రోజులు మళ్ళీ రావేమో!

సుందరి.... నిజంగా దేవతే! పిల్లల్ని చక్కదిద్దుకుంటుంది. తన సంపాదనలో గుట్టుగా కాపురం చేస్తున్నది.... ఇలాగే జీవితం సాగితే కావల్సిందేముంది!

ఇలా సుబ్బారావు గతకాలపు మధుర స్మృతులు, భవిష్యత్తులోని సుఖమయ జీవితంగురించి కలలు కంటుండగా,

ఆటో చప్పుడైంది. ఆ తర్వాత

తలుపు చప్పుడైంది. 'సుబ్బారావుగారూ' అనడం వినపడ్డది.

సుబ్బారావు కలం అలలనుంచి మేల్కొన్నాడు. సుందరీ వెంటవచ్చింది ఏమిటా అని!

రాజారావు ఎదురుగా. తలకు చేతికి చిన్న కట్టు, లాగు మోకాలిదగ్గర చినిగింది!

"ఏమైంది?"

"తర్వాత చెబుతా! ఓ పదుంటే ఇవ్వండి!"

సుజాత తెచ్చి ఇచ్చింది, రాజారావు వాడికిచ్చి పంపేశాడు.

సుబ్బారావు తెచ్చిన కుర్చీమీద కూర్చున్నాడు రాజారావు.

"ఇప్పుడు చెప్పండి ఏమైందీ?"

"ఫ్రెండుదగ్గరి కెళ్ళవస్తుంటే యాక్సిడెంట్ అయింది! డబ్బులూ పోయాయి!"

"అరెరె! మందేసుకున్నారా! నొప్పిగా వుందా!"

"ఉందండి బాబు! చాలా నొప్పిగా వుంది! వెళ్ళి పడుకుంటాను. మీ డబ్బు రేపిస్తాను!"

"అలాగే! నేను మీ కివ్వాల్సింది ఇంతకుముందో అయిదు! ఇవ్వాళ ఉదయం ఓ ఐదు తీసుకున్నా!"

రాజారావు లేచాడు.

"తమ్ముడూ! ఈ వేడిపాలు తాగు!" సుందరి వచ్చింది!

రాజారావుకు ఏడుపొచ్చింది. బాధని దిగమింగుకునే పాలు త్రాగాడు. గ్లాసు యిస్తూ ఆమెకు మనస్సులోనే నమస్కరించాడు. 'తమ్ముడూ' అన్నందుకూ! తన ఆకలి గుర్తించి పాలిచ్చినందుకూ!

**రాజు-యువరాజు యువమహారాజు**

నెలలో ఒకరోజు మరణిస్తున్నది. మరోరోజు మరికొద్దిసేపట్లో ఉదయిస్తున్నది. మళ్ళీ కోడి కూస్తుంది.

సూర్యుడు మళ్ళీమళ్ళీ పుడుతూనే వుంటాడు. పక్షులు కిలకిలా అంటూనే వుంటాయి!

రాజారావు ఆ రాత్రి తీర్మానించుకున్నాడు. పెళ్ళిచేసేసుకోవాలి!

సుబ్బారావుకేం? మహారాజు! తిన్నా తినకపోయినా రోగమొచ్చినా సేవచేసేందుకు భార్యవుంది!

అదే సమయంలో సుబ్బారావూ అనుకున్నాడు? ఏమనీ?

రాజారావుకేం అదృష్టవంతుడు. బాదరబందీలు లేవు! యువరాజులా తిరుగుతాడు! అని.

—కానీ—

నిన్నటి యువరాజే నేటి మహారాజు
నేటి మహారాజే నిన్నటి యువరాజు

—అని—

చాలామందికి తెలియదు అనలేం!

—మర్చిపోతారు—

—అంతే—

**

# ప్రసవించే పాషాణాలు

—డాక్టర్ దాశరథి

రాళ్లు పూస్తున్నాయి
కళ్లు వ్రాస్తున్నాయి
కవితామయ ప్రణయలేఖలు;
కలాలకు పనిలేకుండా చేస్తున్నాయి!

కుసుమ ఝుంఝు వీస్తున్నది
వసంత సేన వస్తున్నది!
యెండిన మోడులలో సైతం
గుండెలనిండా చైతన్యం కనిపిస్తున్నది.

మదించిన కుంజరంలా
మధుమాసం; కాంచన పంజరంలా
ఈ లోకం— దర్శనీయంగా వుంది
మ్రోగుతున్న నృత్యాంగన మంజీరంలా

వద్దంటే కురుస్తున్నాయి పూలవానలు
ప్రవహిస్తున్నాయి వలపుతేనె సోనలు
ప్రియులకోసం ముస్తాబైన ప్రేయసీ
మణుల్లా
అలంకృత తరులతామయములు అడవి
కోనలు

లాటరీలో గెలిచినవారి గేహంలా
చిరకాలం పిమ్మట కలిసిన దోస్తుల
స్నేహంలా
ఆనందోల్లాస భరితమీ ప్రపంచం
మొదటిరేయి వధూవరుల మోహంలా

దుఃఖ భాజనమైన ఈ లోకంలో
అనంత దరిద్ర జనావళీ శోకంలో
సుఖశాంతులకు సంకేతం వసంతం
నరులపాలిటి భూలోక నరకంలో

వకుళ కుసుమ వజ్రాయుధంతో
రమణీయ మలయానిల రథంలో
బండల్లాంటి గుండెల్ని బద్దలుకొడతాను
పయనిస్తాను ప్రశాంత వాసంత పథంలో

మహీమండలి నిండా మామిడి పిందెలు
ప్రతి ఇంటి ముందరా పానకం బిందెలు!
విశ్రుత విహారంచేస్తున్న మదన
సైన్యంతో
మనోహరంగా వున్నాయి మలుసందెలు

ముద్దులతో భ్రమపెట్టే పెద్దలెందుకు?
కత్తులతో నిర్మించే గద్దెలెందుకు?
తెల్లదొరల విధానాలనే అనుసరించే.
మనోవికాసం కలిగించలేని విద్దెలెందుకు?

ఉగాది రాకతో జగమంతా మారుతుంది.
వసంతాగమనంతో వసుధ అంతా
మారుతుంది
ఎన్నిమారినా, యెంత పుష్పవర్షం
కురిసినా
ఎప్పుడు మానవ పాషాణ హృదయం
మారుతుంది?




# తొమ్మిది

రావిచెట్టు

'రావిచెట్టు రమ్మంది చూడు

తంత వుంది దాని క్రింద నేడు'–తనలో తానే హుషారుగా పాడుకుంటూ–ఒంటరిగా రావిచెట్టు క్రింద కూర్చుని – బ్రహ్మజ్ఞాని తనలో తానే పేకముక్కలు ఆడుకుంటున్నాడు. తక్కిన మహాజనం యింకా రాలేదు. పరమ వేదాంతియైన వేదాంతాచార్యులవారు కుంటుకుంటూ దిగబడ్డారు హుషారు మేస్తున్న బ్రహ్మజ్ఞానిని చూసి ముఖం చిట్లించుకుని మౌనంగా రావిచెట్టు మొదలుకు ఆనుకుని జారగిలబడి కూర్చున్నారు.

'నీకు సాటి ఎవ్వరంటి రాణి_

నీకు సాటి లేరంటి రాణి' ఆచార్యులవారిని చూసి రెచ్చిపోయాడు బ్రహ్మజ్ఞాని. అతన్ని ఆ పరగణాలో అబాలగోపాలం- 'మిడిల్ డ్రాపు' అని పిలుస్తారు. మరీ చనువున్నవాళ్ళయితే - 'ఒరేయ్! మిడిల్ శ్లోకం' అని పిలుస్తారు. బ్రహ్మజ్ఞాని అంటే తెలియనివాళ్ళుండవచ్చు - కాని 'మిడిలు' అంటే తెలియని మనిషి ఆ ఏరియా మొత్తంమీద కనిపించడు. ముద్దుపేర్లకున్న ప్రభావం అసలు పేర్లకు రావు. ఎంత పేరున్నవాళ్ళకైనా ఈ సూత్రం వర్తిస్తుంది. ఒకొక్కళ్ళకు జీవితంలో ఒక రకంగా పేరొచ్చిపడుతుంది, బ్రహ్మజ్ఞానికి వచ్చింది ఆ పరిగణా యావత్తూ. అయనలో దివ్యశక్తులున్నాయని జనవాక్యం. పాములు కాటేసినా, మంత్రగద్దలు పట్టుకు పీకినా, తేళ్లు కుట్టినా ఆయన మంత్రం వేస్తాడు. పెళ్ళిళ్ళకూ, శార్థాలకూ, తద్దినాలకూ, శోభనాలకూ ముహూర్తాలు పెడ్తాడు తమకు పుట్టబోయే బిడ్డ ఆడో, మగో ముఖం చూసి గణితం వేసి చెప్తాడు. ఆ గణితం నిజమైన ఉదంతాలున్నాయి. ఎవరికైనా దయ్యంపడితే మంత్రబలంతో వదిలిస్తాడు. ఆయన నీడను చూసినా - కొరివిదయ్యాలూ బ్రహ్మరాక్షసులూ కూడా గంగవెర్రులెత్తి పారిపోతాయని వినికిడి. చాలా గొప్పవాళ్ళ శార్థాలు కూడా ఆయన పెట్టించాడట. ఎంత మర్డర్లుచేసిన ఖూనీకోరైనా, ఎన్ని కొంపలు కూల్చిన కిరాతకుడైనా-ఆయనగారు శార్థం పెడితే వరాసరి వ్యర్గలోకానికి పోతారట.

బ్రహ్మజ్ఞానికి మొత్తం పన్నెండు పదమూడు శ్లోకాలు వచ్చు. అవి పైకి స్పష్టంగా చదవడు. రహస్యంగా తనలో తానే గొణుక్కుంటాడు. అంచేత ఆయనకు ఖచ్చితంగా ఎన్ని శ్లోకాలు వచ్చో అనేది ఒక నిగూఢ రహస్యం. మరో అయిదారు ప్రవచనాలు కూడా వచ్చు ఆయనకు. ఫర్ ఆల్ అకేషన్లకూ పనికొచ్చేవి అవి. వాటిని ఎడా పెడా వాడి హడలగొట్టేస్తూవుంటాడు జనాన్ని. బ్రహ్మజ్ఞానికి చేతబడి మంత్రాలు కూడా వచ్చుని - నీచశక్తుల్ని ఆరాధించటం అతని సంప్రదాయమని ఎందరికో ఒంటరిగా రహస్యంగా చెప్పారు వేదాంతాచార్యులవారు.

'ఏమిటి బ్రహ్మజ్ఞానీ! ఇవాళ అందరికంటె ముందస్తుగానే వచ్చేశావ్ పేకముక్కలుచ్చుకుని. ఒంటరిగా నువ్వే పాడుకుంటూ, నీతో నువ్వే ముక్కలు పంచుకుంటూ, తుపాకి తూటాలమాదిరి ఎడా పెడా నువ్వే నీమీద విసురుకుంటూ

ఆడేసుకుంటున్నావ్ నీతో నువ్వే అలా హుషారు మేసేస్తూ? ఏమిటి గిరాకీ?' అన్నారు ఆచార్యులవారు.

'అతీను మదాం స్వామీ? ఈ రాణి సాయంతోనే నిన్న అందరికేటలూ దులిపేశాను. ముద్దొస్తూంది.'

'రాకా చస్తుందా జ్ఞానీ? ఈ రాణీగారి సాయంతోనేగా నిన్న అందరినీ పట్టి కొట్టించి – జేబులు ఖాళీచేయించి – నెత్తిన గుడ్డలువేసి పంపించావ్? అందుకే అదిభట్ల హరిదాసుగారన్నట్టు – పురుషుడి విజయానికైనా పతనానికైనా స్త్రీ అనే బ్రహ్మపదార్థమే కారణమయ్యా, అదే ప్రేరణ '

'నిన్న చూశారుగా? అంతకుముందు రోజూ నా దగ్గర నిత్యం పాతికా పరకా తవరంచేసేవాళ్ళు పతులు. చూశాను చూశాను. నిన్న మదాంకు కన్ను గొట్టాను. నా మూడో కన్ను తెరిచాను. అతీనుమదాం నన్ను కరుణించింది. అంతే చప్పబడిపోయారు చప్పుపీనుగలు.' అంటూ పకపకా నవ్వాడు బ్రహ్మజ్ఞాని. 'ఇంక నాకు తిరుగులేదు. చూపెడతా నా తడాఖా. తమరూ కలుపుతారా ఒక చెయ్యి నాతో. రుచి చూద్దురుగాని' అంటూ మన్నగా తవరంచేసుకున్న దుర్యోధనుడిలా మీసం దువ్వి ఒక కనుబొమ్మమాత్రం పైకెత్తి – కీచకత్వంతో చూస్తూ వికటాట్టహాసం చేశాడు బ్రహ్మజ్ఞాని ఆ క్రితంరోజు పేకాటలో గెల్చిన కైపులో.

వరదాచార్యులవారి వళ్లు మండిపోయింది. ఆ రావిచెట్టుక్రింద చతుర్ముఖ పారాయణానికి చేరే తమారమి అరడజనుమంది పెద్దమనుష్యులలో ఒకరంటే ఒకరికి పడదు. కాని ఒకరిని విడిచి ఒకరు ఒక్కరోజు కూడా బ్రతకలేరు. ఆచార్యులవారికీ బ్రహ్మజ్ఞానికీ అసలు పడదు. ఇద్దరి మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది. ఆ కారణంగా బ్రహ్మజ్ఞాని నవ్వు – నరమాంసభక్షణచేసే రాక్షసుల అట్టహాసంలా వినిపించింది ఆచార్యులవారికి. కొండంత ఆగ్రహం వచ్చింది.

'బ్రహ్మజ్ఞానీ! నిన్న అతీనుమదాం నిన్ను గెలిపించిందే అనుకో. కాని ఇవాళ అదే నీ కొంప తీయొచ్చు గుర్తుంచుకో. స్త్రీబుద్ధి ప్రళయకారణమన్నారు. స్త్రీవల్ల పురాణాల్లో, చరిత్రల్లో, రాజకీయాల్లో, సవాలక్ష రంగాల్లో ఎందరో మహామహులు మన్నుగొట్టుకుపోయారు. ఈ జూదంవుంది చూశావ్? సప్తవ్యసనాలలో దీనంత కొంపదీసేది మరొకటి లేదు. ఎన్నడో నీకొంప తీస్తుంది. నాకు తెలుసు. అంచేత... '

'దవడ అలా వాచిపోయింది తమకు?'

'ఈ వ్యసనంనుంచి నువ్వు గనక బయటపడకపోతే– నే ప్రమాణం చేస్తున్నాను – ఎంతటి పాపులనూ పీచులనూ క్షమించే ఆ సర్వేశ్వరుడు కూడా రక్షించడు' అన్నారు ఆచార్యులవారు.

'మీ తలకు బాగా దెబ్బలు తగిలినట్లున్నాయి స్వామీ?'

'పది కాలాలపాటు బ్రతకవలసినవాడివి– ఈ పేకాటజోలికి పోకు జ్ఞానీ.'

ముప్పబూ, పంతులూ వచ్చారు.

'అంతంత దెబ్బలు – అందులో తలకూ, దవడలకూ తగిలాయంటే మీరలా అశ్రద్ధ చెయ్యకూడదు. ఎముకలు ఏమన్నా విరిగాయేమో చూసుకోండి. సెప్టిక్ అయితే మొత్తం శాల్తీ గల్లంతు'

'ఏమిటండీ ఆచార్లూ ఆ కట్లు?' అన్నాడు ముప్పబు

'కాలుజారిపడ్డాను ముప్పబూ బావిదగ్గర' అన్నారు ఆచార్యులవారు.

'బాగా దెబ్బలు తగిలినట్లున్నాయి?'

'తల పగలాల్సింది తప్పిపోయింది. భగవంతుడున్నాడు. జగద్రక్షకుడు.'

'తమ వయస్సు దెబ్బ బాటలా ఆచార్లూ' అడిగాడు బ్రహ్మజ్ఞాని.

'మూడేళ్ళయింది ఈ పాడు జూదంలో ధర్మరాజుదగ్గర్నుంచి– మహామహా వాళ్ళు మట్టికొట్టుకుపోయారు పత్తాలేకుండా.'–చెప్పారు ఆచార్యులవారు.

'చాలా ఘోరం! పెద్దవారనే జ్ఞానంలేకుండా – ఆ బుచ్చిబాబు తమని అలా గొడ్డును బాదినట్లు బాదడం మహాఘోరం – తమ పండిన వయస్సును చూసన్నా వదిలిపెట్టాల్సింది. ముప్పబూ! నువ్వు పంచాయితీ పెట్టించి – ఈ రావిచెట్టు క్రిందనే – ఆ బుచ్చిబాబుకు బుద్ధిచెప్పించాలయ్యా! ఊరికి తలకాయనంటావ్. ఇంత అన్యాయం జరుగుతుంటే చూస్తూ వూరుకుంటావా?'—నిగ్గదీస్తున్నాడు బ్రహ్మజ్ఞాని.

ముఖాన కొరడా చురక తగిలినట్లు ఎగిరిపడ్డారు ఆచార్యులవారు.

'శ్రీరామచంద్రప్రభో! కలికాలం నాయనా! బ్రహ్మజ్ఞానీ ఇంతటి దారుణమైన అభాండం నామీద వేసింది ఎవరు? నువ్వేనా?'

'పొరపడకండి స్వామీ! తమరు బుచ్చిబాబుమీద అఘాయిత్యం చేశారని కాదు నేనన్నది. ఇంచుమించు ఈ రావిచెట్టుకున్నంత వయసున్న తమలాటి పెద్దల్ని – ఆ బుచ్చిబాబు అలా గొడ్డును బాదినట్టు బాదడం తప్పంటున్నాను. తమరు ఏం తప్పు చేశారని అతగాడు ఇంతటి అఘాయిత్యం చేశాడో – ఈ రావి

చెట్టు క్రిందనే పంచాయితీ పెట్టించి ఆ బుచ్చిరాడీని పిలవబెట్టి నిగ్గదీయమంటు న్నాను.'

'గొడ్డును బాదినట్లు అంటున్నావ్ ఒకటికి పదిసార్లు? అసలు బుచ్చిబాబు నన్ను అలా కొట్టినట్లు నీ కెవరు చెప్పారు?'

'పంతులు చెప్పాడు. ఎవరికీ చెప్పొద్దని.'

'పంతులుకు ఎవరు చెప్పారు?'

'చలమయ్య షడ్రకుడు '

'అతగాడికి?'

'చలమయ్య.'

'చలమయ్య కెలా తెలుసు?'

'పున్నయ్య.'

'పున్నయ్యకు ఎవరు చెప్పారు?'

'మెరకదిబ్బ ఎంకి.'

'ఎంకి?'

'ఆచార్యవర్యా! ఈ సంగతి స్వయంగా ఎంకితో తమరే చెప్పుకు గొల్లు మన్నారట! అర్ధరాత్రిదాకా అక్కడే కాపు పెట్టించుకున్నారట!!'ఈ కదిలిపోతున్న పళ్ళు ఇంక నిలిచేనా?–' అంటూ ఎంకిని కావలించుకుని గుక్కలుపెట్టి ఏడ్చారట! మున్సబూ! పంచాయితీ పెట్టించు. అన్నీ తేలిపోతాయి' అంటూ మరీ రెచ్చి పోయాడు బ్రహ్మజ్ఞాని.

'శ్రీరామచంద్రప్రభో!' అంటూ మూలిగారు ఆచార్యులవారు. ప్రాణం శరీరాన్ని వదిలిపోయేముందు వినిపించే జీవుని వేదన అది.

వేదాంతాచార్యులవారు పరమ వేదాంతిలా నవ్వారు పావుగంటకు తేరుకుని.

పరిస్థితులు విషమించినప్పుడే అవసరం ధైర్యం. పలికింది కొంకు అవి తేలిపోయినప్పుడే అవసరం బుకాయింపు – అనే సిద్ధాంతాన్ని నమ్మిన మనిషి ఆచార్యులవారు. కర్తవ్యం గురించి ఆలోచిస్తూ – కాసేపు ఆ రావిచెట్టుక్రింద అలాగే కన్నుమూశాడు మహాయోగిలా. తన్మయంత గురక వినిపిస్తుంది. పల్లానికి పారేగుణం వుంటుంది నీటికి. ఎగిరే గుణం వుంటుంది పక్షికి. నీళ్ళల్లో ఈదే గుణం వుంటుంది చేపకు. అలాగే 'నిర్లిప్తత' అనే గుణం మహాఋషుల్లో వున్నట్లు మన ఆచార్యులవారిలో పుష్కలంగా వుంది.

ఎండవేడి తగ్గింది కొస్త. ఎంతో జోరుగా సాగుతున్నది పేకాట. అంత కంటె జోరుగా పడుస్తున్నాయి కబుర్లు. మున్సబుకు మూడే మూడు ఆటల్లో

తేబులు ఖాళీఅయిపోయాయి. మున్సబవే గౌరవంలేకుండా అప్పులు కుదర వన్నాడు బ్రహ్మజ్ఞాని. అంతే అన్నాడు పంతులు. మున్సబుకు జీవితంమీద విరక్తి కలిగింది. 'ఇంట్లో పెళ్ళాం పైసా అప్పుపెట్టదు తనకు. 'కాకట్టుకు వస్తువు పెట్టుకోకుండా — రాగిపైసాకూడా — ఆఖరికి నీ మొగుడికికూడా అప్పు పెట్టొద్దని మరీమరీ చెప్పిపంపింది మా అమ్మ నీతో కాపురానికి' అంది భార్య నాంచారమ్మ భర్త అనే గౌరవంలేకుండా. ఆలోచిండినకొద్దీ రోతపుదుతున్నది ప్రపంచంమీద. కషాయిగుడ్డలు కట్టుకుని పాంకోళ్లు తొడుక్కొని నరసంచారం లేని ఏ హిమాలయారణ్యాలకో పారిపోయి- మరో మర్రిచెట్టుక్రింద చుట్టకాల్చు కుంటూ జీవితశేషం గడపాలనిపించింది. ఈ మనుషులకంటె ఆ మహారణ్యంలో పులులూ సింహాలే నయం- అనుకున్నాడు. తన బాధ ఎప్పుడన్నా ఎవరికన్నా చెప్పుకోవాలనిపిస్తుంది. కాని ఒక్క వేదాంతాచార్యులవారు మాత్రం అప్పుడు తన గోడు వింటారు అవలిస్తూనే. తక్కినవాళ్ళకు అమాత్రం గౌరవం లేదు.

'ఎందుకూ అలా నీలో నువ్వు నవ్వుకుంటున్నావ్ బ్రహ్మజ్ఞానీ. ఆ వంబరం చూస్తే మళ్ళీ పదాం వచ్చినట్టుందే?'

'ఈ లోకనాథంగాడి వరస చూస్తుంటే....'

'మళ్ళీ ఏంచేశాడు?'

'నా బొంద వాడేంచేస్తాడు? ఈవూరి స్కూలుకి అవటానికి సంగీతం మాష్టరు గదా? వాడు సంగీతం పాడటం ఎప్పుడన్నా విన్నావ్ నువ్వు? గొర్రెతోక లాటి ఈ ఉద్యోగం అయనగారికి చాలదట. తగదట!— లోకుల కొంపలుముంచి చిటికెలమీద లక్షలార్జించాలని అయనగారి ఉబలాటం. పీడట! రాజయ్యకూతుర్ని పెట్టట! కలరు సినిమాట— తీస్తాడుట. మద్రాసూ, హైదరాబాదూ, బొంబాయీ తప్ప — ఈ వూరు అయనగారి టాలెంటుకు తగదట. అసలు ఈ పక్షిని ఎవ రుండమన్నారీ వూళ్ళో. పోవచ్చు. నిజమే. కాని అందుకు అజాతశత్రువులాంటి గంగిగోవులాటి. రాజయ్య కొంప ముంచాలా? కళావరు రాజా.'

'ఆల్‌కౌంట్.'

'అన్ని రోజులూ ఒక్కలా వుండవన్నారు. ఒకరోజు రైజూ మరోరోజు డౌనూ. నిన్న తీసుకున్నావ్ - ఇవాళ వడ్డీతో తిరిగి ఇచ్చేస్తున్నావ్. బాధపడక వంచు ముక్కలు ఓ సిగరెట్టిచ్చి.'

మున్సబు మరో లంకపొగాకు చుట్టించి — బాధ మరచిపోవటానికి— గుండెలనిండా కమ్మటి పొగ పీల్చి – 'ఇప్పుడేం చేయమంటావు ఆచార్లూ ఆస్తి సమస్తం రాయించుకుని– అరగానీ అప్పుగాకూడా ఇవ్వనంటూ ఏకుమేకై కూర్చున్నది మా యింటిది!' అన్నాడు ఆచార్యులవారితో.

'పోనీ ఒక ఆలోచన చెప్పనా మున్సబూ?' అన్నారు ఆచార్యులవారు.

'చెప్పండి చూద్దాం'

'నువ్వు ఆ లోకనాథంతో పార్టనర్‌గా కలిసి–సినిమా తియ్యరాదూ? ఇన్నాళ్ళుగా పేకాటలో పోగొట్టుకున్న డబ్బు నాలుగింతలుగా ఒక్క దెబ్బతో వచ్చి పడుతుంది? ఆదర్శిలా మద్రాసు ఆంధ్రాక్లబ్బులోనో, హైదరాబాద్ బోటుక్లబ్బులోనో పెద్దాట లాడుకోవచ్చు.'

'ఇంతకూ ఆచార్లూ! ఆ చిట్టిబ్బాయి కొడుకు బుచ్చిగాడి దవడ పగిలిపోయేలా నిన్ను ఎందుకు బాదినట్లు. ఇది రూలూరై మూలేని వల్లకాడనుకున్నాడా ఊరనుకున్నాడా?'

'అసలు విషయం విను మున్సబూ! పాడురోజులొచ్చాయి. శ్రీరామా అంటే బూతుమాటైపోతే ఎలా చెప్పు? రాజయ్యకూతురు సంగీతం ట్యూషన్‌కి లోకనాథం ఇంటికి వెళ్ళిందా? అకస్మాత్తుగా తప్పతాగి వూడిపడ్డాడు చప్పపీనుగ, ఈ బుచ్చిగాడు. చలమయ్యకు రక్త విరోచనాలని వాళ్ళ పుత్రుడు చెపితే – పోనీ చూసొద్దాం ఏం పోయింది?– అని అలా బయలుదేరా– లోకనాథం ఇంటిముందుగా– నా దారిన నేను రామనామం స్మరించుకుంటూ నడిచిపోతున్నానయ్యా. లోకనాథం యింట్లోంచి గగ్గోలుగా కేకలు వినిపించాయి.'

'ఆ చిట్టిబ్బాయి కొడుకు ఇంతపని చేస్తాడన్నమాట!'

'పూర్తిగా విను. రాజయ్యకూతురు రేఖ వంటరిగావుండటం చూసి–అంటే– లోకనాథమున్నాడనుకో. వాడున్నా ఒకటే– లేకపోయినా ఒకటే గనక–ఒంటరిగ – అనే పదాన్ని ఉపయోగించాను ఆ చిట్టిబ్బాయి అబ్కారీ పాటలు పాడి కల్లుపాకలు నడిపించటం వీడికోసంలా వుందసలు.... అప్పులు తీసుకున్నవాళ్ళ దగ్గర్నుంచి దాదాగిరీ చెలాయించి– చక్రవడ్డీలు వసూలుచేసుకురమ్మని – ఈ తాగుబోతు కొడుకును పంపిస్తాడు. ఈ బుచ్చిగాడు వచ్చి బూతులతో రంకెలుపెడుతూ– బొడ్లో బాకుతో ఆడుకుంటూ హడలగొట్టి గూబలు పిండి బాకీ వసూలుచేసి సగం

తీసుకుని మిగిలింది తండ్రికి ముట్టచెప్తాడు. చిట్టబ్బాయి అలా ఉపయోగించు కుంటున్నాడయ్యా కుమారరత్నాన్ని- త్రాష్టుడు వచ్చాడయ్యా. త్రాగుబోతు వెధవకు ఉచ్చం నీచం అంటూ తెలుస్తాయా? అరిచింది అడకూతురు. నే అడుగు పెట్టాను. వచ్చినవాడు పనిచేసుకుపోవచ్చుగా ఆ లోకనాధాన్ని నడుం విరిగేలా నాలుగు తన్ని? పోనీ ఆడపిల్ల ఒంటరిగావున్నప్పుడు అదో వరస. చెట్టంత పెద్ద మనిషిని అక్కడే వున్నాగా? పచ్చి సంస్కృతంలో శృంగారం ఒలకబోస్తూ- దాన్ని రెక్కపుచ్చుకున్నాడయ్యా. మరో మనిషి ఎదురుగా లేకపోతే ఏమయేదో తెలియదు. ఎదురు తిరిగింది మాకోపం. ఎంత బజారుమనిషి కూడా పదిమందిలో మా పల్లిగ్గా సరసమాడతానంటే ఒప్పేసుకుంటుందా మున్సబూ? 'ఎన్నాళ్ళుగానో తిమ్మిరెక్కిపోతున్నానే. యవ్వారం ఇన్నాళ్టికి కుదిరింది' అంటూ ఎగబడ్డాడయ్యా. అది గుమస్తా 'ఏమిటా తొందర? ఎదురుగా ఆచార్లుగారున్నారు' అంటూ అదమాయించిదయ్యా అక్కడికీ 'ముసలాడా నువ్వెందుకొచ్చావ్?' ఎగిరి తన్నబోయాడు మున్సబూ. 'బ్రత రామకీర్తన పాడిస్తానంటూ పిలక దూడించబోయాడు.'

'తన్నబోయాడు. దూడించబోయాడు - అంటూ అలా మొహమాట పడుతున్నారెందుకు స్వాములూ?'

'నిజంగా వాడి దెబ్బలే తగిలితే చావల్సింది.'

'కీర్తిశేషులయ్యేవారు' అన్నాడు బ్రహ్మజ్ఞాని.

ఆచార్యులవారు మున్సబుకు చెబుతున్న కథ- నిజానికి రావిచెట్టు క్రింద అప్పుడున్న పెద్దలందరికోసం.

'లోకనాధాన్ని పిలిపిస్తా అసలు కథ బయటపడుతుంది. ఎవరూ అటు వెళ్తాంది. నువ్వా. ఒరే సాంబిగా మా పాలేరు పున్నయ్యను ఒకసారి లగెత్తుకు రమ్మను.'

'అయిందేదో అయిపోయింది. ఆ బుచ్చిగాడు యింకా కుర్రసన్నాసి. తగిలేదెబ్బా తప్పేదెబ్బా తెలియదు. ఈసారికి క్షమించేస్తే పోలా? మళ్ళీ పంచాయితీలూ పదిమందీ రావడం - ఈ గోలా రభసా ఎందుకు మున్సబూ?' అన్నారు ఆచార్యులవారు కంగారుపడిపోతూ.

'అయ్యా! ఆచార్యవర్యా? మీరలా కెంతేలుపడకండి స్వామీ! మీలాటి తలనెరిసిన పెద్దలకు అంత అవమానం జరిగాక - తప్పుచేసినవాళ్ళని శిక్షించ

తుందా- ఊరుకునే మనిషి కాదు మున్సబు. పంచాయితీ పెట్టించితీరగలడు. అసలే పట్టుదలమనిషి.'

'ఔను అచార్లూ! పంచాయితీ పెట్టించాల్సిందే. తప్పుచేసినవారిని శిక్షించాల్సిందే. చిట్టిబాబు కొడుకైనా సరే. ఆ పరమశివుడి కొడుకైనా సరే న్యాయం అందరికీ ఒక్కటేనయ్యా. అయినా నేనే తప్పుచేశాననుకో. పంచాయితీలో ఆ విషయం రుజువైందనుకో. ఏంచేస్తానో తెలుసా! నా సొంత పాలేరు పున్నయ్యనే పిలుస్తాను మోకుతెచ్చి నన్ను ఈ రావిచెట్టుకు కట్టెయ్యమంటాను. వలుపుతెచ్చి నెత్తురొచ్చేదాకా నన్ను బాదమంటాను.'

'నువ్వు అంతటివాడవని మా అందరికీ తెలుసు గాని మున్సబూ! నిన్న రాజయ్యకూతురు విషయంలో తప్పుచేసిన మనిషిని ఏంచేస్తావో కాస్త చెప్పు!' అన్నాడు బ్రహ్మాజ్ఞాని.

'చూద్దుగాని- చెట్టుకు కట్టిస్తా. కొరడాదెబ్బలు కొట్టిస్తా. కోలు వలిపిస్తా. బుర్ర సాంతం గొరిగిస్తా, సున్నపుబొట్లు పెట్టిస్తా. కోటప్ప సన్నాయిమేళంతో పన్నాసిని డాంకాలవదాకా గాడిదమీద కూర్చోపెట్టి ఊరేగింపుగా తీసుకెళ్ళి డాంకాలువలో తోయించేస్తా.'

'అంతపని చేస్తావా మున్సబూ?'

'అహ! ఇంకా తిక్కరేగితే, ఈ రావిచెట్టుకే ఆ తప్పుచేసిన గాడిదను తలక్రిందులా వ్రేలాడగట్టిస్తా. నిప్పెట్టి నిలువునా తగలబెట్టిస్తా' అంటూ ఆలవికాని రాజసం పుట్టిపడేలా మీసం దువ్వాడు మున్సబు.

'మరి అలా పప్పుకుంటుందా మనుషుల్ని తగలబెట్టటానికి!'

'నే నెవరిని?' అన్నాడు మున్సబు రెచ్చిపోయి మంచుని.

'ఏమిటి మున్సబూ ఆ వీరావేశం?'

'నేను ఎవర్నీ అంట?'

'ఏమిటా ప్రశ్న?'

'ఈ పూరి మొత్తానికి మున్సబును!'

'ఎవరు కాదన్నారు? కూర్చో!'

'నే కూర్చోను. మున్సబంటే ఎవరు?'

'అదీ నువ్వే చెప్పు!'

'ఊరికి పెద్ద.'

'ఏమిటీ.

'మున్సబు అంటే ఊరికి తలకాయలాటి మనిషి.'

'ఇంత గొప్ప విషయం నీ కెలా తెలిసింది మున్సబూ!'

'కరణం చెప్పాడు నిన్న సందేళ.'

'వీళ్లే ఇన్నేళ్ళకైనా ఆ రహస్యం చెప్పాడు కరణం. కొంపలు తీయడం ఆతగాడి వృత్తిధర్మం. కరణం దారితప్పాడు మున్సబూ. బ్రహ్మంగారు చెప్పారు కలికాలంలో కాలనాగు కరిస్తే అమృతం చిందే ప్రమాదం వుందన్నాడు. మున్సబూ గుర్తుకు తెచ్చుకో! ఆ మాట నిజంగా నీకు చెప్పింది కరణమేనా! చుక్క మత్తులో ఒకరు ఇంకొకరు అనుకోలేదు గదా! వెరిఫై చేసుకో బుర్ర గోక్కుని.'

'పున్నయ్య వస్తున్నాడు.'

'నా చెయ్యి మంచి రైజులోవుండగా వచ్చిపడింది ఈ దిక్కుమాలిన పంచాయితీ '

'ఏం పున్నయ్యా! వస్తున్నాడా లోకనాథం!'

'స్కూల్లో లేరండీ! నాలుగు రోజులుగా కనిపించటంలేదండీ.'

'ఎంత అమాయకుడివి పున్నయ్యా! స్కూల్లో ఉద్యోగం చేస్తున్నంత మాత్రాన - ఆయనగారు రోజూ స్కూలుకు వెళ్ళాలని వుందా ఏమిటి! అప్పు డప్పుడు తనిఖీ ప్రాయంగా వెళ్తాంటాడంతే. ఏదైనా స్కూలుకు కప్పు వుందో వూడిపోయిందో తెలుసుకుంటానికి.'

'ఇంటికాడ చూసిరా! చూడు! అలాగే చిట్టిబ్బాయినీ, కొడుకు బుచ్చి బాబునూ. తిర్నాన్నీ తూకేసుకురా పంచాయితీ పెడుతున్నారు మున్సబుగారు- అని చెప్పి, రాజయ్యను తూతురితో రమ్మను. అర్థరు'.

'అలాగేనండీ' - వెళ్తున్నాడు పున్నయ్య.

'పంచాయితీ పెట్టించక తప్పదా మున్సబూ!' అన్నారు జాలిగా ఆచార్యం వారు.

'తప్పదు ఆచార్లూ! టంకా వేయించి మరీ పెట్టిస్తాను.'

అన్నమాట నిలబెట్టుకుంటాడు మన్సబు' ఎక్కిస్తున్నాడు బ్రహ్మాణ్ణావి.




'నా బాధతోనే చస్తుంటే– అన్నీ తెలిసుండీ ఈ అఘాయిత్యం ఏమిటి బ్రహ్మజ్ఞానీ? నువ్వు ఇలాగే మాట్లాడుతూ– ఈ జూదంలో కూరుకుపోతే– అనక– సర్వనాశనమైపోతావు. అప్పులవాళ్ళు తరుముకొస్తుంటే ఎవరికీ చెప్పకుండా కట్టుగుడ్డలతో దేశాలు తెగించి పారిపోతావు. బైరాగుల్లో చేరి ముష్టెత్తుకుంటూ గంజాయిదమ్ము పీల్చుకుంటూ పాడుబడ్డ సత్రాల్లోనూ, వల్లకాళ్ళల్లోనూ దిక్కుమాలిన బ్రతుకు బ్రతుకుతూ జీవితశేషం గడపవలసివస్తుంది. నీకు ఉసురు తగుల్తుంది. నిన్ను ఏడుజన్మలు పట్టి పీడిస్తుంది బ్రహ్మజ్ఞానీ' అన్నారు ఆచార్యులవారు దవడపట్టుకుని మూలుగుతూ.

'ఆ బిచ్చివాణ్ణి విన్నలా వదిలిపెట్టటం మహాపాపం ఆచార్లూ' అన్నాడు జ్ఞాని.

'మళ్ళీ హాస్యమా బ్రహ్మజ్ఞానీ! నీలాటి బోడి పేకముక్కల ఆట ఆడలేక నేనా ఇంత నేవిలా ఈ రావిచెట్టుక్రింద కృష్ణారామా అంటూ కూర్చోవడం? జూదంవుంది చూశావ్? అది అగ్నిహోత్ర సమానమని నాకు తెలుసు. దీపంపై మోజుపడే శలభం జూదరి. ఈ పేకాట యజ్ఞంలో నువ్వు బూడిదై పోతావని నా కెప్పుడో తెలుసు'.

'నాకు తెలిసింది కూడా చెప్పనా, ఆచార్యవర్యా.'

'అక్కర్లా.'

కోసం ఎదురుచూస్తున్నారు సర్వులూ.

'తమకు గూడా ముక్కాలు పంచమంటారా ఆచార్యవర్యా?' అన్నాడు బ్రహ్మజ్ఞాని.

'ఉత్త మదాముల్లో ఏ ఆటా ఆడగూడదని ఆచార్యులవారి నియమం'.

'ఏమిట్ట?'

'అసలు మదాములు కావాలి! కాను మరి! జన్మతహా రసజ్ఞులుగానే పుట్టారు. ఆచార్యులవారు రసజ్ఞునిగానే పెరిగారు. రసజ్ఞుని హోదాలోనే ఈ లోకం వదిలిపోవాలనే కృషిచేస్తున్నారు. ఆ విషయం తెలియని బుచ్చిబాబు.........'

'చూస్తా చూస్తా అంతు తేల్చిస్తా ఇవ్వాళ' అంటూ ఆచార్యులవారి ముఖంలోకి చూశాడు మున్సబు

పదిళం పట్టింది ఆచార్యులవారికి. ముక్కాలు ఎగబీలుస్తున్నారు. నడుం

